శ్రీమతే రామానుజాయ నమః







# ఆళ్వారాచార్య సంగ్రహ చరిత్రలు



పాలవంచ తిరుమల గుదిమెళ్ళ
వేంకటలక్ష్మీనృసింహాచార్యులు

శ్రీమతే రామానుజాయ నమః







# ఆళ్వారాచార్య సంగ్రహ చరిత్రలు



పాలవంచ తిరుమల గుడి మెళ్ళ
వేంకటలక్ష్మీనృసింహాచార్యులు

# ఆళ్వారాచార్య సంగ్రహ చరిత్రలు

ప్రథమ ముద్రణము

సంవత్సరము 1994

కాపీలు 1000



మూల్యము :- రు 60/-

ముద్రణ:

వేంకటలక్ష్మీనృసింహ ప్రెస్

మచిలీపట్టణము

ప్రతులకు:-

శ్రీమాన్ పాలవంచ తిరుమల గుదిమెళ్ళ

వేంకటలక్ష్మీనృసింహాచార్యులు

23/329, బచ్చుపేట,

మచిలీపట్టణము 521 001

---

తిరుమల తిరుపతి దేవస్థానమువారి

ఆర్థికసహకారముతోను ముద్రితము

# విషయసూచిక


| విషయము | | పేజీ | |
|---|---|---|---|
| అవతారిక/పొయ్‌గై యాళ్వార్లు | | | 1/3 |
| భూతత్తాళ్వార్లు/ పేయాళ్వార్లు | | | 6/9 |
| తిరుమళిశై యాళ్వార్లు(భక్తిసారులు) | | | 11 |
| నమ్మాళ్వార్లు/మధురకవులు | | | 24/26 |
| కులశేఖరులు | పెరియాళ్వార్లు | 34 | 39 |
| ఆండాళ్ | తొండరడిప్పొడియాళ్వార్లు | 48 | 54 |
| తిరుప్పాణిఆళ్వార్లు | తిరుమంగై ఆళ్వార్లు | 64 | 69 |
| శ్రీమన్నాథమునులు | శ్రీపుండరీకాక్షులు | 87 | 98 |
| కురుకైకావలప్పన్ | శ్రీరామమిశ్రులు | 99 | 99 |
| శ్రీయామునాచార్యులు | | | 102 |
| తెయ్‌వవారియాణ్డాన్ | | | 112 |
| శ్రీపరాంకుశదాసులు (పెరియనంబి) | | | 113 |
| పెరియతిరుమలనంబి | | | 114 |
| గోష్ఠీపూర్ణులు | తిరుమాలైయాణ్డాన్ | 116 | 116 |
| మారనేర్నంబి | తిరుక్కచ్చినంబి | 117 | 117 |
| చోళరాజు యామునుల నాశ్రయించుట | | | 118 |
| తిరుకణ్ణమంగై యాణ్డాన్ | | | 123 |
| **శ్రీరామానుజాచార్యులు** | | | **124** |
| లక్ష్మణార్యుల జననము | వేదాన్తాధ్యయనము | 125 | 125 |
| యాదవుని కాశీయాత్రా వ్యాజము | | | 126 |

| | |
|---|---|
| పెరుందేవీవరదులు కంచికి తెచ్చుట | 128 |
| గోవిందుడు శైవుడగుట | 128 |
| బ్రహ్మరాక్షస విమోచనము | 130 |
| వరదునికి తీర్థకైంకర్యము | 133 |
| యామునుల చరమదశ | 134 |
| యామునుల చేతి వ్రేళ్ళు తెరిపించుట | 135 |
| తిరుక్కచ్చినంబి శేషమును స్వీకరింపనెంచుట | 136 |
| వరదుని షడ్వార్తలు | 36 |
| పంచసంస్కారముల బడయుట | 137 |
| ఆశ్రమ స్వీకారము | 138 |
| ఆళ్వాన్ ఆణ్డాన్ల ఆశ్రయణము | 140 |
| యాదవుడు శిష్యుడగుట | 140 |
| శ్రీరంగప్రవేశము 　 ఎమ్బార్ల దిద్దుబాటు 142 | 144 |
| ద్వయ, చరమముల బడయుట | 147 |
| తిరువాయ్మొళ్రి అర్థమును వినుట | 152 |
| చరమోపాయమును వినుట | 154 |
| శిష్యాచార్య అనువర్తన విధము | 156 |
| తళిహారు కిడాంబిఆచ్చాన్ | 157 |
| యజ్ఞమూర్తి శిష్యుడగుట | 158 |
| అనంతాళ్వానుల ఆచార్యనిష్ఠ | 163 |
| శార్వాసారామలమ్మ వైభవము | 166 |

ఆచార్య తీర్థప్రసాద వైభవము 171
యజ్ఞేశుని పశ్చాత్తాపము 171
విఠ్ఠలదేవుని ఆశ్రయణము 172
శ్రీనివాససందర్శనము గోవిందుని ఆచార్య నిష్ఠ 173 176
గోవిందుని వైరాగ్యము 180
శ్రీభాష్యాది రచనలు దిగ్విజయయాత్ర 182 184
వైష్ణవనంబి శ్రీభాష్యకార బిరుదము 186 187
కృత్తికానిరసనము 189
శ్రీజగన్నాథు నిరంకుశత 190
శ్రీకూర్మ సముద్ధరణ సింహాచలయాత్ర 192 194
కృష్ణమాచార్య శిష్యత్వము 194
వేంకటేశునకు శంఖచక్ర ప్రదానము 1[illegible]7
తిల్లగోవిందుని ప్రతిష్ఠ కూరేశుల చరిత్ర 200 20
శ్రీపరాశర, వ్యాసభట్టరులు 205
శ్రీపరాశరభట్టరువైభవము 207
భట్టరు సర్వజ్ఞభట్టు నోడించుట 208
భట్టరు వేదశాస్త్రాధ్యయనము 209
భట్టరు రంగనాథదంపతుల తల్లిదండ్రులుగ భావించుట 210
భట్టరు వివాహము 210
ముదలియాణ్డాన్ వైభవము 211
మారనేరినంబి చరమదశ 213
మూగకు ముక్తినిచ్చుట 215
ఆచార్యులే మోక్షోపాయము 216

| | | |
|---|---|---|
| ధనుర్దాసుని చరిత్ర | | 216 |
| భాగవతాపచార క్రౌర్యము | | 221 |
| అత్తుళాయమ్మ వైభవము శ్రీవైష్ణవ లక్షణము | 223 | 224 |
| జలజంతు మోక్షప్రదానము | | 226 |
| యతీంద్రుల సర్వజ్ఞత | | 227 |
| గోష్ఠీపూర్ణ పత్నీ వైభవము | | 227 |
| శ్రీరంగామృతకవీంద్రులు | | 228 |
| ఆచార్యనిష్ఠ ప్రపన్న శ్రేయోమార్గము | 234 | 235 |
| తిరుప్పావై తన్మయత | | 237 |
| కొంగుపిరాట్టి/ విషమిశ్రతీర్థము | | 238/239 |
| ఆరాయిరప్పడి అవతరణము | | 239 |
| రంగని గుడి బీగముద్రల గొనుట | | 241 |
| కూరేశుని మార్దవము కూరేశుని వానప్రస్థము | 242 | 242 |
| గొల్లదానికి మోక్షమిచ్చుట | | 243 |
| అనంతాళ్వాన్ల వైభవము | | 244 |
| వడుగనంబి వైభవము | | 246 |
| గద్యత్రయావతరణము క్రిమికంఠుని జననము | 249 | 251 |
| కొంగుపిరాట్టి ఆదరణ మిథిలసాలగ్రామము | 257 | 259 |
| విఠ్ఠలరాయని ఆశ్రయణము బౌద్ధనిరాసనము | 260 | 261 |
| యదుశైల సముద్ధరణ ఢిల్లీ విజయము | 261 | 263 |
| సంపత్పుత్రులకు సుల్తానుపుత్రిక నర్పించుట | | 265 |
| సుల్తానుపుత్రిక అర్చారూపము | | 266 |

సంపత్కుమారుల ప్రతిష్ఠించుట 267
ఆలయమున పంచముల ప్రవేశాధికారము 267
కబీరు చరితము యదుగిరి నామాంతరములు 268 270
కూరేశాదుల సమాచారము 271
గోష్ఠీపూర్ణుల చరమదశ క్రిమికంఠుని దుర్మరణము 274 275
యదుగిరిన యతిరాజ విగ్రహ ప్రతిష్ఠ 275
శ్రీరంగప్రవేశము 276
కూరేశులకు నేత్ర ప్రదానము 277
కూరేశుల అంతిమయాత్ర 278
ఆశ్రితుల వివరణము/సింహాసనాధిపతులు 281/284
ఆచార్యపురుషుల నియమనము 286
కైంకర్యపరుల వివరణము 286
యతిరాజ వైభవ ప్రకాశకులు ఆచార్యవైభవము 288 296
భూతపురిన యతిరాజ విగ్రహ ప్రతిష్ఠ 298
ఉడైయవరుల అంతిమయాత్ర చరమోపదేశము 299 300
దేహత్యాగము-పరమపదప్రాప్తి 301
చరమకైంకర్యము 302
ధనుర్దాసుదంపతుల అంతిమదశ 304
ఎమ్బార్ల చరమయాత్ర 305
**శ్రీపరాశరభట్టరు వైభవము 309**
తైత్రియాత్ర/యదుగిరిసందర్శనము/ 309/311
వేదాంతిని జయించుట శ్రీరంగప్రవేశము 312 315

| | | |
|---|---|---|
| వేదాన్తి ఆశ్రమ స్వీకారము | | 315 |
| నంజియ్యరు ఆచార్యనిష్ఠ | | 317 |
| భట్టరు తిరుక్కోట్టియ్యూరు జేరుట | | 320 |
| భట్టరు శ్రీరంగము జేరుట | | 323 |
| భాగవత వైభవము సముపదేశములు | 323 | 324 |
| భట్టరు పరమపద యాత్ర | | 331 |
| నంజీయరు ప్రభావము | | 334 |
| **నంబిళ్ళ వైభవము** | | **340** |
| పిన్బళగియ పెరుమాళ్ జీయర్ ఆచార్యనిష్ఠ | | 340 |
| కందాడై తోళప్పర్ అపచార క్షామణము | | 343 |
| లోకాచార్యనామ ప్రసిద్ధి | | 343 |
| అమ్మంగి యమ్మాళ్ పరమపదించుట | | 344 |
| ఆచార్యభక్తి వెల్లువనుండి దాటించుట | | 344 |
| ఉభయవిభూతులు ఆచార్యాధీనము | | 346 |
| మోక్షప్రాప్తి కావశ్యకములు | | 347 |
| వైష్ణవునకు దేవతాన్తరస్పర్శ కూడదు | | 348 |
| భగవద్గీతకన్న తిరువాయ్ మొళి ఆధిక్యత | | 349 |
| అవైష్ణవుని అనాదరణమే అపేక్షితము | | 349 |
| శ్రీవైష్ణవుడు దేహరక్షణ మొనర్పరాదు | | 350 |
| ఆచార్య పుత్రపౌత్రులును ఆదరణీయులే | | 351 |
| ఆచార్యశ్రీసూక్తి అధిక ధనసంపద నిచ్చును | | 352 |

ఆచార్యాజ్ఞ లేక చెప్పుటయు వ్రాయుటయు కూడదు 354
ఈడు వ్యాఖ్యావతరణము 354
గ్రన్థ సేవనమున ఆభిజాత్యము కూడదు 355
వడక్కుత్తిరువీధిపిళ్ళ పుత్రసంతతి 357
ఆహారశుద్ధి ఆవస్యకత 358
ఆచార్యసంబంధమే మోక్ష హేతువు 359
నంబిళ్ళ అంతిమ దశ 360
పెరియవాచ్చాన్పిళ్ళ వైభవము 360
వడక్కుత్తిరువీధిపిళ్ళ వైభవము 362
భగవద్విషయ (ఈడు) ఆచార్య పరంపర 363
పిళ్ళలోకాచార్యఅళ్గియమణవాళ పెరుమాళ్ నాయనార్లు 363
ఆచార్యహృదయ గ్రంథావతరణము 364
శ్రీరంగనాథుని ప్రవాసము 366
శ్రీరంగనాథుని శ్రీరంగప్రవేశము 368
శ్రీశైలేశులు అను తిరువాయ్మొళిప్పిళ్ళ 369
శ్రీమణవాళమామునుల వైభవము 370
దివ్యప్రబన్థ ప్రచార ప్రతిజ్ఞ 372
శ్రీరంగ నివాసము 373
దివ్య దేశ సేవనము 374
ఆశ్రమ స్వీకారము 375
ఆచార్యహృదయగ్రన్థము నధికరించుట 377
తిరునారాయణపురత్తాయి వైరాగ్యము 377

| | |
|---|---|
| శేషస్వరూప ప్రదర్శనము | 378 |
| నారాయణ పరత్వము | 379 |
| పాషండధర్మములు | 381 |
| శంఖచక్రధారణ ప్రమాణములు | 382 |
| ఊర్ధ్వపుండ్ర మాహాత్మ్యము | 385 |
| ఆళ్వార్ల దివ్యప్రబన్ధముల అవతరణము | 386 |
| తిరువేంగడదాసుని ఆశ్రయణము | 387 |
| శ్రీరంగనికి మామునులు ఆచార్యులగుట | 388 |
| గ్రన్థరచనలు | 389 |
| కాలక్షేపపరులు వాదులాడరాదు | 390 |
| మఠములందు స్త్రీలుండరాదు | 390 |
| మఠముల జనసమ్మర్దముండరాదు | 390 |
| ఎఱుమ్బియప్పా ఆశ్రయణము | 391 |
| ప్రతివాదిభయంకరఅణ్ణన్ ఆశ్రయణము | 392 |
| అష్టదిగ్గజములు | 393 |
| దివ్యదేశములలో కైంకర్యపరుల నేర్పఱచుట | 393 |
| చింతచెట్టునకు మోక్షము | 393 |
| పెరియజీయర్ చరమదశ | 334 |
| తనియన్‌లు వాళ్తిరునామములు | 336 |
| వేదాన్త దేశికులు | 398 |


* * * * *

శ్రీలక్ష్మీహయవదన పరబ్రహ్మణే నమః

# శ్రీ రామాయణానుసారముగ చేతనునకు సీతమ్మతో పోలిక

శ్లో॥ దర్పోదగ్ర దశేన్ద్రియానన మనో నక్తంచరాధిష్ఠితే,
దేహేస్మిన్భవసిన్ధునా పరిగతే దీనాం దశా మాస్థితః,
అద్యత్వే హనుమత్సమేన గురుణా సన్దర్శితార్థః పుమాన్,
లఙ్కారుద్ధ విదేహరాజతనయా న్యాయేన లాలప్యతే.

మన శరీరములో నున్న మనస్సే రావణుడు. అర్జునుడు శ్రీకృష్ణునితో మనస్సునుగూర్చి చెప్పిన లక్షణములు రావణునకు సరిపడియుండుటచే రావణుని ఈశ్లోకము మనస్సుగా రూపించుచున్నది.

"చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే, వాయోరివ సుదుష్కరమ్."

రావణుడు చపలుడు. మనస్సును చపలమే. వాడు మిక్కిలి మదించి బాధించును. మనస్సుకూడ అట్టిదే. వానిని మించిన బలవంతులు లేరు. శరీరమున మనస్సును మించిన బలవంతులులేరు. వాడు చాల దృఢముగా నుండువాడు. మనస్సునకు నాశము లేకపోవుటచే నదియు నట్టిదే. ప్రతికూలమగు గాలిని విసనికఱ్ఱతో నడ్డజాలనట్లు రావణుని జయముకూడ నట్టిదే. వానికి దురాలోచనకై పది తలలు తోడుగానున్నవి. మనసునకును పదియింద్రియములు తోడుగా నున్నవి. రావణుని వాసస్థానమగు లంక సముద్ర

ముచే నావరింపపడియున్నది. మన శరీరమున్ను సంసార సాగరముచే నావరింపబడియున్నది. కామతరంగముతే కుంభకర్ణుడు. మనకుగల క్రోధావేశమే యింద్రజిత్తు. ఇంద్రియ వృత్తులే సీతమ్మ నావరించియున్న రాక్షసస్త్రీలు. అందు సీతమ్మ మిక్కిలి దీనదశలో నుండెను. మనమున్ను అట్టిదశలోనేయున్నాము. ఆమెను హనుమంతుడు రామతత్త్వము నెరింగించి యోదార్చెను. మనలనుకూడ మన ఆచార్యులు భగవత్తత్త్వమును బోధించి లాలించుచున్నారు. ఇట్లు సీతమ్మతో సంసారిచేతనునకు పోలిక సువ్యక్తము. సీతమ్మ యెట్లు తన రక్షణభారము నంతను శ్రీరామచంద్రునియందే యుంచి, తన రక్షణను తానేమియు గావించుకొనకయుండి యాయనచే రక్షింపబడెనో యట్లే మనమును మన రక్షణ భారమును భగవంతునియందే యుంచవలెను. ఆ తత్త్వము నెరింగించుటకే యీ వ్యాసము వ్రాయబడుచున్నది.

శ్రీరామచంద్రుడు తండ్రినుండి అరణ్యవాసాజ్ఞను బడసి లక్ష్మణస్వామితో కన్నతల్లియగు కౌసల్యాదేవికి ఆ వార్తను తెల్పి ఆమెను ఓదార్చి సీతమ్మ అంతఃపురమునకు వేంచేసెను. అచట ఆతడామెతో 'సీతా! నేను నాతల్లిదండ్రుల ఆజ్ఞను పాలించుచు పదునాల్గు సంవత్సరములుండుటకై అరణ్యమున కేగుచున్నాను. నీవిచ్చటనేయుండి ఎవ్వరికిని అప్రియము కలుగకుండునట్లుగ నా మాటను పాటించవలె'నని

సెలవిచ్చెను. ఆమె కొన్ని యుపపత్తులతో తనను కూడ నాత
నితో వనమునకు తీసికొనిపొమ్మని నిర్బంధించెను. 'భార్య
భర్త కర్ధాంగి యగుటచే భర్తతో సహానుష్ఠానాధికారము
ఆమెకున్నది మా నాయనగారు నన్ను నీకు అప్పగించినది
సహధర్మచారిణి కావలెననియేగదా! కావున నీకు వర్తించు
నాజ్ఞ నాకును వర్తించును. నాథా! నీకు వనవాసమిపుడా దే
శింపబడినది. కాని నాకు కన్యావస్థయందే వనవాస మాదే
శింపబడినది. వనవాసము మీరు సాహసించిన తప్పవచ్చు
నేమోగాని నా వనవాస మనివార్యము. 'లలాటలిఖితా రేఖా
పరిమార్ష్టుం నశక్యతే' అది యెపుడో అనుభవించి తీరవలసి
నదే. దానికి నేను ఒంటరిగా అనుభవించుటకంటె మీతో
కలసి యనుభవించుట నా భాగ్యము కదా!', ఇట్లెన్ని చెప్పి
నను శ్రీరాముడామెను తనతో తీసికొనివెళ్ళుట కంగీక
రించకుండుటచే ప్రణయకోపము వలనను, స్నేహమువల
నను 'కింత్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్' అనగా,
నీవు నన్నయోధ్యలో విడిచి యొంటరిగా నడవి కేగితివని విని
నచో నా తండ్రి 'ఒక స్త్రీ పురుషవేషమును ధరించి వచ్చి
నా కుమార్తెను పెండ్లాడె'నని యెంత విచారించునోయని
నిందించెను. ఈమాటలను మనస్సున నిడుకొనియే శ్రీరామ
చంద్రుడరణ్యమున ఖరదూషణాదులను సంహరించుటకు
లక్ష్మణుడు ఎంత ప్రార్థించినను ఒట్టుపెట్టి యడ్డి వారిని తానే

వధించెను. లక్ష్మణుడే యాపని చేసినచో తాను సీతతో నొక గుహలో కూర్చొని యుండవలసివచ్చెడిది. దానిచే నామె యారోపణ బలపడునుగదా!

మఱియు, శ్రీరామబాణము తగిలిన మారీచుడు చని పోవుచు రాముని కంఠస్వరముతో సీతాలక్ష్మణులను గూర్చి కేకపెట్టగా 'స్నేహః పాప మాశఙ్కతే' అనునటుల సీతమ్మ శ్రీరామచంద్రుని బలపౌరుషములను మరచి యాతనికేదో యాపద వచ్చెనని భయపడి యనరాని మాటలనాడి లక్ష్మణు నాతని సహాయమునకై పంపెను. మనపూర్వా చార్యులు రామనిందను భగవదపచారముగను, లక్ష్మణ నిందను భాగవతాపచారముగను పరిగణింతురు. సుందర కాండలో సీతమ్మయే స్వయముగ నాంజనేయునితో 'మమైవ దుష్కృతం కిఞ్చిత్ మహదస్తి నసంశయః' అని సమ్మతించెను. 'కిఞ్చిత్ దుష్కృత'మ్మని మొదటిదానిని, "మహద్దుష్కృత"మ్మని రెండవదానిని ఆమె నిశ్చయించు కొనెను. ఎందులకనగా-

"ఆరాధనానాం సర్వేషాం విష్ణో రారాధనం పరమ్,
తస్మాత్పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప"

అని భగవదారాధన కన్నను భాగవతారాధన యుత్తమమని పాటింతురు. శ్రీభాష్యకారులును తమ చరమావస్థలో యున్న భక్తులతో 'శ్రీవిష్ణో రవమాననాత్ గురుతరం

శ్రీవైష్ణవోల్లఙ్ఘనమ్' అనగా భగవంతునకు చేయు అపచారము కన్నను భాగవతులకు చేయు నపచారము పాపప్రచురమని సెలవిచ్చిరి. ఈ పాపఫలము ననుభవించుటకే తనకీ లంకావాసము తటస్థించెనని సీతమ్మ భావించెను.

సీతమ్మ లంకావాసమునకు మరియొక కారణము కూడ కలదు. పుంసాం దృష్టిచిత్తాపహారియైన, వైరాగ్యచక్రవర్తులగు మునీశ్వరులకు ఆలింగనాభిలాషను పుట్టించు సౌందర్యమూర్తియగు శ్రీరామచంద్రుడు తనకు వశవర్తియై దగ్గరనున్నను మాయాకల్పితమగు ఆకర్షకమైన సౌందర్యముతో మోహింపజేయునట్టి మృగరూపియైన రాక్షసుడు దగ్గర నడయాడుచుండ దానిని కోరుట పెద్ద దోషము కదా!

ఈ విధముగ భర్తయగు రాముని నిదించుట, భాగవతుడగు లక్ష్మణుని దూరుట, భగవదవతారమగు శ్రీరామును పేక్షించి ప్రాకృతమగు మాయామృగము నపేక్షించుటయను దోషములకు సీతమ్మ దుష్టజనాగ్రేసరులచే నిండియున్న లంకలో దీర్ఘకాలము క్రూరకర్మలగు రాక్షసస్త్రీలయొక్క తర్జనభర్జనలకు లోబడి దుఃఖము ననుభవించెను.

ఇటులనే చేతనుడును భగవంతుని, భాగవతులను దూషించి, ప్రకృతిగుణములగు సత్వరజస్తమస్సుల వికారములచే భోగ్యతాబుద్ధిని పుట్టించి సంసారమునందే నిమగ్న

లను గావించునట్టి ప్రాకృతపదార్థములను ప్రేమించి యా పాపఫలానుభవమునకై శరీరములో నుంచబడుచున్నాడు. మనస్సునకుగల దుర్గుణములలో రావణుడు దేనికిని తీసిపోడు కావున మనస్సే రావణుడు. మనస్సునకు తల ఆలోచించుటకు సాధనము. అట్టి తలలు రావణునకు పదిగలవు. శరీరములో నున్న మనస్సునకును, శరీరమును నడిపించుట కుపయోగించు రావణుని తలలవంటి పది యింద్రియములు కలవు. ఈ యింద్రియవ్యాపారములే సీతమ్మను అశోకవనమున చుట్టి యుండి దివారాత్రములు పీడించు రాక్షసస్త్రీలని చెప్పియుంటిని గదా! శరీరములో నున్న కామమే కుంభకర్ణుడు గదా! కుంభకర్ణునకెంత తిన్నను తృప్తిలేదు. 'న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి' అనునట్లు కామము విషయముల ననుభవించుచున్నకొలది పెరుగునుగాని తరగదు. కావుననే భగవంతుడు భగవద్గీతలో దీనికి ''మహాశనః'' అని బిరుదు నొసంగెను. అనగా, ''మహత్ అశనం యస్య సః'' అని దానికి వ్యుత్పత్తి. ఈ శరీరములోని, క్రోధమే యింద్రజిత్తు. వీడు కోపమునకు ప్రతినిధి. ''క్రుద్ధో హన్యాద్గురూనపి'' వీడు దైవీసంపన్నుడును, దేవతలకు ప్రభువునగు నింద్రునే యోడించెను. కావుననే భగవంతుడు భగవద్గీతలో దీనికి ''మహాపాప్మ'' అను బిరుదు నొసంగెను.

ఈ విధముగా లంకలోనున్న దుష్టపరివారమంతయు ఈ శరీరములో నుండుటచే దీనిని లంక యనవచ్చును.

ఇంతవరకు ఈ చేతనునకు సీతమ్మతో పోలిక సిద్ధించినది.

ఇక నీ చేతనునకు ఈ శరీరమునుండి విమోచనోపాయమునున్న సీతమ్మకు లంకనుండి విమోచనమును పోలియే యుండవలెను రావణుడు సామ దాన భేద దండోపాయములతో నెన్నివిధముల ప్రయత్నించినను సీతమ్మ వానికి లొంగక రామునియందే మనస్సు నుంచి రాత్రింబవళ్లాతనినే ధ్యానించుచు, దేహసౌఖ్యమును పాటించక, చలించక యుండిపోయెను. అటులనే మనమున్న శరీరభోగముల నాశ్రించుటయే మన కర్తవ్యముగా భావించక, కోరక లభించినవానితో సంతుష్టులమై భగవద్ధ్యానముతోనే కాలమును గడుపవలెను. ఆమెకు రావణుని నాశముచేయగల పాతివ్రత్య ప్రభావము పుష్కలముగ నున్నను.

"అసన్దేశాత్తు రామస్య, తపసశ్చానుపాలనాత్,
నత్వా కుర్మి దశగ్రీవ! భస్మభస్మార్హ తేజసా"

అనగా-''శ్రీరామచంద్రుని యాజ్ఞ లేకపోవుటవలనను, నేను తపోనిష్ఠలో నుండుటచేతను నా శక్తి నణచుకొనియున్నాను. (తపస్సు అనగా ప్రపత్తి) నేను నాశరణాగతినిష్ఠలోనున్నాను ఈ నిష్ఠలో నున్నవాడు తన రక్షణను తాను చేసికొనరాదని అష్టాక్షరీమహామంత్రమున మధ్యనున్న 'నమః' పదము చే భగవంతుడాదేశించెను. ఆ యాదేశమును శిరసావహించి

నేను నారక్షణోపాయమును విరమించియున్నాను'' అనెను. మరియు, ఆంజనేయులు లంకలోని అశోకవనములో సీత మ్మను సందర్శించినపుడు ఆమెయాతనితో ''రావణుడు నాకు ఒక నెల గడువిచ్చి యాలోగా తనకు స్వాధీనము కానిచో నన్ను చంపింతునని ప్రతిన యొనర్చియున్నాడు. ఈ లోపుగ శ్రీరామచంద్రుడు నన్ను విడిపించి తీసికొని వెళ్లు ఉపాయమునాలోచింపుము'' అనగా, ఆంజనేయులామాటను విని దుఃఖించి, భయంకరాకారమగు తన దివ్యరూపమును చూపించి శక్తిరస్తిహిమేవోఢుం లఙ్కామపిసరావణామ్'' 'అమ్మా! నేను ముహూర్తకాలములో లంకతోబాటు రావ ణుని కూడ తీసికొనిపోయి శ్రీరామచంద్రుని యెదుట పెట్ట గలను నిన్ను నా భుజములపై నిడుకొని శ్రీరామచంద్రుని చెంత చేర్చుట నాకెంతపని!' అనగా సీతమ్మ, ఆంజనేయూ! నేను నారక్షణకెట్లు నాశక్తిపై నాధారపడనో యట్లే పరుల శక్తిపైనను ఆధారపడను. కాని,

"శరైస్తుసఙ్కులాంకృత్వా, రామోపరబలార్దనః,
మాంనయేద్యదికాకుత్స్థః, తత్తస్యసదృశంభవేత్."

'శ్రీరామచంద్రుడు నిరపేక్షరక్షకుడు. ఆయన మనకొరకై చేయు రక్షణమును మనము అడ్డకుండుటయే చాలును. మన రక్షణను మనము చేసికొనుటయే ఆయన రక్షణ నష్టట. దానిని నేను చేయజాలను. శ్రీరాముడు స్వయముగ లంకకు

వచ్చి తన బాణపరంపరలచే దుష్టవర్గమునంతను చీల్చి చెండాడి నన్ను తీసికొనిపోయిన అది ఆయన స్వరూపమున కును, నా స్వరూపమునకును తగియుండును' అనెను.

అటులనే మనమును భగవద్గీతలో భగవానుడు 'సర్వ ధర్మాన్' అను శ్లోకములో నుపదేశించినటుల మోక్షోపా యముల నన్నిటిని విడిచి యాతనినే దిక్కని నమ్మియుండ వలెను. అందులకై

"శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే
శ్రీమతే నారాయణాయ నమః"

అని నిశ్చలచిత్తముతో నున్నచో శ్రీరాముడు సీతమ్మకు లంకావిమోచన ప్రతిబంధకములగు రాక్షసుల నందరను సంహరించి యామెను తన యొడిన కూర్చొన బెట్టుకొని పుష్పకవిమానమున అయోధ్యకు తీసికొనివెళ్ళి యామెతో నానందముగ పట్టాభిషిక్తుడైనటుల అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః అనునటుల ఆయన సాయుజ్య మును బడయుట కాటంకములుగానున్న మన పాపముల నన్ని టిని పరిహరించి మనలనుగూడ అర్చిరాదిమార్గముగా పరమపదమునకు చేర్చును.

ఇదియే శ్రీరామాయణము శోధించిన చేతనునకు సీతమ్మతోగల సామ్యము.

గోపాలాచార్యులు

శ్రీలక్ష్మీహయవదన పరబ్రహ్మణే నమః

## మంగళాశాసనము

శ్రీభగవదాజ్ఞచే నిత్యసూరులు ఆళ్వార్లుగా నవతరించి ప్రసాదించిన నాలాయిరదివ్యప్రబన్ధములు తమిళభాషలో నున్నవి. ఆ గ్రన్థములలో తెలియదగిన మహత్తర విషయములు పరిపూర్ణముగా నున్నను మన కర్థజ్ఞానము దుర్లభమగుటచే అనుభవము లేకున్నది.

వాని అర్థము తెలిసినచో మన ఆంధ్రప్రాంతీయులు మిక్కిలి ఆదరించి అనుసంధింతురను తలంపుతో శ్రీ ఉ. వే. **శ్రీమాన్ పాలవంచ తిరుమల గుడిమెళ్ళ వేంకట లక్ష్మీనృసింహాచార్యస్వామివారు** కృపజేసి నాలాయిరమును ఏ పదమున కర్థము ఆ పదము క్రిందనే వచ్చునట్లు నూతన ప్రక్రియతో రచించిరి.

ప్రస్తుతము ఆళ్వారాచార్యుల చరిత్రలను కూడ ఆంధ్రులకు సుబోధకమగు శైలిలో వచనముగ తెలిపినచో తమ కృషి పరిపూర్ణమగునను తలంపుతో దానినికూడ నిపుడు వ్రాసి ప్రచురించుచున్నారు.

ప్రపన్నులగు వైష్ణవులందరును ఈ నాలాయిర గ్రంథములను వలెనే, ఈ ఆళ్వారాచార్యుల చరిత్రమునుగూడ ఆదరించి భగవద్భాగవతాచార్య కటాక్షపాత్రులగుదురుగాక యని శ్రియఃపతిని ప్రార్థించుచు మంగళాశాసన మొనర్చుచున్నాను.

గోపాలాచార్యులు

శ్రీమతే రామానుజాయ నమః

# ఆళ్వార్ల సంగ్రహ చరిత్రలు

## అవతారిక

శ్రియఃపతియు, శ్రీవైకుంఠనివాసియు, నిత్యుల చేతను ముక్తులచేతను అనుభవింపబడువాడును, నిరతిశయ ఆనందయుక్తుడునునగు సర్వేశ్వరుడు, శ్రీవైకుంఠమునందలి భక్తులు తనను నిరంతర మనుభవించుచున్నట్లే, ఈ లోకము నందలి జనులును భక్తులై తన ననుభవించదగిన యోగ్యత యుండియు ప్రాకృతవిషయ చాపల్యముచే చెడిపోవుచుండు టచే వీరినెట్లైనను భక్తులనొనర్పదలచి వేదరూపశాస్త్రము నిచ్చియు, దాని వివరణములగు శ్రీరామాయణ మహా భారతములనబడు ఇతిహాసములను, భాగవతాది పదునెనిమిది పురాణములను ప్రవర్తింపజేసినను, వానిని చదివియు లేక పెద్దలచే నెఱిగియు తరించవలసియుండగా, నట్లుగాక అజ్ఞాన అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానములచే (అజ్ఞానమనగా, భగవంతుడే లేడనుట; అన్యథాజ్ఞానమనగా, భగవంతుడు కాని దేవతలను భగవానుడనుట; విపరీతజ్ఞానమనగా, ఐనభగవానుని కాద నుట.) మానవజన్మను వ్యర్థపఱచుకొనుచుండెడి వీరలపై దయగలవాడై అడవిలో తిరిగెడి మదపుటేనుగును స్వాధీన

పట్టుచుకొనదలచు ఆటవికులు ఆ దేజాతికిచెందిన ఏనుగు బొమ్మను జూపి స్వాధీనపఱచుకొనునట్లు, సంసారమను అడవిలో మదత్రయముచే [ధనమద, విద్యామద, అభిజన (గొప్పకులమున పుట్టితిననెడి) మదములతో] సంచరించెడి ఏనుగులవంటి సంసారులను స్వాధీనపఱచుకొనుటకై శ్రీ వైకుంఠములోని నిత్యసూరులనబడు అనంత, గరుడ, విష్వక్సేనాదులను, సుదర్శన, పాంచజన్య, కౌమోదకీ, నందక శార్ఙ్గాది ఆయుధరూపభక్తులను, వనమాలా, కౌస్తుభ శ్రీవత్సాది ఆభరణరూప భక్తులను జూచి మీరెల్లరును భూలోకమున మీమీయిష్టమగుచోట్ల యిష్టమగుకులములందవతరించి లోకులకు నాయందు భక్తినిగల్గజేయుడని యాజ్ఞాపించగా, వారెల్లరును వచ్చి అయోనిజులుగను యోనిజులుగను నవతరించి, శ్రీవైకుంఠమునందుగల తమజ్ఞానమున కెట్టి కొఱతయును లేనట్లు విశదతమజ్ఞానముచే సర్వేశ్వరుని ప్రత్యక్షసమానముగమనసున దర్శించి, వానిస్వరూప, రూప గుణ, అవతార చేష్టితములను కీర్తించగా, వారే ఆళ్వారులనియు వారనుగ్రహించిన గ్రంథములే నాలాయిర దివ్య ప్రబంధములనియు ప్రసిద్ధిగాంచినవి.

ఇట్టి ఆళ్వార్లు పదుగురు. వీరు పొయ్‌కై ఆళ్వార్ (సరోయోగి), పూదత్తాళ్వార్ (భూతయోగి), పేయాళ్వార్ (మహదాహ్వయులు). తిరుమళిశై ఆళ్వార్ (భక్తిసారులు),

నమ్మాళ్వార్, కులశేఖరాళ్వార్, పెరియాళ్వార్ (భట్టనాథులు, విష్ణుచిత్తులు), తొండరడిప్పొడియాళ్వార్ (విప్రనారాయణులు), తిరుప్పాణిఆళ్వార్, తిరుమంగైయాళ్వార్. వీరి చరిత్రలను తెలిసికొనినను, వారనుగ్రహించిన నాలాయిరదివ్యప్రబన్ధముల ననుసంధించినను అర్థానుసంధాన మొనర్చినను, వారలను సర్వేశ్వరుడు ఆళ్వార్లవలెనే మిక్కిలి ఆదరించి శరీరావసానమున జన్మలులేకుండ జేసి తనసన్నిధియగు పరమపదమునకుగొనిపోయి నిత్యసేవాభాగ్యము గల్గించును. కావున నెల్లరును వీరిచరితలను వీరి దివ్యప్రబన్ధములను అర్థయుక్తముగ ననుసంధింపదగును.

* * * * *

## 1. పొయ్కైయాళ్వార్లు

ఆళ్వార్లలో పొయ్కైయాళ్వార్లు మొదట ద్వాపరయుగమున ఎనిమిదిలక్షల అరువదివేల తొమ్మిదివందల సంవత్సరమగు సిద్ధార్థిసం॥ ఆశ్వయుజమాసమున శుద్ధ అష్టమీ జయవారము శ్రవణనక్షత్రమున కాంచీనగరమునందలి యథోక్తకారి సన్నిధియందలి పుష్కరిణిలో స్వర్ణమయ తామరపుష్పమున నయోనిజులుగ నవతరించిరి. వీరుపొయ్కై (సరస్సునన)న యవతరించుటచే పొయ్కైఆళ్వార్లని ప్రసిద్ధి బొందిరి.

వీరికి కాసారయోగి, సరోయోగి, సరోమునీంద్రులు అను నామాంతరములు గలవు. వీరు సర్వేశ్వరుని పాంచ జన్య (శంఖ) అంశమున నవతరించిరి.

వీరి ఆచార్యులు సేనముదలియార్లు (విష్వక్సేనులు). వీరి తిరువారాధనము ఆళ్వార్కళ్ నైనార్.

వీరు అజ్ఞానులైన సంసారుల సహవాసము సహించలేక అడవులయందు సంచరించుచు అన్నపానాదుల విడిచి భగవద్గుణములనే ధారక పోషక భోగ్యములుగా జేసికొని దివ్య యోగసంపన్నులై అనేక వేల సంవత్సరములు వేంచేసిఉండిరి.

వీరొకనాడు తిరుక్కోవలూరునకు వేంచేసి వర్షబాధచే నొక యింటిముందటి చిన్న అరుగుపై పరుండిరి. భూతయోగియు నచ్చటికి వేంచేసి 'అయ్యా! తిన్నెపై పరున్నవారెవరు?' అనియడిగిరి. అందులకు సరోయోగి, 'అయ్యా! నేనుభగవద్దాసుడనని సమాధానము జెప్పి తిరిగి మీరెవ్వరని యడిగిరి. అంత భూతయోగి 'నేను భగవద్దాసదాసుడ'నని సమాధాన మిచ్చి, దాసునకిచ్చట చోటుండునా?యన, సరోయోగియు నయ్యా! ఒకరికి పండుకొన చోటుకలదు, ఇద్దరికైనచో కూర్చొను చోటుండును గాన రండని పిల్చిరి. వారిరువురును కూర్చున్న తరువాత మహదాహ్వయులు (పేయాళ్వార్) వేంచేసిరి. వారిని జూచి యరుగుపైనున్నవారు, మీరెవ్వరని యడుగగా భగవద్దాసానుదాసుడనని జెప్పి, నాకిందు

చోటుండునా? యనగా ముగ్గురికైనచో నిల్చొనుటకు చోటుండునుగాన రమ్మని కోరిరి. అంత వారు ముగ్గురును నిల్చి, భగవద్గుణానుభవమొనర్చుకొనుచుండ తిరుక్కోవలూరిలోని ఆలయముననున్న నాయనార్ (సర్వేశ్వరుడు), సపరివారముగ వేంచేసి అదృశ్యరూపమున భక్తశిరోమణులగు వారి మధ్యన ప్రవేశించెను. అంతట వారు చోటు చాలక ఇరుకున బడుచు, నిందులకు కారణమేమని యోగదృష్టిచే జూచి, సపరివారుడగు శ్రియఃపతిని దర్శించి ఆనందాతిశయముచే అనుభవప్రవాహముగా నాముగ్గురు ముదలియాళ్వార్లును ఒక్కొక్కరు నూరుపాశురముల (పాటల) చొప్పున ననుగ్రహింపగా నవి వరుసగా ముదల్‌తిరువన్దాది, ఇరణ్డాన్దిరువన్దాది, మూన్ఱాంతిరువన్దాదియను దివ్యప్రబన్ధములాయెను. ప్రతిపాశురముయొక్క చివరిపదమును తరువాతి పాశురమునకు మొదలుగ నుండుటచే అంతము ఆదిగ కలవిగావున "అందాది"యని ప్రసిద్ధిగలిగెను.

పొయ్‌కైయాళ్వార్లు తమ 'ముదల్‌తిరువన్దాది'యందు శ్రీరంగము కంచి తిరుమల తిరుక్కోవలూరు దివ్యదేశము లందలి సర్వేశ్వరుని స్తుతించుచు తమయోగమహిమచే 3125 సం॥ భూలోకమున సంచరించి తిరుక్కోవలూరున పరమపదించిరి.

## వీరి తిరునక్షత్ర తనియన్

శ్లో॥ తులాయాం శ్రవణేజాతం। కాఞ్చ్యాం కాఞ్చనవారిజాత్।
ద్వాపరే పాఞ్చజన్యాంశం। సరోయోగినమాశ్రయే॥

శ్లో॥ కాఞ్చ్యాం సరసి హేమాబ్జె। జాతాం కాసారయోగినమ్।
కలయే యశ్శ్రియఃపత్యా। రరవిస్దీపమకల్పయత్॥

## వాళి తిరునామములు

శెయ్యతులావోణ త్తిల్ శెకత్తుతిత్తాన్ వాళియే।
తిరుక్కచ్చిమానకరమ్ శెళిక్కవన్దాన్ వాళియే।
వైయన్దకళినూఱుమ్ వకుత్తురైత్తాన్ వాళియే।
వనశమలర్‌క్కరువతిల్ వన్దమైన్దాన్ వాళియే।
వెయ్యకతిరోన్తన్నై విళక్కిట్టాన్ వాళియే।
వేఙ్గడవర్ తిరుమలైయై విరుమ్బుమవన్ వాళియే।
పొయ్‌కైముని వడివళకుమ్ పొఱ్పతముమ్ వాళియే।
పొన్ ముడియుం తిరుముకముం భూతలత్తిల్ వాళియే.

* * * * *

## 2. పూదత్తాళ్వార్లు

ముతలాళ్వార్లు ముగ్గురిలో పూదత్తాళ్వార్లు రెండవ వారు. వీరు భగవన్నిర్హేతుక కటాక్షలబ్ధదివ్యజ్ఞానముచే తిరుకడల్మల్లై (మహాబలిపురము) అనెడు దివ్యదేశమున

బండిగుఱిగింజపుష్పమున నయోనిజులుగ నావిర్భవించిరి. పూతమనగా యదార్థమనియు ఆత్మయనియు నర్థము. వీరు యథార్థమును తమ ప్రబన్ధమున జెప్పుటచేతను, జ్ఞానీ త్వాత్మైవమేమతమ్' అనెడి గీతావాక్యమురీత్యా జ్ఞానాధికులైన వీరు, సర్వేశ్వరునికి ఆత్మగానుండుటచేతను వీరికి పూదత్తాళ్వార్లనెడి తిరునామము ఏర్పడెను. భూతాహ్వయులనియు మల్లాపురాధీశులనియు వీరికి నామాంతరములు.

వీరు ద్వాపరయుగమున ఎనిమిదిలక్షల అరువదివేల తొమ్మిదివందల సంవత్సరమగు సిద్ధార్థి ఆశ్వయుజమాసమున శుద్ధనవమి బుధవారము ధనిష్ఠానక్షత్రమున నవతరించిరి.

వీరి ఆచార్యులు సేనైముదలియాళ్వార్లు (శ్రీవిష్వక్సేనులు). వీరి తిరువారాధనము ఆళ్వార్కళ్నైనార్లు. వీరు సర్వేశ్వరుని కౌమోదకీ (గద) అంశమున నవతరించిరి.

వీరు తమ దివ్యజ్ఞానముచే తిరుక్కోవలూరున సర్వేశ్వరుని సేవించిన యనుభవమును 'ఇరణ్డాన్తిరువన్దాది'యను దివ్యప్రబన్ధమున నూరు పాశురములచే ననుగ్రహించిరి. అందు వీరు పాడిన దివ్యతిరుపతులు, శ్రీరంగము తిరుమల మహాబలిపురము తిరుక్కోవలూరు కంచిఅష్టభుజము తిరుక్కోట్టియూరు తిరునీర్మలై

వీరు భగవద్గుణములనే ధారక పోషక భోగ్యములుగా

ననుభవించుచు దివ్యయోగసంపన్నులై 3125సంవత్సరములు భూలోకమున సంచరించి తిరుక్కోవలూరున పరమపదించిరి.

## వీరి తిరునక్షత్ర తనియన్

శ్లో॥ తులా ధనిష్ఠా సంభూతం। భూతం కల్లోలమాలినః।
తీరే ఫుల్లోత్పలే మల్లా। పుర్యామీడే గదాంశకం॥
నిత్యః మల్లాపుర వరాధీశం। మాధవీ కుసుమోద్భవమ్।
భూతం నమామి యోవిష్ణోః। జ్ఞానదీపమకల్పయత్॥

## వాళ్తితిరునామములు

అన్బేతకళినూఱుమ్ అరుళినాన్ వాళ్తియే।
ఐప్పశియిల్ అవిట్టత్తిల్ అవతరిత్తాన్ వాళ్తియే।
నన్పుకళ్ శేర్ కురుక్కత్తినాణ్మలరోన్ వాళ్తియే।
నల్ల తిరుక్కడల్మల్లై నాతనార్ వాళ్తియే।
ఇన్బురుకు శిన్దై తిరియిట్టపిరాన్ వాళ్తియే।
ఎన్బిల్ ఞానచ్చుడర్ విళక్కేత్తినాన్ వాళ్తియే।
పొన్పురై యుమ్ తిరువరంగర్ పుకళ్ ఉరై పోన్నాన్ వాళ్తియే।
పూతత్తార్ తాళిణై యిప్పూతలత్తిల్ వాళ్తియే॥

* * * * *

# 3. పే యా ళ్వా ర్లు

ముతలాళ్వార్లు ముగ్గురిలో పేయాళ్వార్లు మూడవ వారు. వీరు భగవన్నిర్హేతుక కటాక్షలబ్ధ దివ్యజ్ఞానముచే చెన్నపట్టణమునకు సమీపమున మైలాపురియందు మణికైరవమనెడి భావియందు ఎఱ్ఱకలువపుష్పమున ద్వాపరయుగమున ఎనిమిదిలక్షలఅరువది వేలతొమ్మిదివందలసంవత్సరమగు సిద్ధార్థినామసంవత్సరము ఆశ్వయుజమాసమున శుద్ధదశమీ గురువారము శతభిషానక్షత్రమున అయోనిజులుగ నవతరించిరి.

వీరు మహాయోగులై లోకమును క్రొంచెమైనను గమనింపక భగవంతునియందే మనసుగలవారై పిచ్చివారివలె సంచరించుచుండుటచే వీరికి పేయ్ (పిచ్చి) ఆళ్వార్లనెడి తిరునామమేర్పడెను.

వీరికి మైలాపురాధీశులు మహదాహ్వాయులు అను నామాంతరములు గలవు. వీరి ఆచార్యులు విష్వక్సేనులు. వీరి తిరువారాధనము ఆళ్వార్కళ్ నైనార్. వీరి శిష్యులు తిరుమఴిశై ఆళ్వార్లు (భక్తిసారులు). వీరు సర్వేశ్వరుని నందక (ఖడ్గ) అంశమున నవతరించిరి.

వీరు భగవానుని తిరుక్కోవలూరున దర్శించినప్పటి అనుభవమును నూరు పాశురములుగల మూన్ఱాన్తిరువన్దాది

యను దివ్యప్రబన్ధముగ ననుగ్రహించిరి. అందు వీరు పాడిన దివ్యతిరుపతులు, తిరువల్లిక్కేణి కాంచి తిరుమలై తిరువెఃకా వేళుక్కై తిరుక్కుడన్దై పాడకమ్ క్షీరాబ్ధి పరమపదము కడిక్కై తిరువిణ్ణకర్ శ్రీరంగము తిరుక్కోట్టియూర్ అష్ట భుజమును.

వీరును పొయ్కై, భూదత్తాళ్వార్లవలెనే తమదివ్య యోగమాహాత్మ్యముచే 3125 సంవత్సరములు భూలోకమున సంచరించి భగవద్గుణములనే అన్నపానములుగననుభవించుచు తిరుక్కోవలూరున పరమపదమునకు వేంచేసిరి.

## వీరి తిరునక్షత్ర తనియన్

శ్లో॥ దృష్ట్వా తుష్టావయో విష్ణుం। రమయా మయిలాధిపం॥
కూపే రక్తోత్పలే జాతం। మహదాహ్వాయ మాశ్రయే॥
నిత్య॥ తులా శతభిషగ్జాతం। మయూరపురికైరవాత్।
మహాన్తమ్ మహదాఖ్యాతం। వన్దే శ్రీనందకాంశకమ్॥

## వాళితిరునామములు

తిరుక్కణ్డేనెనునూఱుమ్ శెప్పినాన్ వాళియే।
శిఱన్ద ఐప్పశియిల్ శతయమ్ శెనిత్త వళ్ళల్ వాళియే।
మఱుక్కమ్మయిలై నకర్ వాழవన్దోన్వాళియే।
మలర్క్కరియనెయ్దల్ తనిల్ వన్దుదిత్తాన్వాళియే।

నెరుక్కిడవేయిడై కత్తియిల్ నిన్ఱ శెల్వన్ వాళ్ళియే।
నేమిశఙ్గన్ వడినళైకై నెఞ్జిల్ వైప్పోన్ వాళ్ళియే।
పెరుక్కముడన్ తిరుమళిశైప్పిరాన్ తొళుమువోన్ వాళ్ళియే,
పేయాళ్వార్ తాళిణైకళ్ పెరునిలత్తిల్ వాళ్ళియే॥

*　*　*　*　*

## 4. తిరుమళిశై ఆళ్వార్లు

ఆళ్వార్ల అవతారక్రమమున తిరుమళిశై యాళ్వార్లు నాల్గవవారు. వీరు భగవన్నిర్హేతుకజాయమానకటాక్షలబ్ధ దివ్యజ్ఞానులై తొణ్డమణ్డలమున తిరుమళిశై యనెడు మహీసార క్షేత్రమున ద్వాపరాంతమున ఎనిమిదిలక్షల అరువది రెండువేల తొమ్మిదివందల ఎనుబదితొమ్మిదవ (8,62,989) విభవనామ సంవత్సర పుష్యమాసమున కృష్ణపక్ష దశమీ గురువారము మఖానక్షత్ర తులాలగ్నమున భార్గవఋషికి ధర్మపత్నియందు అవతరించిరి.

వీరు తిరుమళిశైయందవతరించుటచే వీరికి తిరుమళిశై యాళ్వార్లని తిరునామమేర్పడెను. వీరు భగవానుని చక్రమగు సుదర్శనాంశముచే నవతరించిరి. వీరికి భక్తిసారులు మహీసారపురాధీశులు భార్గవాత్మజులు తిరుమళిశై అయ్యర్ మళిశైప్పిరాన్ అను నామాంతరములు గలవు. వీరు భార్గవ ఋషి సంతతియగుటచే అష్టాంగయోగవిద్య నభ్యసించిరి.

వీరి ఆచార్యులు పేయాళ్వార్లు. వీరి తిరువారాధనము శొన్నవణ్ణం శెయ్‌త పెరుమాళ్. వీరికి కణికణ్ణన్ దృఢవ్రతు లను నిద్దరు శిష్యులుగలరు.

వీరు నాన్ముకన్ తిరువన్దాది (96 పాశురాలు), తిరుచ్ఛన్ద విరుత్తము (120 పా)లను రెండు దివ్యప్రబన్ధముల ననుగ్రహించిరి. అందు వీరు పాడిన దివ్యతిరుపతులు, శ్రీరంగము, తిరుమలై, పెరుమాళ్‌కోయిల్, (కంచి) యథోక్తకారిసన్నిధి, తిరుక్కుడన్దై, తిరుప్పేర్, అమ్బిల్, కపిస్థలము, తిరువూరకము, తిరుప్పాడకము, తిరుక్కురుంగుడి.

వీరు యోగమహిమచే 700 సంవత్సరములు వేంచేసియుండి యితరమత నిరసనమొనర్చుచు విశిష్టాద్వైత సిద్ధాన్తమును స్థాపించుచుండిరి.

## వీరి ప్రభావ సంగ్రహము

భగవానుడు యదుకులమున నవతరించి గోపకులమున పెరిగినట్లు తిరుమళిశైయాళ్వార్లును ఒకేజన్మన రెండుజన్మలనతగినట్లు ఒకచోటపుట్టి మరొకచోట పెంచబడిరి. అ దెట్లన-

అత్రి, భృగు, వసిష్ఠ, భార్గవ, అంగీరసాది మహర్షులెల్లరును చతుర్ముఖబ్రహ్మవద్దకేగి భూలోకమున సారతమమగు క్షేత్రమును మాకు నిత్యవాసమొనర్ప జేయవలయునని ప్రార్థింప, బ్రహ్మయు విశ్వకర్మను రావించి పంచాశత్కోటి

యోజన(ఏబదికోట్లయోజనాల) విస్తీర్ణయగు భూమినెల్ల నొక ప్రక్కనుంచి విదేహాభవనక్షేత్రమగు తిరుమణ్ణైను ఒక ప్రక్కనుంచి తూపించ, ''ధాత్రాతులితాచ లఘుర్మహీ'' అన్నట్లు భూమినుంచిన ప్రక్క తేలికయై మణ్ణైక్షేత్రముంచినపక్క బరువగుటచే మణ్ణైకు మహీసారక్షేత్రమని పేరుగల్గెను. అంతట నా ఋషులును అచ్చట నిత్యనివాస మేర్పఱచుకొనిరి.

ఆ ఋషులలో భార్గవమహర్షి దీర్ఘసత్రియాగమున సర్వాన్తర్యామియగు శ్రీమన్నారాయణుని యథావిధి నర్చించుచుండిన కాలమున, భార్గవఋషి ధర్మపత్ని గర్భిణియై పన్నెండునెలలు నిండిన కాలమున దగ్గరన ప్రవహించు నదియందు స్నానమాచరించి ఒడ్డెక్కెడి సమయమున సమీపమున నెచ్చటనో పులి అరుపువిని ఉలికిపడగా భయముచే గర్భపాతమై మాంసపుముద్ద క్రిందపడెను.

అంతట నామె యా మాంసపుముద్ద నొక వేముపొదయందు పడవైచి స్నానము నర్చి భర్తృసేవకై వెడలి పోయెను.

ఆ మాంసపుముద్ద సుదర్శనాంశయగుటచే నాక్షేత్రమునందలి ఆలయముననున్న శ్రీ శ్రియఃపతులగు మంగవల్లీ జగన్నాథులిద్దరును నచ్చటికి వేంచేసి కటాక్షింప నా యుల్బము సర్వావయవములతో జీవమును బొందెను. ఆ శిశు

వును నా దివ్యదంపతులసేవించి మహోదానందము నందు చుండ వారిరువురును అదృశ్యమొంద నా యెడబావును సహించలేక శిశువేడ్చెను.

ఆ ప్రాంతమునకు వేముకర్రల నరకుకొనుటకు వచ్చిన 'తిరువాళన్' (శ్రీఖడ్గుడు) అను పేరుగల మేదరి యొకరు ఆ ఏడ్పును విని వచ్చి పసిబాలునిజూచి ఆనంద ముతో నెత్తుకొని వెళ్ళి తనభార్యయగు పంగయచ్చెల్వియను నామెకీయ, నామెయు బిడ్డలులేనిదగుటచే మిక్కిలిప్రీతితో నెత్తుకొని పుత్రునిగ నాలింగనమొనర్ప నామెకు చనులు చేపునకొచ్చెను. అంత నామె బిడ్డనికి పాలీయ, నాబిడ్డడును వానిని త్రాగక, ఏడ్వక, మలమూత్రరహితుడై దినదినాభి వృద్ధి జెందుచుండెను.

ఈ ఆశ్చర్యమును సంతానములేనట్టియు చతుర్థవర్ణ జాతుడగు నొక వృద్ధుడగు ప్రాజ్ఞుడు విని, భార్యతోగూడి మంచిపాలను బాగుగ కాచి తెచ్చి పంచశక్తిమయమగు శిశువుయొక్క దివ్యతేజస్సునుజూచి యాశ్చర్యపడి పాలను సమర్పించి త్రాగుమని అనేకవిధముల ఆళ్వార్లను ప్రార్థింప, నాతనియందలి దయచే నా పాలను వారారగించిరి. ఇట్లు కొన్నాళ్ళు జరిగినవెనుక నొకనాడు ఆళ్వార్లు త్రాగి మిగిలిన కొన్ని పాలను ఆ వృద్ధదంపతులకిచ్చి త్రాగు మన, వారవి త్రాగి యౌవనవంతులై యొక సత్పుత్రునిగనిరి.

విదురునివలె పరికాశించెడి యీ బాలునకు వారు 'కణికణ్ణన్' అని పేరిడి సకలవిద్యలజెప్పించిరి.

తిరుమళిశై యాళ్వార్‌ను తండ్రియింట నేడుసంవత్సరములవయసువచ్చువరకునుండి, జగత్కారణవస్తువు నెరుగగోరి, శాక్య, ఉలూక్య, అక్షపాద, క్షపణ, కపిల, పతంజలియను వేదమునంగీకరించని బాహ్యమతములందును; శైవ,మాయావాద, న్యాయ, వైశేషిక, భాట్ట, పారిభాకరాది వేదమున కపార్థముజెప్పు కుదృష్టిమతములందును ప్రవేశించి 700 సం॥ ఎంతగ వానియందుజెప్పినట్లుగ నాచరించినను ప్రయోజనము గన్పించకపోవుటచే చేయదగినది తెలియక నా మత గ్రంథములనెత్తిననిడుకొని గ్రామైకరాత్రముగాసంచరించుచు నొకచోట పేయాళ్వార్లనబడు మహదాహ్వయులు తలక్రిందులుగ చెట్టును(రోకలిని)నాటి చిల్లుకుండతో దానికి నీరును పోయుచుండుటను జూచిరి. అంతట తిరుమళిశైయాళ్వార్లు పేయాళ్వార్లను జూచి, అయ్యా మీారు పిచ్చివారివలెనుండిరి మీారు చేయు పనివలన నేమైన ప్రయోజనముకలదా? యనిరి. అందులకు పేయాళ్వార్ సమాధానముగ నయ్యా! మీా నెత్తిపైనున్న మతగ్రన్థములును ఆ మతములందు ప్రతిపాదింపబడిన దేవతలును మీాకు ప్రయోజనము కల్గించగలిగియుండగా. నా కెట్లన నీ చిల్లుకుండలో నీరు నిలువకుండునా? ఆ నీరు పడుటచే నీ చెట్టు (రోకలి) చిగిర్చకుండునా? యని సమాధానమిడిరి.

ఈ సమాధానము విన్న తిరుమళిశైయాళ్వార్లు వెంటనే పేయాళ్వార్లు మహాజ్ఞానులని గుర్తించి, వీరి వలననే పరతత్వనిర్ణయము లభించగలదని యెంచి, వారి పాదములపైబడి తత్త్వోపదేశమొనర్ప ప్రార్థించిరి. అంతట పేయాళ్వార్లు వీరికి పంచసంస్కారములొనర్చి మంత్ర మంత్రార్థముల నెఱింగించి, అందు ప్రతిపాదింపబడిన సర్వేశ్వరుని దివ్యాత్మస్వరూపమును, తదాశ్రియమగు జ్ఞానశక్త్యాది కల్యాణగుణములను, నీరెంటిని ప్రకాశింపజేయు దివ్యమంగళవిగ్రహమును, కిరీటాదినూపురాంతమగు దివ్యభూషణములను, దివ్యాయుధములను, లక్ష్మి మొదలగు మహిషీవర్గమును, దివ్యపరిజనవర్గమును, భోగవిభూతియగు పరమపదమును దర్శనసమానాకారముగ దెలియపఱచి, ప్రకృతి పురుష కాలాత్మకమగు లీలావిభూతియొక్క సృష్టి స్థితి సంహారములను అద్వారక సద్వారకములుగ జేయువాడు శ్రీమన్నారాయణుడనెడి వేదప్రసిద్ధిని దెలుప; జగత్కారణభూతుడును సర్వాంతర్యామియు పుండరీకాక్షుడును జగన్నాథుడునగు శ్రియఃపతిని హృదయకమలమున నిల్పి అష్టాంగయోగమున ధ్యానించుచు, ఏడువందల సంవత్సరములు గజేంద్రసరస్సునకు దక్షిణమున తిరువల్లిక్కేణి (తిరుమళిశై) యందు వేంచేసియుండిరి.

ఇట్లు భగవద్ధ్యానమునందుండి యొకనాడు బొంతకుట్టు

కొనుచుకూర్చుండ, ఆకాశమార్గమున నందివాహనులై పార్వతీపరమేశ్వరులు వెళ్ళుచూ వీరినిజూచి వీరెవరో తెల్సుకొనిపోదమని పార్వతియనగా నిరువురును వీరి దగ్గరకు వచ్చినిల్చిరి. అంత శివుడు వీరినిజూచి 'ఏదైనవరము గోరుకొనుడు, ఇత్తు'ననెను. అందులకు ఆళ్వార్లు మోక్షమిత్తురా? యనగా నది నారాయణునివల్లనేయగునుగాని నావల్లకాదనెను. అంతట వీరు క్షుద్రపురుషార్థముల నేమి కోరమనిరి. అయినను మేము వచ్చినందులకేదైన కోరుకొనుడని శివుడన అల్పపురుషార్థములనే యిచ్చుచో బొంత కుట్టుటకు సూదిలోదారము పడేనిదే యెక్కించుకొను శ్రమ లేనట్లు దానంతట నదే దూరునట్లు వరమిమ్మనిరి. అందులకీశ్వరుడు కోపించి తనకంటిమంటను ప్రసరింపజేయ ఆళ్వార్లును సుదర్శనాంశజులగుటచే తమ కాలి బొటనవ్రేలినుండి అగ్నిని ప్రసరింపజేయ చేయునదిలేక ఈశ్వరుడు అంబరీషునిచే దుర్వాసుడు అవమానపడినట్లు, అవమానింపబడి భాగవతోత్తములు దుర్జయులని భార్యకు తెల్పి, భగవద్భక్తిసారముగ గలవారగుటచే ఆళ్వార్లకు భక్తిసారులని బిరుదునిడి తమదారిన వెడలిరి.

భక్తిసారులును వెనుకటివలెనే యోగమున వేంచేసి యుండగా, యాదృచ్ఛికముగ పెద్దపులినెక్కి శుక్తిహారుడనెడి ఖేచరుడు ఆకాశమార్గమున బోవుచుండ, పెద్దపులియు

వీరికి పైభాగమున పోవజాలక నిల్చెను. అంత నాతడు క్రిందకు జూచి వీరిని అయ్యా! మీరీ బొంతను పారవైచి నేనిచ్చు వజ్ర నిర్మిత వస్త్రమును ధరింపుడనెను. భక్తిసారులును తాము గప్పుకొన్న బొంతను అమూల్యమగు మణులచే నిర్మించినదిగ గన్పింపజేయ, నా ఖేచరుడు తన మెడలోని హారముదీసి దీనిని ధరింపుడన వారును తమ మెడలోని తులసీపద్మాక్ష మాలలను నవరత్నహారములుగా గన్పింపజేయ, వీరు మహానుభావులని గొనియాడి యాతడు తనదారిన పోయెను.

మరల భక్తిసారులు తమయోగమున నిష్ఠులైయుండ కొంకణసిద్ధుడనెడి రసవాదియొకడు వచ్చి వీరికొక రసగుళి కను సమర్పింప వారు దానిని గ్రహింపక తమ శరీరమున మన్ను నలిచి యొక ఉండజేసి దానినీయ నాతడదిజూచి తనరసగుళికకన్న మిక్కిలి విలువగలదిగ గ్రహించి సిగ్గుపడి వెడలెను.

ఆ తరువాత భక్తిసారులు ఒక గుహాలో జేరి యోగ ముననుండ ముదలియాళ్వార్లు ముగ్గురును భగవద్గుణానుభవ మొనర్చుచు సుదూరమునుండి యప్రాకృత దివ్యతేజస్సును జూచి ఆశ్చర్యపడి వచ్చి సేవింప నుభయులును కుశలప్రశ్న లొనర్చుకొని ఆలింగనములతో మిక్కిలిప్రీతులైరి. అంతట నలుగురును ప్రయాణమై మయిలాపురిజేరి పేయాళ్వార్ల అవతారస్థలమగు కైరవతీర్థమును జేరియటకొంతకాలముండిరి

తరువాత ముదలియాళ్వార్లు భూసంచారమునకై వెడల భక్తిసారులును తమ యవతారస్థలమగు తిరుమళిశై జేరియట కొన్నిదినములుండి పొయ్కైయాళ్వార్ల అవతారస్థలమగు సత్యవ్రతక్షేత్రమందలి తిరువెఃకా దివ్యదేశమున ఏడువందల సంవత్సరములు యోగమొనర్చుచు నుండిరి.

ఆ సమయమున కణికణ్ణన్ వచ్చి భక్తిసారుల నాశ్రయించిరి. ఆ గ్రామముననున్న నొక వృద్ధవారకాంత ముదిమి చేతను వ్యాధులచేతను మిక్కిలి కృశించి తన పుత్రికలచేత వెళ్ళగొట్టబడి మిక్కిలి దుఃఖితరాయె భక్తిసారుల సేవించి వారి ఆశ్రమము ముంగిలి శుభ్రపరచి నీళ్ళుజల్లి ముగ్గులు పెట్టి అనుదినమును శుశ్రూష జేయుచుండ, నొకనాడు భక్తిసారులు కనులుదెరచి యీయామె యొనర్చుసేవలకు తృప్తులై యామెనుజూచి నీ కేదైననొక వరమిత్తుము కోరుకొనుమన నామెయు వార్ధక్యము పోవునట్లనుగ్రహింపవలయునని ప్రార్థింప, నట్లేయనిరి. అంతనామె ఆళ్వార్లకటాక్షముచే యౌవనవతియై అతిసౌందర్యవతియు నాయెను. ఇట్లుండ నా దేశపురాజు ఒకనాడామెను జూచి మోహించి భార్యగా జేసికొనెను. కాలముజరుగ రాజునకు వార్ధక్యము గల్గినను వేశ్యకు యౌవనము తగ్గకపోవుటచే రాజిదేమని యామెను ప్రశ్నించెను. అందులకామె ఆళ్వార్లకటాక్షముచే తానట్లుండుటను దెల్పెను. అందులకు రాజును ఆళ్వార్లచే తనకును

తిరిగి యౌవనముగల్గునట్లు జేయించుమని కోర, నందుల కామెయు ప్రతిరోజును ఉపాదానమునకై వూరిలోనికివచ్చు 'కణికణ్ణన్' పురుషకారముచే నాతని ఆచార్యులగు భక్తిసారుల యనుగ్రహమును బడయుమనిచెప్పెను. అంత నా రాజు కణికణ్ణని పిలిపించి, మీ ఆచార్యులను సేవింపవలెగాన నిచ్చటకు పిలుచుకొనిరమ్మన, నాతడును వారికొకరితో పని లేదుగాన రారనిచెప్పెను. అయినచో నీవు చక్కగ నాపై కవిత్వముజెప్పుమనికోర, నాతడును, భగవద్భాగవత విషయమునదప్ప నానాల్క వర్తింపదన, నా రాజు కోపించి నా దేశమును విడిచి పొమ్మనెను.

అంతట కణికణ్ణన్ తమ ఆచార్యులతో నీవిషయమును దెల్పి దేశమును వీడి పోవుటకు ఆజ్ఞయిమ్మనికోర ఆళ్వార్లును నీవులేనిచోట నాకేమిపనియని, తిరువెఃకాలో వేంచేసియున్న సర్వేశ్వరునిజూచి స్వామీ నా శిష్యునితో నేనుపోవుచుంటిని, నీవును నీ శేషపాన్పును చుట్టుకొనుమన, సర్వేశ్వరుడును నట్లేయనెను.

అంతట నారాజ్యములోని ఆలయములన్నిటను దేవతామూర్తులదృశ్యమగుటచే నర్చకులీవిషయమును రాజునకు దెల్పిరి. రాజును మంత్రులతో సంప్రదించి రాజ్యమెల్ల నంధకారము వ్యాపించుటచే కారణముదెలిసి మంత్రులతో గూడి వారుపోవుమార్గమున వెంబడించి "ఓరిరుక్కై"

అనెడి గ్రామమున వారిని సేవించి కణికణ్ణన్ పాదములబడి ప్రార్థింప నాతడును ఆళ్వార్లను వేడుకొనగా, నంత ఆళ్వార్లును ఆశ్రితపరతంత్రుడగు సర్వేశ్వరునిజూచి స్వామీ శిష్యుడంగీకరించెను నేనును తిరువెఃకా పోవుచుంటిని, నీవునూ నీ శేషపాన్పుతో వెనుకటివలెనే ఆలయమున వేంచేసి యుండవలసినదని ప్రార్థింప నాతడంగీకరించెను. అంతట నా దేశమునందలి ఆలయములన్నిల్ల తిరిగి దేవతామూర్తులు విల సిల్లెను. ఆనాటినుండియు తిరువెఃకాయందలి సర్వేశ్వరునికి "శొన్నవణ్ణమ్ శెయ్త పెరుమాళ్" (చెప్పినట్లుచేసినస్వామి) యని తిరునామమేర్పడెను. భక్తిసారులును కొంతకాలమచట యోగమునర్చుచుండిరి.

అనంతరము కుంభకోణముననున్న ఆరావముతు (అత్యప్తామృతము) పెరుమాళ్ళను సేవించి, వెడలుచుండగా, పెరుమ్బులియూరను గ్రామమున నొకయింటి యరుగుపై వేదాధ్యయన మొనర్చెడి బ్రాహ్మణులు కొందరు వీరు దగ్గరించుటనుజూచి వేదమును జదువుట మానివైచిరికొంత దూరముపోగా మరల చదువ యత్నించి యెచ్చటనాపిరో యా తర్వాతి భాగము జ్ఞప్తికిరాక తడబడుచుండగా, నా యవస్థనుజూచి భక్తిసారులు నల్లనివడ్లగింజను గోటితో చీల్చి జూప, నాబ్రాహ్మణులును 'కృష్ణానాం వ్రీహీణాంనఖ నిర్భిణ్ణమ్' అనువాక్యముజ్ఞప్తికివచ్చి వీరు పరమభాగవతోత్తములని తెలిసి, వారికి నమస్కరించి కృతార్థులైరి.

మరియు, నాగ్రామమున ఆళ్వార్లు ఉపాదానార్థముగ సంచరించుచుండ, నీ రేవీధిన దిరుగుచుండిరో నా వీధివైపునకు ఆ గ్రామములోని ఆలయములనున్న విగ్రహమూర్తులు తిరుగాడుటను జూచిన ఆలయఅర్చకులు ఈ ఆశ్చర్యమును కొందరు బ్రాహ్మణులకు జూప, వారును ఆగ్రామమున యాగ మొనర్చుచున్న దీక్షితుల కీవిషయమును దెల్ప, నాతడును పరుగిడివచ్చి ఆళ్వార్లను సేవించి ప్రార్థించి తన యాగశాలకు దోడ్కొనిపోయి అగ్రపూజనొనర్ప, అచ్చటనున్న అధ్వర్యుడు మొదలగువారు కృష్ణుని అగ్రపూజలో శిశుపాలుడు ధర్మరాజు నధిక్షేపించిన యట్లధిక్షేపింప, దీక్షితులును మనసున కలతపడి ఆళ్వార్లనుజూచి, స్వామీ వీరలకు మీమహిమను జూపుడని ప్రార్థింప, ఆళ్వార్లును తన హృదయమందలి సర్వేశ్వరుని ప్రార్థింప, నంత సర్వేశ్వరుడు తన దివ్యమంగళవిగ్రహమును వీరిహృదయమునుండి ప్రత్యక్షమొనర్ప దర్శించి అధ్వర్యుడు మొదలగు వారెల్లరును ఆళ్వార్లకు బ్రహ్మరథ మర్యాదలొనర్చి క్షమాపణము గోరగా, వారలకు బహువిధముల జ్ఞానోపదేశ మొనర్చి ఆళ్వార్‌లును కుంభకోణమున కేగిరి.

ఆ తరువాత కుంభకోణమున ఆరావముతు పెరుమాళ్ళను దర్శించి, నాన్ముకన్ తిరువన్దాదియు తిరుచ్చన్దవిరుత్తమును విన్నప మొనర్చి పరున్నస్వామిని లెమ్మని ప్రార్థింప

నాతడును లేవబోగా నాసౌలభ్యమునకు ముగ్ధులై లేవవల దని ప్రార్థించ నాతడును నట్లేయుండెను. ఆనాటినుండియు నా స్వామికి ఉత్థానశయనులు అను తిరునామ మేర్పడెను. అట్లు లేచునట్లు కొంచెము తలనెత్తుకొని పరున్న యాస్వామి దివ్యవిగ్రహమును ధ్యానించుచు యోగమున రెండువేల మూడువందల సంవత్సరము లచ్చట వేంచేసియుండి, నిద్రాహారముల విడిచి, క్షీరముల మాత్రముగ్రోలుచు నాల్గువేల ఏడువందలసంవత్సరములు భగవదనుభవమొనర్చుచునుండి నాన్ముకన్తిరువన్దాది తిరుచ్చన్దవిరుత్తములను దివ్యప్రబన్ధములను ముముక్షుజనుల కుపయుక్తమొనర్చి పరమసాత్వికులై నారాయణైకపరులైరి.

## తిరుమழிశై ఆళ్వార్ల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ మఘాయాం మకరేమాసే। చక్రాంశం భార్గవోద్భవమ్।
మహీసారపురాధీశం। భక్తిసారమహాన్భజే॥

నిత్యశక్తిపఞ్చమయవిగ్రహాత్మనే। శుక్తిసారజితచిత్తహారిణే।
ముక్తిదాయకమురారిపాదయోః। భక్తిసారమునయేనమోనమః॥

## వాழிతిరునామములు

అన్బుడనన్దాదితొణ్ణూత్తాఱురైత్తాన్ వాழிయే
అழగారున్దిరుమழிశై యమర్న్దశెల్వాన్ వాழிయే।
ఇన్బమిగుతైయిల్ మకత్తిఙ్గళుదిత్తాన్ వాழிయే।

ఎత్తిఱ్పన్దవిరు త్తమ్నూ త్తిరుపతీన్దాన్ వాళ్ళియే,
మున్నుకత్తిల్వ్వన్దుతి త్తమునివనార్ వాళ్ళియే।
మున్నుప్పెరుకిల్ పొన్ని యెతిర్ మితన్దశొల్లోన్ వాళ్ళియే,
నన్నువియిల్ నాలాయిర త్తె ప్లునూత్తాన్ వాళ్ళియే।
నజ్గళ్ ప త్తిశారరిరునల్పతజ్గళ్ వాళ్ళియే॥

## నాళ్ పాట్టు

త్తైయిల్ మకమిన్నుతారణియిాశే త్తమ్। ఇన్ద
త్తైయిల్ మకత్తుక్కుచ్చాత్తుకిన్రేన్। తుయ్యమది
పెత్తమళ్ళిశై ప్పెరాన్ పిఱన్దనాళెన్ఱు।
న త్తవర్ కళ్ కొణ్డాడుమ్ నాళ్॥

## 5. నమ్మాళ్వార్లు

పాండ్య దేశమున తామ్రపర్ణి నదీతీరమున కురుకాపురి యనెడి క్షేత్రము గలదు. దానిని ద్వాపరయుగమున కౌరవ రాజు పరిపాలించెను. ఆ నగరమున చతుర్థకులమున విభూతి నాథేంద్రులు (తిరువళ్లుదినాడర్) అనెడి భాగవతో త్తము లొకరుండిరి. వారికి ధర్మధరులను(అరంతాంగియార్) కుమారులు గల్గిరి. వారికి చక్రపాణియు వారికి అచ్యుతులును వారికి సుమతియు వారికి శెందామరైకణ్ణన్ వారికి పొత్కారి వారికి కారియనెడు కుమారులును గల్గిరి. కారికుమారులు సకల సద్గుణసంపన్నులై 'తిరువణ్ పరిశార' గ్రామమునందలి

తిరువాళరా కుమార్తెయగు నాథనాయికను వివాహమాడిరి. వారు కొంతకాలము సంతతిలేక తిరుక్కురుంగుడిలో నున్న భగవానుని ప్రార్థింప నాతని యనుగ్రహమున విష్వక్సే నాంశమున కలియుగప్రారంభమున 43వ రోజగు ప్రమాధి సంవత్సర శుక్లపక్ష చతుర్దశి శుక్రవారము కటకలగ్నమున నొక కుమారులు గల్గిరి.

ఆ బిడ్డయు సామాన్యశిశువువలె స్తన్యపానాదులు జేయక యేడ్వక కనులు దెరువక యుండెను. తల్లిదండ్రు లిదియేమి విచిత్రమోయని విచారించి పురుటి యనంతరము ఆ బిడ్డను దీసికొనిపోయి ఆ నగరమునందలి ఆలయమున నున్న "పొలిందునిన్రపిరాన్" అనెడి భగవానునకుజూప, వెంటనే కనులు దెఱచి ప్రాకుచుపోయి శేషాంశచే నాల యము ప్రక్కనే యవతరించిన చింతచెట్టునగల తొఱ్ఱమొద లున పద్మాసనస్థులై యోగనిష్ఠాగరిష్ఠులైరి. భగవద్దర్శన మాత్రముననే మారిరిగాన నీ శిశువునకు "మాఱన్" అను తిరునామమేర్పడెను.

ఇట్లీ శిశువు 16 సంవత్సరముల పర్యంతము నిద్రాహారములు లేకయు దినదినాభివృద్ధిని బొందుచు జ్ఞాన ముద్రతో ధ్యానము నవలంబించి యుండిరి.

ఇట్లున్నకాలమున మధురకవులనువారు తిరుక్కోళూరులో ద్వాపరమున 8,63,879 యగు ఈశ్వర సం॥ చైత్ర

మాసమున శుక్లపక్షమున చిత్తానక్షత్రమున సామశాఖ, పూరశ్చాదులు బ్రాహ్మణులు నారాయణులనువారికి కుముద గణేశాంశమున, ఆళ్వార్లకు ముందుగ నవతరించి సకలవిద్యల నధికరించి ఉత్తర దేశ యాత్రలుచేయుచు బదరికాశ్రమము నుండి అయోధ్యకే తెంచి, అచ్చట నొకనాడు రాత్రికాల మున దక్షిణదిక్కుగ నొక గొప్పవెలుగునుజూచి, అదే మియో తెల్సుకొనగోరి, దాని దిక్కుగ రాత్రులందు పయ నించుచు వచ్చి కురుకాపురికి పైన నావెలుగు కనిపించకపోవు టచే నాయూరిలో విశేషమేమైనగలదా? యని యాయూరి వారినడిగి చింతచెట్టుక్రింద యోగమొనర్చెడి యా తేజో మూర్తినిగని జూచి నమస్కరించిననూ వారు కన్నులు దెఱచి చూడనందున, నొకపెద్దరాతిపై మరియొకరాయినెత్తి పడవేయ నాధ్వనికి వీరు కన్నులు దెఱచిరి.

అంతట మధురకవులు వారిమహిమను దెలియగోరి ''శెత్తత్తిన్ వయిత్తిలే శిఱియతు పిఱందాల్ ఎత్తైత్తిన్ ఎజ్ఞేక్కిడక్కుం'' (ప్రకృతిగర్భమున జీవుడు పుట్టినచో దేనిని తినును, ఎక్కడనుండును) అని యడుగ; వారును 'అత్తై త్తిన్ అజ్ఞేకిడక్కుమ్' (దానినే తిని యచ్చటనే యుండును) అని సమాధానము జెప్పిరి.

అందులకు మధురకవులు మిక్కిలి ప్రీతులై వీరు సర్వజ్ఞులని ఆశ్రయించి మిక్కిలి విశ్వాసముతో నిత్యసేవల

జేయుచుండిరి.

ఆళ్వార్లును లోకయాత్రబొత్తిగవదలి 'ఉణ్ణుమ్ శోఱు, పరుకు నీర్, తిన్నుమ్ వెత్తిలైయుమెల్లామ్ కణ్ణన్' (తినెడి అన్నము చు త్రాగు నీరును అనుభవించెడి తాంబూలాది భోగ్యపదార్థము లన్నియును కృష్ణుడే) యని, ధారక పోషక భోగ్యములుగ భగవన్నామమే జేసికొనియుండుటను జూచిన యాయాదివ్యదేశములయందలి అర్చామూర్తులు చింతచెట్టు వద్దకు తమపరివారములతో వచ్చి వీరిని సేవించి దివ్యజ్ఞానముతో పరభక్తి పరజ్ఞాన పరమభక్తులుగల్గజేసి వీరిచే తమను స్తుతింపజేసికొని 'నమ్మాళ్వార్' (మా ఆళ్వార్లు) అని అభిమానించి తృప్తులై తమతమ స్థానములకు వేంచేసిరి. అట్లు భగవానునిచే మా ఆళ్వార్లు అని అభిమానింపబడుటచే నాటినుండియు వీరికి నమ్మాళ్వార్లను ప్రసిద్ధిగలైను.
అట్లు శ్రీమన్నమ్మాళ్వార్లు భగవంతుని ప్రత్యక్షసమానముగ దివ్యజ్ఞానముచే మనసున ననుభవించి, ఆయనుభవము హృదయములోన నిముడక ప్రవాహమై వాగ్రూపముగ బయల్పడ నదియే దివ్యప్రబన్ధరూపమాయెను. అది తిరువిరుత్తము 100 పాశురములు, తిరువాశిఱియము 7 పాశురములు, పెరియతిరువన్దాది 87 పాశురములు, తిరువాయ్ మొఴి 1102 పాశురములుగ, ఋగ్యజురథర్వణసామవేద సామ్యమాయెను. అందుచే వీరికి 'వేదమ్ తమిழ் శెయ్త మాఱన్' (వేదమును ద్రవిడము జేసిన మాఱన్) అనెడి దివ్యనామము

ప్రసిద్ధిజెందెను. 108 దివ్యదేశములలో 34 దివ్యదేశములను తమ దివ్యప్రబంధములందు వీరు మంగళాశాసనమొనర్చిరి.

వీరికి కారిమాఱులు, కారిసూనులు, మాఱన్, శఠకోపులు, పరాంకుశులు, తిరునావీఱుడైయపిరాన్, కురుకేశులు, కురుకాధిపులు, కురుకైప్పిరాన్, తిరుకుర్కూరునమ్బి, తెన్నరఙ్గమ్‌పొన్నడి, వకుళాభరణులు, వకుళభూషణులు, తిరువరఙ్గమ్‌పొన్నడి, అరుళ్‌మాఱన్, శఠారి, శఠకోపులు మొ॥ తిరునామములు గలవు.

వీరు ప్రపన్నజనకూటస్థులు. వీరు అవయవి, తక్కిన ఆళ్వారాచార్యులందరును వీరికి అవయవభూతులు. అట్లే వీరి దివ్యప్రబంధములూ అవయవి, తక్కిన ఆళ్వార్ల ప్రబన్ధములు అవయవములు. వీరి తిరువారాధనము పొలిన్దునిన్ఱపిరాన్, వీరిఆచార్యులు విష్వక్సేనులు. వీరి ప్రధానశిష్యులు మధురకవులు నాథమునులు. వీరు ఆళ్వారాచార్యయుభయపక్షములందునుండిరి.

ఇట్టి గొప్ప మహిమగల వీరు 32సం॥ లీలావిభూతిలో వేంచేసియుండి, పరమపదమునకు తీసికొనిపొమ్మని సర్వేశ్వరుని నిర్బంధింప, పరమపదనాథుడు పరుగుపరుగున సపరివారుడైవచ్చి గరుడవాహనముపై వేంచేయుడని ప్రార్థింప, ఆళ్వార్లును పరమపద అనుభవమును అచటకు పోవు అర్చిరాదిమార్గవైభవమును నీ శరీరముతోనుండగనే యనుభ

వింప జేయుమని ప్రార్థింప, నట్లే భగవాను డంగీకరించి దివ్య జ్ఞానముచే మానసికముగ ననుభవింపజేయ, నా యనుభవ మునెల్ల తిరువాయ్మొళ్ళిదివ్యప్రబన్ధమున 10వపత్తులో 9వ తిరువాయ్మొళ్ళి పది పాశురములచే మనకనుగ్రహించి, అర్చిరాదిమార్గమున ననేకసత్కారముల స్వీకరించుచు దేవ దుందుభులుమ్రోయ నప్సరసలాడ ప్రణవరథమున గరుత్మన్తునిచే మోయబడుచు నిత్యవిభూతినలంకరించిరి.

తరువాత మధురకవులు నమ్మాళ్వార్ల దివ్యవైభవ మును చరమోపాయమును "కణ్ణినుణ్ శిఱుత్తామ్బు" అను 10 పాశురముల దివ్యప్రబన్ధముచే బయల్పఱచి కురుకాపురి యందు శ్రీనమ్మాళ్వార్లను నర్చారూపుగ వేంచేపుజేసి గోపుర మంటప ప్రాకారాదులనిర్మించి సంప్రోక్షణమొనర్చి నిత్య, పక్ష, మాస, అయనోత్సవముల నతివైభవముగ జరిపిం చుచు వారి వైభవమును లోకమెల్ల ప్రకాశింపజేసిరి. ఇట్టి మధురకవులనున్ను ఆళ్వార్లకోటిలో జేర్చిరి.

పిమ్మట నమ్మాళ్వార్ దివ్యప్రబన్ధాలు సర్వలక్షణయుక్తము లని సర్వోత్కృష్టములనియు విచక్షణులెల్లరును విశ్వాసము తో ననుసంధించుచుండగా నాటి ద్రావిడపండితులు కొంద రు అసూయతో సహింపలేక యివి యేపాటివని అనాదరింప నా దేశపురాజు పరీక్షార్థము ఆళ్వార్లదివ్యప్రబన్ధములలో నొక పాశురమును నాతని సభయందుండు శఙ్గప్పలకపై (పరీ

పూర్ధముంచుపీఠము)పై పెట్టించి ఆనాడు సుప్రసిద్ధులగు కంబుడు మొదలగు 300 మంది ద్రవిడపండితుల కవిత్వముల నున్న నాపలకపై పెట్టింప, నాపలక ఆళ్వార్ల పాశురముల దప్ప మిగిలిన కవిత్వములనెల్ల క్రిందకు పడద్రోసెను. అంత నా పండితులెల్లరును నాశ్చర్యపడి ఆళ్వార్లయందు మిక్కిలి భక్తిగల్గి వారిపై ననేక కవనములజెప్పి కృతార్థులైరి.

ఇట్లు ఆళ్వార్లదివ్యప్రబంధములు ప్రసిద్ధినొందియుండ నందుతిరువాయ్ మొళ్రియందు 'మరణమాక్కి వైకున్దన్తరుం' (మరణమొనర్చి వైకుంఠమునిచ్చును) అని ఆళ్వార్లు చెప్పియున్న విధముగ సర్వేశ్వరుడును నీప్రబన్ధము నధ్యయన అధ్యాపకము లొనర్చిన వారికెల్ల వెంటనే పరమపదమిచ్చుచుండుటచే ప్రాకృతవ్యామోహులు దీనికి భయపడి చెప్పుటయు చదువుటయు మానివేసిరి. చెప్పువారును చదువువారును లేక దివ్యప్రబన్ధమెల్ల ఖిలమాయెను.

ఆ తరువాత 3 వేలసంవత్సరములు జరిగిన వెనుక శ్రీమన్నాథమునులు 'కణ్ణినుణ్ శిఱుత్తాంబు'ను 12 వేల పర్యాయములు అత్యాదరముతో జపమొనర్ప నమ్మాళ్వార్లు వారికి ప్రత్యక్షమై తిరిగి నాలాయిరదివ్యప్రబంధముల నను గ్రహించిరి. ఆరీతిగ లభించిన వానిలోని 'మరణమాక్కి' యను మాటను 'మరణమానాల్' (శరీరావసానమున) అని మార్చునట్లు నాథమునులు ప్రార్థించి లభించిరి.

ఆనాటినుండియు తిరిగి దివ్యప్రబన్ధములు లోకమున ప్రసిద్ధినొందినవి. ఆళ్వార్లలో వీరెట్లు ముఖ్యులో, అట్లే వీరానతిచ్చిన దివ్యప్రబన్ధములు ఆళ్వారాచార్యులాన తిచ్చిన శ్రీసూక్తులన్నిటిలోను ప్రధానమైనవి. వీరి ప్రబన్ధములు అంగి, తక్కినవన్నియు అంగములు. వీరి ప్రభావమునుబట్టి విష్వక్సేనాంశమని జెప్పినను, వీరు బద్ధసంసారులనియే ప్రసిద్ధి.

సర్వేశ్వరుడు తనస్వాతంత్ర్యమును బయల్పఱచుటకై వీరియందు విశేషకటాక్షమును జేసి వీరికిపరతత్వయాథాత్మ్య జ్ఞానమును సులభమగునటుల గృపజేసి వీరిమూలముగ దివ్యప్రబంధముల బయల్పఱచి లోకోజ్జీవనమును జేసెను.

* * * * *

## నమ్మాళ్వార్ల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ వృషభేతు విశాఖాయాం। కురుకాపురికారిజమ్।
పాణ్డ్యదేశేకలేరాద్యా। శఠారింసైన్యపంభజే॥
నిత్య॥ శ్రీవిజ్ఞానదినోత్తరేహనికలౌ।వర్షేప్రమాద్యాహ్వయే॥
మాసే మాధవనామ్నిభార్గవదినే। చర్క్షేవిశాఖాభిధే,
లగ్నేశుద్ధచతుర్దశీతిథియుతే। శ్రీమత్కుళీరేపిచ।
క్షిత్యాంప్రాదురభూత్పరాఙ్కుశకవి।ర్భాగ్యోదయామ్నాదృశాం.

నిత్య। మాతాపితాయువతయస్తనయావిభూతిః।
సర్వంయదేవ నియమేన మదన్వయానాం।
ఆద్యస్యనఃకులపతేర్వకుళాభిరామం।
శ్రీమత్తదఙ్ఘ్రియుగళం ప్రణమామిమూర్ధ్నా॥

## వాళ్తిరునామములు

ఆన తిరువిరుత్తమ్ నూఱు మరుళినాన్ వాళియే।
ఆశిరియమేళు పాట్టళిత్తపిరాన్ వాళియే।
ఈనమఱవన్దాది యెణ్బత్తేళు ఈన్దాన్ వాళియే।
ఇలకు తిరువాయ్మొళియాయిరత్తొరునూత్తిరణ్డుఉరైత్తాన్
వాళియే॥
వానణియుమ్ మామాడ కుర్కురుకైమన్నన్ వాళియే।
వైకాశి విశాకత్తిల్ వన్దుతిత్తాన్ వాళియే।
శేనైయర్కోన్ అవతారమ్ శెయ్తవళ్ళల్ వాళియే।
తిరుక్కురుకైచ్చడకోపన్ తిరువడికళ్ వాళియే।
మతినియిల్ వైకాశి విశాకత్తోన్ వాళియే,
వేతత్తైచ్చెన్దమిళాయ్ విరిత్తురైత్తాన్ వాళియే।
ఆతికురువాయ్ ప్పువియిల్ అవతరిత్తాన్ వాళియే।
అనవరతమ్ శేనైయర్కోన్ అడితొళువోన్ వాళియే।
నాతనుక్కు నాలాయిరమ్ ఉరైత్తాన్ వాళియే।
నమ్మతురకవి వణఙ్గుమ్ నావీఱన్ వాళియే।

మాతవనొప్పత్తాప్పతుకై యూయ్ వళర్న్దరుళ్వోన్ వాళియే।
మకిళ్ మాఅన్ శడకోపన్ వైయకత్తిల్ వాళియే

## నాళ్ పాట్టు

ఏరార్ వైకాశివిశాకత్తినేత్తత్తై। ప్పారోర అఱియప్పకర్ణ్దేన్।
శీరారుం వేతన్తమిళ్ శైత మెయ్యానెళ్ళిల్లూరుకై నాతనవతరిత్తనాళ్,
ఉణ్డో వైకాశివిశాకత్తుక్కొప్పొరు నాళ్।
ఉణ్డో శడకోపరుక్కొప్పొరువర్।
ఉణ్డో తిరువాయ్ మొళిక్కొప్పు।
తెన్ కురుకై క్కుణ్డో ఒరు పార్ తన్నిల్ ఒక్కు మూర్॥

నమ్మాళ్వార్ తిరువడికళే శరణమ్

* * * * *

## మధురకవియాళ్వార్ తిరునక్షత్ర తనియన్

శ్లో॥ మేషే చిత్రాసముద్భూతం। పాణ్డ్యదేశే గణాంశకమ్।
శ్రీపరాఙ్కుశసద్భక్తం। మధురంకవిమాశ్రయే॥

నిత్య॥ హస్తద్వతాళద్వితయంప్రపద్యే, శఠారివాగ్వ్యసముదారకీర్తిమ్.
మాధుర్యసంశ్లిష్టకవిత్వయుక్తం, మహత్వసమ్భావితబుద్ధితత్వమ్

## వాళి తిరునామములు

శిత్తిరైయిల్ శిత్తిరై నాళ్ శిఱక్కవన్దోన్ వాళియే
తిరుక్కోళూరవతరిత్త శెల్వనార్ వాళియే।
ఉత్తరగఙ్గాతీరత్తుయర్ తవత్తోన్ వాళియే।

ఒళికదిరోన్ తెళ్ళుతిక్కు వుకన్దువన్దాన్ వాళ్షియే।
ప త్తిరియొడు పతినాన్లుమ్ పాడినాన్ వాళ్షియే।
పరాఙ్కుశనే పర నెన్రు ప త్తినాన్ వాళ్షియే।
మ త్తిమహాం పదప్పొరుళై వాళ్విత్తాన్ వాళ్షియే।
మధురకవి తిరువడిగళ్ వాళ్షి వాళ్షి వాళ్షియే॥

## నాళ్ పాట్టు

ఏరార్ మధురకవి ఇవ్వులకిల్ వన్దుది త్త।
శీరారుం శి త్తిరై యిల్ శి త్తిరై నాళ్। పారులకిల్
మత్తుళ్ళ ఆళ్వార్కళ్ వన్దుది త్త నాళ్కళిలుమ్।
ఉ త్తదెమ క్కెన్రు నెఞ్జే ఓర్॥

* * * * *

## 6. కులశేఖరులు

కేరళదేశమున కోళి(కొల్లి) పట్టణమును రాజధానిగా చంద్రవంశపురాజగు దృఢవ్రతుడు పరిపాలించుచుండెను. ఆతడు సంతానార్థమై శ్రీహరినిగూర్చి యారాధించగా, నాతని యనుగ్రహముచే కలియందు 28వ పరాభవ సంవత్సరమున మాఘమాసమున శుక్లపక్షమున పునర్వసు నక్షత్రమున ద్వాదశీ శుక్రవారమున కౌస్తుభాంశమున నొక బాలుడవతరించెను. తల్లిదండ్రులాతడు కులమునకు శిరోభూషణ

మనుభావనచే కులశేఖరుడని పేరిడి, సకల సంస్కారము లను యథావిధి సకాలమున జరిపిరి.

కులశేఖరులును సర్వశాస్త్రములను ధనుర్వేదమును బాగుగ నధ్యయన మొనర్చిరి. దృఢవ్రతుడును కుమారునందు రాజ్యభారముంచి కృతకృత్యుడై తపోవనమునకేగెను.

అంతట కులశేఖరులును ధర్మమార్గమున రాజ్యపరి పాలన మొనర్చుచు, భగవంతుడగు శ్రీమన్నారాయణు నియందును వాని భక్తులగు శ్రీవైష్ణవులయందును మిక్కిలి భక్తియుక్తులై యుండిరి. వీరు భగవదవతారముల శ్రీరామా వతారమున మిక్కిలి ప్రీతులై నిత్యము శ్రీరామాయణ మును భాగవతగోష్ఠితో శ్రద్ధతో వినుచుండెడివారు.

ఒకనాడు పౌరాణికుడు, శ్రీరాముడొక్కడే పదు నాల్గువేలఖరదూషణాది రాక్షసులతో యుద్ధమొనర్ప వెడ లెనని జెప్ప, విని శ్రీరామునకు సహాయముగా చతురంగ బలముల కూర్చుకొని ప్రయాణముకాగా మంత్రులదిజూచి శ్రీరాముని విజయవార్త నొకలేఖపైవ్రాసి భాగవతోత్త ముల నెదురుగపంపి యద్దానిని అందింపజేయ, నదిజూచి కులశేఖరులు సంతృప్తులై వెనుకకు మరలిరి.

మరొకనాటి ఘట్టమున శ్రీరామునివంచించి రావ ణుడు సీత నపహరించెనని, ప్రస్తుతముకాగా, నా రావణుని

దునిమి సీతమ్మను దెత్తునని ఖడ్గపాణియై దివ్యాశ్వముపై కదలిపై జనుచుండ, శ్రీహరి, శ్రీసీతారామలక్ష్మణరూపియై దర్శనమిచ్చి మగుడ దోడ్కొనివచ్చెను.

శ్రీవైష్ణవులతోడి మైత్రిచే మనరాజిట్లాయెనుగాన వీరితో చెలిమి మాన్పించవలెనని మంత్రులాలోచించి కుల శేఖరుల ఆరాధన విగ్రహమూర్తి మెడలోని దివ్యరత్న మౌక్తికహారమొకటి దీసి దాచిరి. హారము గన్పింపమిచే శ్రీవైష్ణవులుదక్క ఆరాధన గృహమున బ్రవేశించువారు ఇతరులు లేరని మంత్రులు జెప్పగా నందులకు కులశేఖరులు శ్రీవైష్ణవులు చోరులుగారని ప్రతినయొనర్చి కృష్ణసర్పమును దెప్పించి యొక కుండలోనుంచి అందు తమ చేతినిదూర్చగా నది కఱవకుండుటజూచిన మంత్రులు ఆశ్చర్యపడి భీతులై తమ తప్పిదము నొప్పుకొని క్షమింపవేడిరి.

కులశేఖరులు రాజ్యపాలనము జేయుచున్న కాలమున శ్రీరంగమాహాత్మ్యమును విని శ్రీరంగనాథుని దర్శించవలెననెడి కోరికతో కులశేఖరులు తమ రాజధాని యందెల్ల రాదలచినవారెల్లరు రావచ్చునని చాటింపు వేయించి ప్రయాణమయ్యెడివారు. ఈతనినెట్లైనను రాజ్య పాలనమునందే యుంచవలెననుకొనెడి మంత్రులు, యెదురుగ కొందరు భాగవతోత్తముల (శ్రీవైష్ణవుల) బంపుచుండెడి వారు. అట్లెదురుగవచ్చిన స్వాములతోగూడి వెనుకకువచ్చి

విష్ణుభక్తులను పూజించుటకన్న నుత్తమపురుషార్థము లేదు, వారిని ద్వేషించుటకంటె వేరునాశనము లేదు, 60వేలసం॥విష్ణు నారాధించిన కలుగు ఫలము, ఒకమారు శ్రీవైష్ణవు నారాధించిన పూజలో 16వభాగమునకైనను చాలదని యెరిగి, వారికి తదీయారాధనాది సత్కారములొనర్చి వారితో కాలక్షేపగోష్ఠియందన్వయించుచుండెడివారు. ఇట్లు ప్రతిరోజును శ్రీరంగయాత్రా ప్రయత్నమేగాని పూర్తియగుట లేదు.

ఇదంతయు తలచి అవైష్ణవసహవాసమునకన్న పంజరమున బంధింపబడి మంటలలో నుంచబడుటయే శ్రేష్ఠమనెడి భావనగల్గి తన కుమారునకు రాజ్యభారము.ను వదలి శ్రీకులశేఖరులు శ్రీవైష్ణవగోష్ఠితో శ్రీరంగముజేరి యచ్చట శ్రీరంగనాథుని సేవించి, నీళాదేవి యంశతో జన్మించిన తనకుమార్తెను శ్రీరంగనికి ధర్మపత్నిగా సమర్పించి చాల సంపదను శ్రీరంగనికి నర్పించిరి. అచ్చట కొంతకాలముండి యనేకవిధములుగ విశేష తదీయారాధనముల నాచరించిరి.

అంతట కులశేఖరులు దివ్యదేశముల సేవించు కోర్కెతో భాగవతగోష్ఠితోగూడి పాండ్యదేశమందలి తిరుపతుల సేవించుచు బ్రహ్మదేశపురాధిపుడగు శ్రీరాజగోపాలుని సేవించుచు 67సం॥అచ్చటనే నివసించి పరమపదించిరి.

వీరు పెరుమాళ్‌తిరుమొళియను దివ్యప్రబన్ధము 105 పాశురములుగలదియు, ముకుందమాలయను 40సంస్కృత

శ్లోకములు కలదియు కృపజేసిరి.

పెరుమాళ్ తిరుమొళ్లియందు వీరుపాడిన దివ్యదేశములు, శ్రీరంగము, తిరువేఙ్గడము, అయోధ్య, చిత్రకూటము తిరుకణ్ణపురము, చిదంబరము, కేరళమున (వాగాహ పురమను) తిరువిడవెన్దై, తిరువిత్తువకోడు.

వీరి ఆచార్యులు విష్వక్సేనులు.

* * * * *

## కులశేఖరఆళ్వార్ల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ కుమ్భే పునర్వసౌ జాతం। కేరళే చోళపట్టణే।
కౌస్తుభాంశం ధరాధీశం। కులశేఖర మాశ్రయే॥
నిత్యః ఘుష్యతే యస్య నగరే। రఙ్గయాత్రా దినేదినే।
తమహం శిరసావన్దే। రాజానం కులశేఖరం॥

### వాళి తిరునామములు

అఞ్జనమామలైప్పిఱవియాదరిత్తోన్ వాళియే।
అణియరఙ్గర్ మణత్తూణై యడైన్దుయ్న్దోన్ వాళియే।
వఞ్జినకర న్తన్నిల్ వాழవన్దోన్ వాళియే।
మాశితనిల్పునర్పూశమ్వన్దుదిత్తాన్ వాళియే।
అఞ్జలెనక్కుడప్పామ్బిల్ అఙ్గైయిట్టాన్ వాళియే।

అనవరతమిరామక తైఅరుళుమవన్ వాళ్తియే,
శెఙ్గోల్ మొళ్తినూ త్తఙుమ్ శెప్పినాన్ వాళ్తియే।
శేరలగోన్ శెఙ్గమల త్తిరువడికళ్ వాళ్తియే॥

## నాళ్ పాట్టు

మాశిప్పునర్ పూశంకాణ్ణినిన్ఱుమణ్ణులగిర్।
తేశి త్తివశత్తుక్కే దెన్నిల్। పేశుకిన్ఱేన్
కొల్లినగర్కోన్ కులశేకరన్ పిఱప్పాల్।
నల్లవర్గళ్ కొణ్డాడుమ్ నాళ్॥

* * * * *

## 7. పెరియాళ్వార్లు

కేరళ దేశమునకు తూర్పుభాగమునగల దక్షిణసముద్ర తీరమున పాండ్య దేశము గలదు. అందు ధన్వీపురము (విల్లిపుత్తూరు) అనునొక పట్టణము కలదు. ఆ గ్రామము నందలి ఆలయమున శ్రీమన్నారాయణుడు పాలసముద్రమును విడిచి వటపత్రశాయిగా నివాసమేర్పఱచుకొనగా సప్తసముద్రములును అచ్చటకేవచ్చి సప్తసాగరమను పుణ్యతీర్థముగా నాయెను. బ్రహ్మాది సకలదేవతలును నారదాదిమహర్షులును నచ్చట భగవద్దర్శన కైంకర్యములకై నచ్చటనే నివసించు చుందురు. చతుర్వేదోత్తలగు బ్రాహ్మణోత్తములును నచ్చట మిక్కుటముగ నుండిరి.

ఆ పట్టణమున శాలావృతగోత్రజులును, బోధాయన సూత్రులును, యజుశ్శాఖీయులును, పురశ్చూడులు(ముందు నకుజుట్టుముడి వేసుకొనువారు),ఆచారశీలురునగు ముకుందా చార్యులను భాగవతోత్తములు గలరు. వీరు సంతానమునకై తమ ధర్మపత్నియగు పద్మావతియను సాధ్వితోగూడి వట పత్రశాయిని ప్రార్థింప, నాతడు గరుత్మంతుని అంశతో నొక కుమారులు గలుగునట్లనుగ్రహించెను.

ఆతరువాత కలిన 47వది యగు క్రోధిసం॥గ్రీష్మఋతు వున జ్యేష్ఠమాసమున శుక్లపక్షఏకాదశీ భానువారమున మిథునరాశిలో స్వాతీనక్షత్రమున సకల గుణపూర్ణులగు కుమారులు వారికి కల్గిరి. ఆబిడ్డనికి తలితండ్రులు విష్ణుచిత్తు లని నామకరణముజేసి. సకల సంస్కారములను నాయా విహితకాలములలో వైభవముగ జరిపిరి. వైకుంఠమునుండి శ్రీవిష్వక్సేనులు వచ్చి వీరికి పంచసంస్కారముల గావించిరి.

విష్ణుచిత్తులు తమ తరువాత పుట్టిన నలుగురు సోదరు లకన్ననూ మిక్కిలి తేజస్కులై, శ్రీమన్నారాయణుని నిర్హే తుక కటాక్షముచే, ప్రహ్లాదునివలె సహజమగు విష్ణుదాస్యం గలవారై, అన్నికైంకర్యములకన్న పుష్పసమర్పణము భగ వానునకు మిక్కిలి ప్రీతికరమని, (కృష్ణావతారమున మాలా కారుని మిక్కిలి యనుగ్రహించుట) తలచి యొక పెద్ద వనము నేర్పఱచి యందనేక పుష్పజాతులను తులశిని పెంచి, మిక్కిలి

శ్రిద్ధాభక్తులతో నాపుష్పములనెల్ల దెచ్చి సుగంధములగు తులశీపుష్పమాలికలను నిత్యము వటపత్రశాయికి సమర్పించుచుండెడివారు.

ఆ ధన్వీపురమునకు 5 యోజనముల దూరమునగల మధురాపట్టణమును వల్లవదేవరాయలను పాండ్యరాజు ధార్మికముగ పరిపాలించుచుండెను. ఆతడొకరాత్రియందు నగరపరిశోధనకై వెడలినపుడొకయింటి యరుగుపై నొంటరిగ పరున్న పురుషునొకనిని జూచి, "అయ్యా మీరెవరు? ఎచ్చటినుండి వచ్చిరి" యని యడుగ; నాతడును నేను బ్రాహ్మణుడను తీర్థాటనము జేయుచు గంగాస్నానమొనర్చి సేతుస్నానమునకై పోవుచుంటిని అనెను. అంత నారాజు అయినచో నొక శ్లోకమును జెప్పుడన; నా బ్రాహ్మణుడు

"వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్, నిశార్థమర్థం దివసం యతేత,
వార్ధక్యహేతోః వయసానవేన, పరత్రహేతోః ఇహజన్మనాచ॥"

(వర్షాకాలమునకై కావలసినవి మిగిలిన ఎనిమిది నెలలలోను జాగ్రత్తపడవలెను, రాత్రికాలమునకు కావలసినవాటికై పగటికాలముననే జాగ్రత్తపడవలెను, వార్ధక్యమున సుఖపడుటకై కావలసిన వాటికై వయస్సుననే జాగ్రత్తపడవలెను, అట్లే పరలోకమున సుఖించుటకు కావలసినవానికై ఈ శరీరముండగనే యీ లోకముననే జాగ్రత్తపడవలెను) అను శ్లోకమును చదివెను.

అంత నా రాజది విని, యింతకాలమువరకును నేనెట్టి పారలౌకిక విషయమునకు ప్రయత్నమును జేయకపోతినేయని చింతించి, ఆ మరునాడు తన పురోహితులు మంత్రియునగు శెల్వనంబిని (సంపత్పూర్ణుల) రావించి, మోక్షోపాయమును తెల్పుమని యడిగెను. అంతట నాతడు రాజా యీవిషయము శాస్త్రజ్ఞానపూర్తియు శిష్టాచారసంపత్తియుగల పండితోత్తములచే నిర్ణయింప బడవలసిన దగుటచేత, దేశదేశములను గల పండితోత్తముల రావించి వారిద్వారా తెలియదగునని పల్కెను.

అంతట నారాజు నానాదేశవాసులగు పండితులనెల్ల నాహ్వానించి యొక ముహూర్తదినమున గొప్పసభయేర్పఱచి మోక్షప్రదాతయగు కారణతత్వ (పరతత్వ) నిర్ణయ మొనర్పుడని, యట్లు సిద్ధాంతమొనర్చినవారికి బహుమానముగ (విద్యాశుల్కము) చాల ధనమును తోరణస్తంభమున గట్టించెను.

ఇట్టితరి విల్లిపుత్తూరున వటపత్రశాయిగ వేంచేసి యున్న శ్రీమన్నారాయణుడు, బద్ధచేతనులనెల్ల నుద్ధరింప దలచి, విష్ణుచిత్తుల స్వప్నమున తననుజూపి "మీరు మధురానగరమున పాండ్యరాజసభాస్థలిన జరుగు పరతత్వ నిర్ణయసభలో నన్నుగూర్చి యుపన్యసించి విద్యాశుల్కమును దెచ్చుకొనుడ"ని పల్కెను. అంత విష్ణుచిత్తులును

స్వామీ! నీ కోఱకు పుష్పోద్యానమున మొక్కలకు కుదుళ్లు చేయుటలో చేతులు కాయలు కాయుటతప్ప నా వద్దగల పాండిత్యమేమి? ఇట్టినన్ను పండితసభలో నుపన్యసింపుమని యాజ్ఞయొసఁగఁదగునా? యని ప్రార్థింప, వటపత్రశాయియు "నయ్యా యదియెల్ల నేనే జూచుకొందును, మీరు సభకు వేంచేయుఁడని అదృశ్యమాయెను.

విష్ణుచిత్తులును బ్రాహ్మీముహూర్తముననే లేచి యాశ్చర్యముతో స్వప్నవృత్తాంతమును దలచుచు నిత్యకృత్యములనెల్ల దీర్చుకొని రాజసభకు వేంచేసిరి.

అంతట వల్లభరాజును సంపత్పూర్ణులు (శెల్వనంబి)ను సభలో ప్రవేశించిన భట్టనాథులనుజూచి సాక్షాద్విష్ణువే వచ్చినట్లు భావించి, యెదురేగి నమస్కరించి గొప్పగ నాదరించి తోడ్కొనివచ్చి బంగరు సింహాసనమున గూర్చుండబెట్టి, విష్ణుచిత్తుల ఆజ్ఞఁగొని తాము కూర్చుండిరి.

భట్టనాథులకు జరిగిన యీ ఘన సన్మానమును జూచి పండితులెల్లరును సహింపరానివారై "రాజా యీతఁడెచ్చటను ఎప్పుడును పండితసభలలో నన్వయించినవాడు కాడు; ఈతనికొక్క వేదాక్షరమైనను చెవినపడినది లేదు, గాయత్రినైన యెరుగునో లేదో? ఇట్టి వానిని విద్వద్గోష్ఠిలో గౌరవించుట మమ్మవమానించినట్లే సుమా" యని పలువిధముల

వాపోవ, నంత నారాజు భట్టార్యులజూచి 'స్వామీ పరతత్వ నిర్ణయమొనర్పుడ'ని ప్రార్థించెను.

అంతట భట్టనాథులు లేచి నిల్చొని, రాత్రి తమ స్వప్నవృత్తాంతమును దలచుచు సర్వేశ్వరుని మనసున ధ్యానించిరి.

బ్రహ్మయొక్క వరబలముచే వాల్మీకిమహర్షికి రామ చరితమెల్ల మనోగోచరమైనట్లును, ధృవునకు శ్రీమన్నారా యణుని శంఖపుకొన స్పర్శచే సకలవేదాంతములు భాసించి నట్లును వటపత్రశాయి కటాక్షముచే సకల వేదాంతవాక్య ములును భట్టనాథుల ముఖపద్మమునుండి వెలువడె. స్తంభ మునసున్న ధనపుమూట తెగి విష్ణుచిత్తుల పాదములపైబడ యచ్చటివారెల్ల ఆశ్చర్యచకితులైరి.

సకల శాస్త్రములును వేదమున నిమిడియున్నవనియు, నట్టి వేదము అష్టాక్షరీమహామంత్రమందిమిడియున్నదనియు, అష్టాక్షరి ప్రణవమునందిమిడియున్నదనియు, ఆ ప్రణవము అకారమందిమిడియున్నదనియు, అట్టి అకారశబ్దవాచ్యుడు శ్రీమన్నారాయణుడేయనియు, నాతడే సృష్టి స్థితి లయము లను సద్వారక అద్వారకములుగ నొనర్చువాడనియు, నాతడే సర్వవ్యాపకత్వ శాసకత్వములు గలవాడనియు, సకల కళ్యాణగుణపూర్ణు డాతడే సకలారాధ్యుడనెడి సర్వవేదాంత తాత్పర్యమును భట్టనాథు లుపన్యసింప విని పండితులెల్లరు

సిగ్గుపడి తమ తప్పిదము నొప్పుకొని భట్టనాథుల క్షమాప ణము వేడుకొనిరి.

వల్లవదేవరాయలును శెల్వనంబితో గూడి భట్ట నాథుల పాదప్రక్షాళన మొనర్చి పట్టపుటేనుగుపై నెక్కించి ఊరేగించిరి.

అట్లు మహావైభవముగ మేళతాళములతోను ఛత్రి చామరములతోను నూరేగించుచుండ, భట్టనాథులకు జరుగు మహోత్సవమును జూచుటకై శ్రీమన్నారాయణుడు గరుడవాహనారూఢుడై ఆకసమున వేంచేయ, వానిని దర్శిం చిన భట్టనాథులు తన్మయులై ఏనుగుపైనున్న గంటలనుగొని ప్రయోగించుచు తిరుప్పల్లాణ్డు దివ్యప్రబన్ధమును గృపజేసిరి. ఆదివ్యప్రబన్ధసారార్థము, సర్వేశ్వరునికి లోకులచే దృష్టి దోషముగల్గకుండుటకై, నాతనిని నాతని పరివారమును క్షేమముగ నుండవలయునని మంగళాశాసనము జేయుట.

లోకులెల్లరును తమతమ క్షేమములకై భగవంతుని ఆశ్రయించుచుండ, భగవంతునకై తాము క్షేమమునుగోరిన వారగుటచే నాటినుండియు విష్ణుచిత్తులకు పెరియాళ్వార్లు అనెడి ప్రసిద్ధి యేర్పడెను.

శ్రీవల్లవదేవరాయలును పెరియాళ్వారుల నాశ్రయించి వారివలన మంత్రమంత్రార్థములను బొంది వారి కత్యంత

ప్రియశిష్యుడై శ్రీవిల్లిపుత్తూరున వటపత్రశాయి కనేక కైంకర్యములను ఆచార్యప్రీతికై యొనర్చి తరించెను.

పెరియాళ్వార్లు తిరుప్పల్లాణ్డు (12 పా. న్నా), పెరియాళ్వార్ తిరుమొళియను (473 పాశురములుగల) దివ్య ప్రబన్ధములను గృప జేసిరి.

వీరు పాడిన దివ్యతిరుపతులు పదమూడు. అవి శ్రీరంగము, శ్రీవిల్లిపుత్తూరు, ధన్వినవ్యపురము, తిరుక్కూడల్ (దక్షిణమధుర), కురుకాపురి (ఆళ్వార్ తిరునగరి), గోష్ఠీపురం (తిరుక్కోట్టియూర్), కురంగనగరము (తిరుక్కురుంగుడి), శ్వేతాద్రి (తిరువెళ్ళరై), తిరుమాలిరుంశోలై (సుందరాచలం), తిరుకణ్ణపురము (శ్రీకృష్ణనగరం), తిరువేంగడం (శేషాద్రి), అప్పక్కుడత్తాన్ (పురుషోత్తమపట్టణము), నందవ్రజము (గోకులము), ఉత్తరమధుర.

విష్ణువును నిత్యమును చిత్తమున గలవారగుటచే విష్ణుచిత్తులనియు, భట్టువంశమున శ్రేష్ఠులగుటచే భట్టనాథులనియు, భగవానునకే మంగళాశాసనము జేయుటచే పెరియాళ్వార్లనియు వీరికి తిరునామములేర్పడెను. వీరు 85సం॥ లీలావిభూతియందుండి పరమపదించిరి.

* * * * *

## పెరియాళ్వార్ల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ మిధునే స్వాతిజం విష్ణో। రథాంశం ధన్వినః పురే।
ప్రపద్యే శ్వశురం విష్ణోః। విష్ణుచిత్తం పురశ్శిఖమ్॥

నిత్య॥ గురుముఖమనధీత్య ప్రాహ వేదాన శేషాన్।
నరపతి పరిక్లృప్తం శుల్కమాదాతుకామః।
శ్వశురమమరవన్ద్యం రఙ్గనాథస్య సాక్షాత్।
ద్విజకుల తిలకం తం విష్ణుచిత్తం నమామి॥

## వాழி తిరునామములు

నల్ల తిరుప్పల్లాణ్డు నాన్మూన్రోన్ వాழிయే।
నాన్నూత్తిఱు పత్తొన్నుమ్ నమక్కురైత్తాన్ వాழிయే।
శొల్లరియ ఆనితనిల్ శోతి వన్దాన్ వాழிయే।
తొడైశూడి కొడుత్తాళ్ తొழுమప్పన్ వాழிయే।
శెల్వనమ్బితనై పోల శిఱప్పుత్తాన్ వాழிయే।
శెన్నుకిழிయఱుత్తు మాల్ తెయ్వమెన్నాన్ వాழிయే।
విల్లిపుత్తూర్ నగరత్తై విళక్కినాన్ వాழிయే।
వేదియర్కోన్ పట్టర్పిరాన్ శేతినియిల్ వాழிయే॥

## నాళ్ పాట్టు

మానిలత్తిల్ మున్నమ్ పెరియాழ்వార్ వన్దుదిత్త।
ఆనిదన్నిల్ శోతి యెన్నాలాదరిక్కుమ్। ఞానియర్కు
ఒప్పోరిల్లై యివ్వులకుతనిలెన్ఱు నెఞ్జే।
ఎప్పోతుమ్ శిన్దిత్తిరు॥

# ఆండాళ్

శ్రీ పెరియాళ్వార్లు శ్రీవిల్లిపుత్తూరులో వటపత్రశాయి పుష్పసమర్పణకు నందనవనము నేర్పఱచి, దానిని చక్కగ పెంచుచున్న కాలమున, కలిలో 98వ దగు నళనామ సం॥ కర్కాటకమాసమున శుక్లపక్ష చతుర్దశి మంగళవారం పుబ్బానక్షత్రమున భూదేవియంశచే నా తులశీవనమున వారికి నొక బాలిక లభించెను. పెరియాళ్వార్లు ఆ బాలికను గొనివచ్చి గోదాయని పేరిడి పుత్రికా వాత్సల్యముతో మిక్కిలి గారాబముతో పెంచుచుండిరి. ఆమెయు 5సం॥ వయసుగలదాయెను.

పెరియాళ్వార్లును ఉదయపువేళల పూలను తెచ్చికోసి మాలలుకట్టి స్వామికి సమర్పించుచు సాయంత్రములందు భాగవతములోని శ్రీకృష్ణావతార వైభవమును చదువుచు నుండెడివారు. గోదాదేవియు మిక్కిలిప్రీతితో తండ్రిగారి ననుసరించెడిది. కృష్ణావతార వైభవములనెల్ల అడిగియడిగి తెల్సుకొని భగవానునే వివాహమాడనిశ్చయించుకొనెను. ఒకనాడు స్వామికి కట్టియుంచిన మాలను తానుధరించి వానికి తగుదునా?యని యద్దమున తనను జూచుకొని తృప్తురాలై యామాలను యథాస్థానమున నుంచెను. అదే సమయమునకు వచ్చిన పెరియాళ్వార్లది జూచి 'అమ్మా! స్వామికై

యుంచిన మాలను నీవు ధరించుట తగునా?యని మందలించి నాటికి మాలను స్వామికి సమర్పించుటను మానిరి.

ఆ రాత్రి స్వప్నమున వటపత్రశాయి పెరియాళ్వార్ల స్వప్నమున తన్నుజూపి మాల సమర్పింపలేదేమని యడుగ, వారును జరిగిన తప్పిదమును జెప్పుకొని క్షమింపవేడిరి.

అంత నా వటపత్రశాయియు నీబిడ్డ ధరించి విడిచిన మాలయే మా కత్యంత భోగ్యముగాన నేటినుండియు నట్లే యొనర్పుమని యాజ్ఞాపింప; ఆళ్వార్లును యీమె శ్రీదేవియో, భూ, నీళా దేవియో కావలెనని మిక్కిలియచ్చెరువొందిరి.

గోదాదేవియు భగవంతుని ప్రేమించి వివాహమాడిన వారెవరైన కలరా?యని విచారించి, కృష్ణావతారమున గోపికలు పొందినట్లు వినిన దగుటచేత తానును వారివలెనే యనుకరింప మొదలిడెను. తానున్న శ్రీవిల్లిపుత్తూరే వ్రేపల్లెగను, అచ్చటి కోవెలయే నందుని యిల్లుగను, వటపత్రశాయియే కృష్ణుడుగను, తన స్నేహితురాండ్రెల్ల గోపికలుగను, తులశీవనమే బృందావనముగను, అచ్చటి ముక్కుళసరస్సె యమునానదిగను, ఆ ప్రక్కనేగల కొండయే గోవర్ధనముగను భావించి, భావనా ప్రకర్షముచే తాను నొక గోపికయై, అందరను కూర్చుకొని ధనుర్మాసమున ముప్పదిరోజుల వ్రతముగ తిరుప్పావై యను 30 పాశురములుగల దివ్య ప్రబన్ధము ననుగ్రహించెను.

శ్రీవిష్ణుచిత్తులును కుమార్తె యుక్తవయస్కురాలగు టను జూచి యీమెకు తగిన వరుడెవరగుదురా? యని చింతించుచుండ, గోదయు తండ్రిని సమీపించి నాన్నగారూ నేను భగవంతుని దప్ప మానవులను వివాహమాడనని జెప్పెను. అంతట విష్ణుచిత్తులు, అమ్మా అట్లగుచో నిప్పుడు సర్వేశ్వరుడు అర్చామూర్తిగ 108 దివ్యదేశములలో నున్నాడు. ఇందరిలో నీవెవరిని వివాహమాడుదువని అడిగెను. ఆమెయు నాయనగారూ వారివారి వైభవములనెల్ల జెప్పుడని యడిగెను. పెరియాళ్వార్లును వారి వైభవములను జెప్పుచురాగా వేంకటేశ్వరుని వైభవమును విన్న గోద యొకమారు వానికై యోజించెను. మరల తండ్రిగారు జెప్పుచు రాగా తిరుమాలిరుంజోలైలో వేంచేసియున్న సుందరబాహుస్వామికై యోజించెను. ఆళ్వార్లు మరల జెప్పుచు ప్రత్యక్షవైకుంఠమగు శ్రీరంగమున వేంచేసియున్న శ్రీరంగనాథుని వైభవమును జెప్పగనే నాన్నగారూ చాలు నిక జెప్పకుడని గోదాదేవి శ్రీరంగనియందే సక్తమనస్కురాలాయెను.

పెరియాళ్వార్లును మనసున సంతసించినను, అర్చామూర్తిగనున్న స్వామితో నీమెకు వివాహమగుట యెట్లో యని చింతించ దొడగిరి.

ఇట్లుండ నొకనాడు శ్రీరంగనాథుడు పెరియాళ్వార్ల

స్వప్నమున తనను గాన్పించి గోదాదేవి భూదేవి యంశ యనియు, తాను వివాహమాడుదుననియు జెప్ప, ఆశ్చర్య ముతో పెరియాళ్వార్లు మేల్కాంచి స్వప్నమునే పలుమారు దలచుచు నుండిరి.

శ్రీరంగనాథుడును తన ఆలయ ధర్మకర్తలకు స్వప్న మున తనను గన్పింప జేసి, తన సకల మర్యాదలతోను శ్రీ విల్లిపుత్తూరునకు వెళ్ళి పెరియాళ్వార్ల పుత్రికయగు గోదా దేవిని దోడ్కొనివచ్చి తనతో కళ్యాణము జరిపించుడని యాజ్ఞాపింప, వారును తొట్రుపాటుతో లేచి యెల్లరకు నీ విషయమును దెల్పి మేళతాళములతోను ఛత్రచామరాది సకల రాజలాంఛనములతోను బంగరు పల్లకితో శ్రీ విల్లి పుత్తూరును జేరి పెరియాళ్వార్లకీ వృత్తాంతమును దెల్పి, బంగరుపల్లకిలో గోదాదేవిని యెక్కించుకొని అత్యంత వైభవముతో శ్రీరంగమునకు దోడ్కొనివచ్చి ఆలయముఖ ద్వారమున దింపగా, ఆమెయు హంస నడకతో గర్భాలయ మున బ్రవేశించి కనులార శ్రీరంగనాథుని సేవించి శేష తల్పముపైనెక్కి స్వామి పాదసన్నిధి జేరి అదృశ్యమాయెను.

ఈ యాశ్చర్యమును పెరియాళ్వార్లును వారి శిష్యులగు వల్లవదేవరాయలు మొదలగువారును ఆలయ పరివారమెల్ల రును పురజనులెల్లరును దర్శించి కృతార్థులైరి.

శ్రీవిష్ణుచిత్తులంతలో పుత్రికావియోగమును సహింప లేక దుఃఖింప, శ్రీరంగనాథుడును తలచినపుడెల్ల దంపతీ యుక్తముగ సేవసాదించునట్లు వరమొసంగ, పెరియాళ్వార్లు సంతృప్తులై శ్రీవిల్లిపుత్తూరును జేరి శ్రీవటపత్రశాయికి నిత్య కైంకర్య మొనర్చుకొనుచుండిరి.

ఆండాళ్ అనుగ్రహించిన దివ్య ప్రబన్ధములు, తిరుప్పావై (30 పా), నాయ్చ్చియార్ తిరుమొழி (143 పా).

ఈమె తండ్రిగారగు పెరియాళ్వార్లే యీమెకు పంచ సంస్కారములు గావించిరి.

ఈమెకు, మంచికొప్పుకలది యగుటచే గోదయనియు, ఆత్మకు దాస్యమే సహజమని దెల్పుటచే ఆండాళ్ అనియు, తాను ధరించిన మాలను స్వామికి సమర్పించుటచే శూడి క్కొడుత్త నాయ్చ్చియారనియు ప్రసిద్ధ నామము లేర్పడెను. ఈమెనున్ను ఆళ్వార్ల కోటిలో జేర్చిరి.

## ఆండాళ్ తిరునక్షత్ర తనియన్

శ్లో॥ కర్కటే పూర్వఫల్గున్యాం। తులశీకాననోద్భవామ్ ।
పాండ్యే విశ్వమ్భరాంగోదాం। వందే శ్రీరంగనాయకీమ్॥

నిత్య॥ నీళాతుంగస్తనగిరితటీ సుప్తముద్బోధ్యకృష్ణం,
పారార్థ్యంస్వంశ్రుతిశతశిర స్సిద్ధమధ్యాపయన్తీ,
స్వోచ్ఛిష్టాయాం స్రజినిగళితం యాబలాత్కృత్యభుంక్తే,
గోదా తస్యై నమయిదమిదం భూయ ఏవాస్తుభూయః.

## వాఴ్తి తిరునామములు

కోదై పిఱన్దవూర్ కోవిన్దన్ వాఴుమూర్ ।
శోతిమణిమాడమ్ తోన్ఱుమూర్, - నీతియాల్
నల్లపత్తర్ వాఴుమూర్ నాన్మఱైకళోతుమూర్ ।
విల్లిపుత్తూర్ వేతక్కోనూర్
పాతకఙ్గళ్ తీర్కుమ్ పరమనడికాట్టుమ్
వేదమనైత్తుక్కుమ్ విత్తాకుమ్ — కోదై తమిఴ్
ఐయైన్దుమైన్దుమ్ అఱియాతమానిడరై
వైయమ్ శుమప్పతుమ్ వమ్బు ॥
తిరువాడిప్పూరత్తిల్ శెకత్తుతిత్తాళ్ వాఴియే ।
తిరుప్పావై ముప్పతుమ్ శెప్పినాళ్ వాఴియే ।
పెరియాఴ్వార్ పెత్తెడుత్త పెణ్పిళ్ళై వాఴియే।
పెరుమ్బూతూర్ మామునిక్కుప్పిన్నానాళ్ వాఴియే ।
ఒరునూత్తు నాఱ్పత్తు మూన్ఱురైత్తాళ్ వాఴియే ।
ఉయరరఙ్గర్కే కణ్ణియుకన్దళిత్తాళ్ వాఴియే ।
మరువారుమ్ తిరువల్లివళనాడు వాఴియే ।
వణ్పుతువై నకర్కోదై మలర్పదఙ్గళ్ వాఴియే ॥

## నాళ్పాట్టు

ఇన్ఱో తిరువాడిప్పూరమ్ । ఎమక్కాగ
వన్ఱో ఇఙ్గాణ్డాళ్ అవతరిత్తాళ్ । కున్ఱాత
వాఴ్వాన వైకున్దవాన్ పోకన్దనై ఇకఴ్న్దు ।
ఆళ్వార్ తిరుమకళారాయ్ ॥

## 8. తొండరడిప్పొడి యాళ్వార్లు

చోళదేశమున మండంగుడి యను నొక యగ్రహారము గలదు. అది కుంభకోణమునకు పడమర దిక్కున కావేరికి ఉత్తరతీరమున రెండు క్రోసుల దూరమున నున్నది. అందు వేదవేదాన్త కోవిదులగు బ్రాహ్మణోత్తములు 7 వందల మంది కలరు. అచ్చట పురశ్చూడులగు వేదవిశారదుడను బ్రాహ్మణ శ్రేష్ఠుడు భార్యతో గూడి సంతానార్థియై నారాయణాద్రిని జేరి యచ్చట కల్యాణతీర్థమున స్నానమాడి సంపత్పుత్రులనెడు ప్రసిద్ధిగల రామప్రియులను సేవించి తిరిగి తన గృహమును జేరెను. సంపత్కుమారుని యనుగ్రహము వలన నా దంపతులకు కలిన 109వ దగు ప్రభవ సం॥ ధనుర్మాసమున జ్యేష్ఠా నక్షత్రమున వనమాలాంశమున నొక కుమారుడు గల్గెను. ఆ బిడ్డనికి తల్లిదండ్రులు విప్రుడై నారాయణుని యనుగ్రహముచే గల్గిన వాడగుటచే విప్రనారాయణుడని నామమిడి, సకల శాస్త్రములను, సాంగముగ వేదమును జదివించిరి. శ్రీ విష్వక్సేనులు వీరికి పంచసంస్కారములొనర్చి మంత్ర మంత్రార్థముల గృప జేసిరి.

విప్రనారాయణులును బాల్యమునుండియు జ్ఞానభక్తి వైరాగ్యములు గలిగి వివాహమాడక, ఉభయ కావేరుల మధ్యన చంద్రపుష్కరిణి యొడ్డునగల శ్రీరంగక్షేత్రమును జేరి శ్రీరంగనాథుని దివ్యవిగ్రహమును దర్శించి వానిదయకు

పాత్రులై యచ్చట పశ్చిమముగ నొక గొప్ప పుష్పవనము నేర్పఱచి నిత్యమును శ్రీరంగనికి పుష్పమాలా కైంకర్య మొనర్చుచు భిక్షాటనముచే కాలము గడుపుచుండిరి.

ఆకాలమున కావేరినదికి ఉత్తరతీరమున కదంబ నగరము గలదు. ఆనగరమున 'ఉత్తమర్ కోయిల్' అనెడి భగవత్సన్నిధి కలదు. ఆసన్నిధిలో అప్సరసాంశచే బుట్టిన దేవదేవియను పేరుగల నొక వేశ్యయుండెను. ఆమె యొకనాడు చోళభూపాలుని సభకేగి తన నాట్య సాహిత్య కళలచేతను, సౌందర్యముచేతను నారాజును మెప్పించి గొప్ప బహుమానములనొంది మిక్కిలి గర్వముతోగూడి తన పట్టణమునకు తిరుగుప్రయాణమై వెళ్ళుచుండెను. మార్గమధ్యమున దప్పిక తీర్చుకొనుటకై తనపరివారముతో గూడి విప్రనారాయణుని పుష్పవనమున ప్రవేశించి అచ్చటి కొలనులోని తీయని నీటిని కడుపార త్రాగి తనయక్కయగు అభివేణినిజూచి "అక్కా! యింతటి యందమగు నీ వన మెవరిద"ని యడిగెను. అందులకామె "చెల్లీ! యీవనము విప్రనారాయణులను నొక భక్తులు శ్రీరంగనాధుని పుష్ప కైంకర్యమునకై యేర్పఱచుకొన్నద"ని దెల్పెను. అంత నామె అయినచో వారిని దర్శించుదమని అక్కతోగూడి వారున్న చోటికి జేరెను. విప్రనారాయణులును పూల చెట్లకు మొదళ్ళన కుదుళ్ళు జేయుచు నీరు పెట్టుచు భగవధ్యాన మున నుండి, వచ్చిన వీరిని గమనింపరైరి.

అందుకు దేవదేవి మిక్కిలి యవమానపడి అక్కా యీతడు పిచ్చివాడా? లేక నపుంసకుడా? యెదుటనున్న సౌందర్యరాశినగు నన్ను చూడకున్నాడేమి? యని యడిగెను. అందులకా అలివేణి "చెల్లీ! యీతడు పరమ భక్తి వైరాగ్యములుగల మహానుభావుడు, శ్రీరంగనాథుని కైంకర్యాసక్తుడు, యీతనికి లోకముపోకడతో పనియేమి?" యనెను.

అంతనా దేవదేవి "అక్కా యెంతటి వారలైనను యింతికి దాసులేగదా, చూడు మీతనిని ఆరుమాసములలో నాదాసునిగ జేసికొనెదను. అట్లు కానిచో నీకు దాస్యము చేసెద" నని ప్రతిన యొనర్చి పరివారమునెల్ల పంపివైచి తాను కాషాయవస్త్రముల ధరించి సాత్త్విక వేషముతో విప్రనారాయణులను సమీపించి చేతులుజోడించి నిలువ, విప్రనారాయణులును నీ వెవ్వతెవు? ఎందులకిటు వచ్చితివని యడుగ, నామెయు వినయ విధేయతలు ముప్పిరిగొన "స్వామీ! నేనొక వారకాంతనై పాపవశమున బుట్టితిని. నా తల్లియు వేశ్యావృత్తి నవలంబించి ధనార్జన మొనర్పుమని నిర్బంధించినది. నేనును, జన్మపరంపరకును పాపరాశికిని భయపడి యామెను వీడి, సర్వేశ్వరునికి సేవజేసికొని జన్మ జలధిని దాటు తలంపుతో దేవరవారి పాదపద్మముల నాశ్రయించితిని. ఆకించన్య అనన్య గతిత్వములుగల దాసి

నగు నాయందు కరుణించి దేవర వారి తోట సంరక్షణమున నియోగించినచో సేవజేసికొని తరింతునని పాదములపైబడి మిక్కిలి ప్రార్థింప విప్రనారాయణులు కరుణతో నంగీకరించి, తాము దెచ్చిన భైక్షమును భగవదారాధనానంతరము తాము ఆరగించి మిగిలిన దామె కిచ్చుచుండిరి.

విప్రనారాయణులు పూలచెట్లకు నీళ్ళుతోడ, దేవదేవియు కాలువలుజేసి కుదుళ్ళుగట్టి అనువర్తించెడిది. విప్రనారాయణులు పూలుకోసి తేగా దేవదేవియు చిత్రవిచిత్రములగు మాలలు నిర్మించెడిది. ఇట్లు పగలెల్ల యిరువురును కలిసి తోటపనియు మాలారచనములోనర్చెడివారు. ఆ మాలలను శ్రీరంగనాథునకు సమర్పింప ఆలయమునకు విప్రనారాయణులు వేంచేయ వారి రాకకై వేయికనులతో నెదురుచూచుచు నుండెడిది. రాత్రిళ్ళు విప్రనారాయణులు ఆశ్రమమున విశ్రమింప దేవదేవియు నే చెట్టుమొదలుననో అరుగుపై నిద్రించెడిది. ఇట్లు ఒకటి రెండు దినములు తక్కువగ నారు మాసములు పూర్తి గావచ్చెను.

అంతట దేవదేవి తన మనమున నిట్లుచింతింప దొడంగెను. అయ్యో నే నారుమాసము లీతనిని చక్కగ నను వర్తించితిని, కాని యొకప్పుడు నీతడు నన్ను క్రీగంటనైన జూడడు, రాత్రియందు కటిక చీకటిన నీ వనమున నొంటరినై బయలున నిద్రించుచున్నను నీతడు నిర్దయుడై కుటీరమున

సుఖముగ నిద్రించును, ఏమి తింటివి? ఎచ్చట నుంటివని యేని ప్రశ్నింపడు, వృక్షములయందు జూపించు దయయేని నాయందు జూపకున్నాడు, శ్రీరంగనాథా! దయానిధే! దిక్కులేని నన్ను దయజూడుము, పురుషోత్తమా! సాపరాధ నగు నాయపరాధముల క్షమించి నా ప్రతిన నెరవేరునట్లు అనుగ్రహింపుమని పరిపరివిధముల భగవానుని శరణు జొచ్చెను.

భక్తానుగ్రహాకారుడగు శ్రీరంగనాథుడు దేవదేవి మొరనువిని యామె ననుగ్రహింప దలచెను.

దేవదేవి మనోభీష్టమును దీర్ప వర్షాకాలమాసన్నమై యొకరాత్రి గొప్ప మెరుపులు పిడుగులతో భయంకరమగు వర్షము గురిసెను. అంతటి వర్షమునకు దేవదేవి చెట్లక్రిందనే పీడింపబడుచుండెను. అట్టితరి శ్రీరంగనాథుని యనుగ్రహముచే విప్రనారాయణులు దేవదేవిపై దయకల్గి యామెను పర్ణశాలలో నొకచో నుండ నియమించిరి. అందులకామె మిక్కిలి సంతసించి లోన ప్రవేశించెను. కట్టుబట్ట తడిసి నీరోడుచు చలిచే ఒణుకుచున్న యామెకు విప్రనారాయణులు తమ తలపాగా ఉత్తరీయము నొసంగ, దానినామె ధరించి వారి పాదముల దగ్గరగ కూర్చుండి, చతురురాలగు నామె స్వామీ! దేవరవారి పాదసేవచేయునట్లనుగ్రహింపుడని ప్రార్థించి వాని యంగీకారమును గొని మెలమెల్లగ

విషయజ్ఞానమే లేని యా ఋషితుల్యులగు విప్రనారాయణు లను నానావిధక్రీడలలో ముంచెను.

ఇట్లా రాత్రియెల్ల గడిపి ప్రతినదీర్చుకొనిన దేవదేవి వేకువనే లేచి తన యింటి కేగి మంగళ స్నానమాచరించి చక్కగ భుజించి సర్వాభరణ భూషితయై విప్రనారాయణుని జేరి గాఢాలింగన మొనర్చి వానిని వెంటనిడుకొని తన గృహ మున ప్రవేశించెను.

దేవదేవి తల్లియు విప్రనారాయణుని ధనమెల్ల నపహ రించి, దూషించి, దయలేనిదై నీవద్ద ధనము లేదు గనుక నావలి కేగుమని వెడలగొట్టి తలుపు మూసెను.

విప్రనారాయణులును కలతజెందిన మనస్సుగలిగి దేవదేవిని విడువలేక వీధియరుగుపై ముసుగునిడి పరుండిరి.

అంత శ్రీరంగనాథుడు శ్రీరంగనాయకితో నర్థరాత్ర మున పట్టణమున విహరించుచుండ శ్రీరంగనాయకి తన భర్తనుజూచి స్వామీ యీ ముసుగులో నున్న యాతడెవ రని యడుగ, నాతడును దేవీ నిత్యమును మనకు పుష్ప సమర్పణ మొనర్చెడి మాన్యుడు, విప్రనారాయణుడని దెల్ప, శ్రీరంగనాయకియు వీని నీ విశ్వమోహనమాయలో పడవేయవలదని ప్రార్థింప శ్రీరంగనాథు డంగీకరించెను.

తొల్లి విభీషణుడర్పించిన అర్చన పాత్రిలలోని బంగరు శుద్ధోదకపాత్రిను గొని బ్రహ్మచారియై రంగశౌరి దేవదేవి యింటివాకిటికడ నిల్చి తలుపును తట్టగా, నీవెవరవని దేవదేవి యడుగ, నాతడును నేను విప్రనారాయణుని ప్రియ శిష్యుడను, రంగదాసుడనెడి పేరుగలవాడను. మా ఆచార్యుడు నీకొకవస్తువంపెను, తీసుకొమ్మని పల్క, నామెయు శీఘ్రిముగ తలుపు దెఱచి, కస్తూరి తిలకముతో కూడిన ఊర్ధ్వపుండ్రములు గలవానిని నల్లని సిగముడియు తెల్లని జన్నిదమును కౌపీన, కటిసూత్రములును తెల్లని పట్టు వస్త్రము గూడకట్టును ఉత్తరీయము వల్లెవాటును గలిగి చామనచాయ తిరుమేనితో నిలుచున్న కైతవ బ్రహ్మచారిని జూచెను. ఆతడును తన ఉత్తరీయము చాటున నున్న బంగరుగిన్నెను ఆమెకిచ్చి విప్రనారాయణులు నీకిది యిచ్చి రమ్మనిరని జెప్పి యిచ్చి, వాకిటి యరుగుపై పరున్న విప్రనారాయణుని లేపి దేవదేవి రమ్మన్నదని తెల్పి వెడలి పోయెను.

దేవదేవియు నాగిన్నెను తల్లికి జూప నామెయు శీఘ్రిముగ విప్రనారాయణుని రప్పించెను. అంతట దేవదేవి యారాత్రియెల్ల విప్రనారాయణులకు చందనం బలది పుష్ప తాంబూలాదులొసంగి పూ శయ్యపై మదనకేళిని పరితృప్తినొనర్చెను.

అంతట నుషఃకాలమున రంగేశుని యర్చక పరిచార కాదులు ఆలయ ప్రదక్షిణ మొనర్చి బలిపీఠకడ ప్రణుతి జేసి మంగళవాద్యములు మ్రోగ దివ్య కవాటములు తెఱచి లోన ప్రవేశించి జూడ, సువర్ణ శుద్ధోదక పాత్ర గన్పించక పోవుటచే యవనిభర్త కీవృత్తాంత మెరిగింప నా నిచుళాపురాధీశుడును అర్చకులపనియే యిదియనిదలచి వారిని దండింప నియోగించెను. అంతట దండనాథుడు వారలను దండించుచుండ, దేవదేవి యింటి దాసి యొకతె జలాహరణార్థము (మంచి నీరు తెచ్చుటకు) జనుచు నిది చూచి జాలిగలిగి అయ్యా రాత్రి విప్రనారాయణుని శిష్యుడొకబంగరు పాత్రదెచ్చి దేవదేవికి విప్రనారాయణులు నీకై పంపిరని జెప్పి యిచ్చి వెడలెను. ఆపాత్ర దేవదేవి పడకటిమంచము తలదిక్కున దాచబడియున్నదని జెప్పెను.

దండనాథుడంత భటులతో దేవదేవి యిల్లు శోధించి యాగిన్నెతోబాటు దేవదేవిని విప్రనారాయణులను గూడ నిర్బంధించి రాజు యెదుట నిల్పెను. ఆరాజును దేవదేవిని యీగిన్నె నీకెట్లు వచ్చెనని యడుగ, విప్రనారాయణుని శిష్యుడు రంగదాసను బ్రహ్మచారి తన గురువిచ్చిరమ్మనెనని యిచ్చివెడలెనని జెప్పెను. విప్రనారాయణులును తనకు శిష్యుడేలేడనియు తానీగిన్నె విషయమేమియు నెఱుగననియు దెల్పెను. ఈ విరుద్ధమగు సందర్భమును విచారించువరకు

నారాజు దేవదేవి విప్రనారాయణులను చెఱలో బెట్టించెను.

ఆరేయి నిద్రింప నపరరాత్రమున రాజు స్వప్నమున శ్రీరంగశౌరి తన్నుగాన్పించి, రాజా! యీ విప్రనారాయణుడు జగన్మాన్యుడు, నేనే యీ లీల నేర్పఱచితిని. ఈతడు నా ప్రాణసముడు, పాపరహితుడు గాన నీతని నర్చించి పంపుము. ఈ గిన్నెయును దేవదేవికిచ్చి యామె నింటికి సగౌరవముగ పంపుమని యాజ్ఞాపించెను.

అరుణోదయపువేళ నారాజు మేల్కాంచి స్వప్న వృత్తాంతమును మాటికి మాటికి దలచుచు భయభ్రాంతులతో పులకిత గాత్రుడై యానంద బాష్పము లొలుక దేవదేవి విప్రనారాయణుల సేవించి తన యపచారమును క్షమింపవేడుకొని వారిని మిక్కిలి సత్కరించి సాగనంపెను.

అంతట విప్రనారాయణులును మిక్కిలి యనుతపించి పంచమహాపాతకములనైన బోగొట్టగలట్టియు, మూడు కోట్ల యేబది లక్షల పుణ్యతీర్థముల స్నానఫలము నిచ్చునట్టియు నగు మహాభాగవతోత్తముల పాదప్రక్షాళన తీర్థమును (శ్రీపాదతీర్థమును) గ్రోలి పునీతులై గ్రామికులాది నిమిత్తమగు నాహ మనర్థ హేతువని తలచి శ్రీ వైష్ణవపాదధూళి తనకు నిరూపకంబుగ "భక్తాంఘ్రిరేణువు (తొండరడిప్పొడి) యను దివ్యనామమును ధరించి ధారక పోషక భోగ్య

ములుగ శ్రీరంగనాథు నాశ్రయించి, పరభక్తి పరజ్ఞాన పరమభక్తులు ముప్పిరిగొన తిరుమాలై (45 పాశురములు), తిరుప్పళ్ళియెళుచ్చి (10 పా) యను రెండు దివ్యప్రబన్ధముల లోకోజ్జీవనమునకై యనుగ్రహించి తిరుమేనును జాలించి యర్చారూపమునొందిరి.

దేవదేవియు రసవిశేషస్పర్శచే యినుము బంగరుగ మారునట్లు విప్రనారాయణుల దివ్యదేహస్పర్శచే పునీతయై వైరాగ్యముగల్గి తన సంపదనెల్ల శ్రీరంగనాథునకు సమర్పించి, ఆలయ సమ్మార్జనాది కైంకర్యము లొనర్చుచు తదీయ తీర్థప్రసాదంబుల నుజ్జీవించుచు గుణానుభవ కైంకర్య పరులగు భాగవతోత్తములను నిరుపాధిక సకలవిధ బంధువులుగా దలచుచు గొన్నిదినములుండి శ్రీభక్తాంఘ్రిరేణు మహాదేశిక శ్రీపాదముల దలచుచు పరమపదము నలంకరించెను.

* * * * *

## తొండరడిప్పొడి యాళ్వార్ల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ కోదణ్డే జ్యేష్ఠనక్షత్రే । మణ్డఙ్గుడి పురోద్భవమ్ ।
చోళోర్వ్యాం వనమాలాంశం। భక్తపద్రేణు మాశ్రయే॥

నిత్య॥ తమేవమత్వా పరవాసుదేవం, రంగేశయం రాజవదర్హణీయం,
ప్రాబోధకీంయోకృతసూక్తిమాలాం, భక్తాంఘ్రిరేణుం భగవన్తమీడే॥

## వాళి తిరునామములు

మణ్డఙ్గుడి యతనై వాళ్విత్తాన్ వాళియే ।
మార్గళియిల్ కేట్టైయతనిల్ వన్దుదిత్తాన్ వాళియే ।
తెణ్డిరై శూళరఙ్గరైయే తెయ్వమెన్ఱాన్ వాళియే ।
తిరుమాలై యొన్బతఞ్జుమ్ శెప్పినాన్ వాళియే ।
పణ్డు తిరుప్పళ్ళియెళుచ్చి పత్తురైత్తాన్ వాళియే ।
పాలైయరఙ్గళ్ కలవితనై పళిత్త శెల్వన్ వాళియే ।
తొణ్డుశెయ్తు తుళపత్తాల్ తులఙ్గినాన్ వాళియే ।
తొణ్డరడిప్పొడి యాళ్వార్ తుణైప్పదఙ్గళ్ వాళియే ॥

## నాళ్పాట్టు

మన్నియశీర్ మార్గళియిల్ కేట్టైయిన్ఱుమానిలత్తీర్ ।
ఎన్నిదనుక్కేత్తమెనిలురైక్కేన్ । తున్నుపుకళ్
మామఱైయోన్ తొణ్డరడిప్పొడియాళ్వార్ పిఱప్పాల్ ।
నాన్మఱైయోర్ కొణ్డాడుమ్నాళ్ ॥

* * * * *

## 9. తిరుప్పాణిఆళ్వార్లు

శ్రీరంగమునకు నైఋతి దిక్కున క్రోశమాత్రిదూర మున కావేరి నదీతీరమున, నిచుళాపురము (ఉఱైయూర్) గలదు. ఆ పురమున కలియుందు 162 వ దగు దుర్మతినామ

సంవత్సర కార్తికమాసమున పూర్ణిమతిథి రోహిణీనక్షత్రము బుధవారమున వృశ్చికలగ్నమున నొకబ్రాహ్మణు పొలములోని వరివెన్నునుండి శ్రీహరి యాజ్ఞచే శ్రీవత్సాంశమున నొక బాలుడవతరించెను. ఆ బాలునకు విష్వక్సేనులు పంచ సంస్కారములనొసర్చిరి. అంత్యజుడగు మాదదాసు డీబాలుని జూచి తనయింటికి దీసుకొనిపోయి పెంచెను. ఈబాలుడు పుట్టినదాది జ్ఞానభక్తివైరాగ్యములుగలిగి మోక్షేచ్ఛ గల వాడై చేతియందు వీణధరించి కావేరి తీరమున శ్రీరంగ క్షేత్రసమీపపు తిరువాయ్‌తురై (శ్రీముఖతీరమున-రేవున) నిశ్చలమగు మనస్సుతో ఆనందాశ్రువులు రాల్చుచు రోమాంచములుగలుగ మైమరిచి శ్రీరంగనాథుని కీర్తించు చుండెడివాడు. చేతియందు వీణధరించియుండుటచే వీనికి తిరుప్పాణన్ అను నామము సార్థకమాయెను.

ఇట్లుండ శ్రీరంగనాథుని తిరుమంజనమునకై తీర్థము గొనిపోవుటకు నిత్యకైంకర్యపరులగు లోకసారంగముని యనువారు కావేరికి వేంచేసి స్నానమాడి బిందెతీర్థము నెత్తిన నిడుకొని బయలుదేరగనే నదికి ఆవలియొడ్డున వీణా గాన మొనర్చుచు నిశ్చలమనస్కుడై యున్న యా యంతిమ కులుడగు తిరుప్పాణన్ కన్పించెను. ఆతని భక్తి నెఱుగక లోకసారంగముని అయ్యో తీర్థము అపవిత్రమైనదే యని చింతించి దూరముగ పొమ్మని కేకలిడెను. ఎంతగ యఱచి

నను తిరుప్పాణన్ మైమరచి యుండుటచే వినలేదు. అంతట లోకసారంగముని ఒకరాయినిగొని తిరుప్పాణన్‌పై విసరగా నది యాతని ముఖమునకు దగిలి నెత్తురు గార మొదలిడెను. అంతట తిరుప్పాణన్ మెలకువగల్గి అయ్యో రంగనికి అపచార మొనర్చితినే యని భయముతో దూరముగ పారిపోయెను.

లోకసారంగమునియు మరల స్నానమొనర్చి బిందెతో తీర్థముగొని ఆలయమును జేరి గర్భాలయపు తలుపులు దెరువ తెరిపిడి పడలేదు. అప్పుడు లోకసారంగమునియు ఆలయపు పరిచారకులును గట్టిగ యత్నించి. తలుపులు దెఱచి జూడ శ్రీరంగని ముఖమునుండి నెత్తురు గారుచుండెను. అందులకు వారెల్లరు మిక్కిలి భయపడి ప్రార్థింప నా భక్తుని గొట్టిన దెబ్బ నాకు తగిలినదని దెల్పెను. అంతట లోకసారంగ మునియు మిక్కిలి భీతిజెంది క్షమింపుమని శ్రీరంగని ప్రార్థింప నాతడును తిరుప్పాణిని తనవద్దకు దోడ్కొని రమ్మని యాజ్ఞాపించెను.

లోకసారంగముని పరుగుపరుగున కావేరికి ఆవలి ఒడ్డున దూరముగ పోయి, శ్రీరంగనిని గానమొనర్చెడి తిరుప్పాణిని సమీపించబోవ, నాతడును భయముతో పారిపో దొడంగెను, ఎట్టకేలకు లోకసారంగముని వానిని జేరి పట్టు కొని శ్రీరంగనియాజ్ఞను దెలిపి శ్రీరంగమునకు రమ్మని ప్రార్థింప, తిరుప్పాణియు అయ్యా! నేను అంత్యజుడను

పవిత్రమగు శ్రీరంగమును ద్రొక్కి అపవిత్ర మొనర్పజాలనని పలుక, ముని తిరిగివచ్చి శ్రీరంగని కీవిషయమును దెల్పెను. అందులకు శ్రీరంగనాథుడు, పాదములతో శ్రీరంగమును ద్రొక్కనని తిరుప్పాణన్ అనిరి గాన, వానిని మీరే భుజములపై నెక్కించుకొని నా వద్దకు తెండని మరల యాజ్ఞాపించెను.

లోకసారంగమునియు నట్లే వెడలి తిరుప్పాణన్‌ను తమ భుజములపై వహించి తెచ్చిరి. నాటినుండియు తిరుప్పాణన్‌కు యోగివాహులను నామము ప్రసిద్ధమాయెను.

శ్రీరంగనాథుడును పరమ కృపతో తన దివ్యమంగళ విగ్రహమును తిరుప్పాణన్‌కు జూపింప, నిత్యదరిద్రుడు పెన్నిధిని జూచినట్లు జూచి మిక్కిలి యానందించి పాదములనుండి కిరీటమువరకు శ్రీరంగనాథుని దివ్య సౌందర్యమునుగాంచి పులకితగాత్రులై యోగివాహులు "అమలనాది పిరాన్" అనెడు 10 పాశురములుగల దివ్యప్రబన్ధమును గానమొనర్చి "శ్రీరంగనాథుని జూచిన కనులతో తిరిగి మరొకరూపమును జూడనని శపథము జేసి శ్రీరంగనాథుని పాదముల జేరి అదృశ్యమైరి.

ఈ విధముగ తిరుప్పాణన్ తమ ఏబదవయేట శ్రీరంగనాథుల యనుగ్రహముచే అర్చామూర్తిగ నవతరించి భగవత్సన్నిధియందు వైభవముగ వేంచేసియుండిరి.

# తిరుప్పాణిఆళ్వార్ల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ వృశ్చికే రోహిణీజాతం, శ్రీపాణం నిచుళాపురే,
శ్రీవత్సాంశం గాయకేన్ద్రం, మునివాహనమాశ్రయే ॥
,, శ్రీలోక సారఙ్గ మహామునీన్ద్ర, స్కన్ధాధిరూఢం కలయామి నిత్యం,
కళఙ్కహీనం కమనీయభక్తం, కవీశ్వరం గాయక సార్వభౌమం॥

నిత్య॥ ఆపాద చూడ మను భూయ హరిం శయానం ।
మధ్యే కవేర దుహితుర్ముదితాన్తరాత్మా ।
అద్రష్టతాం నయనయో ర్విషయాన్తరాణాం ।
యోనిశ్చికాయ మనవై మునివాహనంతం ॥

## వాళి తిరునామములు

ఉమ్బర్ తొழுమ్ మెయ్జ్ఞాన ముత్తైయూరాన్ వాళియే ।
ఉరోకణినాళ్ కార్త్తిగైయిల్ ఉతిత్తవళ్ళల్ వాళియే ।
వమ్బవిழ் తార్మునితోళిల్ వకుత్తపిరాన్ వాళియే ।
మలర్కణ్ణిల్ వేఱొన్ఱుమ్ వైయాతాన్ వాళియే ।
అమ్బువియిల్ మతిళరఙ్గరకమ్పుకున్దాన్ వాళియే ।
అమలనాతిపిరాన్ పత్తుమరుళినాన్ వాళియే ।
శెమ్బతుమై యరుళ్ కూఱుమ్ శెల్వనార్ వాళియే ।
తిరుప్పాణన్ పొఱ్పతఙ్గళ్ శకతలత్తిల్ వాళియే ॥

## నాళ్ పాట్టు

కార్త్తిగైయిల్ రోహిణి నాళ్ కాణ్మినిన్ఱుకాశినియీర్ ।
వాయ్త్త పుకழ் పాణర్ వన్దుదిప్పాల్ । ఆత్తియర్గళ్
అన్బుడనే తానమలనాదిపిరాన్ కత్తదఱ్పిన్ ।
నఙ్గుడనే కొణ్డాడుమ్ నాళ్ ॥

# 10. తిరుమఙ్గై యాళ్వార్లు

చోళదేశమున కావేరినదియొడ్డున తిరుక్కురైయలూరున కలిన 217వ దగు నళ సంవత్సరమున కార్తికమాసమున పౌర్ణమి కృత్తికా నక్షత్రమున గురువారమున శ్రీహరి దివ్య చాపమగు శార్ఙ్గాంశచే చతుర్థ (శబర) కులమున ఆవినాడుడయాన్ అను వానికి కుమారుడు గల్గెను. ఆ బిడ్డనికి నీలుడని పేరిడిరి. ఆతడును ప్రాప్తయౌవనుడై విషయ ప్రవణుడై తిరుగుచు, చేత శస్త్రములు ధరించి యొకనాడు చోళ భూపతిని గాంచెను.

చోళరాజును నీలుని రూపమును భీకరాటోపమును జూచి యీతడసహాయ శూరుడని యెంచి సభయందు గూర్చుండనియమించి కొంతకాలము జరుగ నీలునకొక దేశ మిచ్చి, పరకాలుడు (శత్రువుల పాలిటి మృత్యువు) అని నామకరణమొనర్చెను. చోళ భూపతికి సామంతరాజుగ పరకాలుడును రాజ్యమేలుచుండెను.

ఆ సమయమున తిరువాలియందు నొక హ్రదము ప్రసిద్ధిగాంచియుండెను. అది కలువలతో స్వచ్ఛమగునీటితో నొప్పారుచుండెను. ఆ సరోవరమునకు అప్సరస్త్రీలు స్నానార్థమై వచ్చి కొంతదనుక జలక్రీడలాడి, స్వర్గమునకు వెడలిపోయిరి. వారితో పాటుగవచ్చి స్నానమాడి ఆ సరో

వరపుటోడ్డున ఆలయమున గల విష్ణువు నారాధించుటకై కలువ (పద్మము) ల గోయుచున్న నొక దేవకాంత యటనే మిగిలిపోయెను. ఆమెయు దేవతారూపమునువీడి మానవ శరీరధారిణియై బాలికగ సరస్సు ఒడ్డున నొంటరిగ తిరుగాడు చుండెను.

ఆ సమయముననే తిరునాంగూర్ నివాసియు వైద్య పుంగవుడునగు నొక వైష్ణవుడటకేతెంచి యాబాలికనుజూచి నీవెవ్వతెవు? నీ తలిదండ్రులెవ్వరని యడుగ నామెయు తనచెలికత్తెలు తనను విడిచి పోయిరనియు తలిదండ్రులు తనకు లేరనియు జెప్ప, నాతడామెను తనయింటికి దోడ్కొని పోయి భార్యకుజూప నామెయు సంతానము లేనిదగుటచే నా బిడ్డను ఆదరణతో నాలింగనము జేసికొనెను. ఆదంపతు లిరువురును తమ స్వంత బిడ్డవలె నాబిడ్డను పెంచి పెద్దజేసి కుముదమును (కలువను) చేతధరించియుండుటచేత నాబిడ్డకు కుముదవల్లియని పేరిడి పిలుచుకొనుచుండిరి. కుముదవల్లియు అత్యంత సౌందర్యవతియై యొప్పుచుండెను.

ఇట్లుండ నా ప్రాంతమును పరిపాలించుచున్న నీలునకు కుముదవల్లి సౌందర్యము దెలియరాగా, నాతడు తిరునాం గూరుజేరి భిషగ్వరులను సేవించి యాబిడ్డ వివరముల దెలిసి యామెను తనకిచ్చి వివాహము జేయుడని గోరెను.

భిషగ్వరుడును, యా బిడ్డ తల్లిదండ్రుల విషయమై

లోకమున సంశయముండుటచేత తన బంధువులలో నీమెకు సంబంధము లభించకపోవుటచే నీలుని కోర్కెను దీర్చదలచి కుముదవల్లినిజూచి అమ్మా యీతనిని వివాహమాడుదువా? యని యడుగ నామెయు పంచసంస్కారపరుడై (చక్రాంకన పరుడై) సంవత్సర కాలము, రోజునకు వేయినూర్నాట యెనిమిది మంది భాగవతోత్తముల రావించి తదీయారాధన మొనర్చి వారి శ్రీపాదతీర్థమును తళిహాప్రసాదమును స్వీకరించినచో నంగీకరింతునన, పరకాలుడును అంగీకరించి తిరునరైయూరున గల నంబిగారి నాశ్రయించి పంచసంస్కారపరుడై అర్థ పంచకజ్ఞానమునెరిగి ఆకారత్రయసంపన్నుడై తిరునాంగూరి కేతెంచి; భాగవత తదీయారాధన మొనర్చునట్లు ప్రతినజేయ, వైద్యదంపతులును కుముదవల్లిని పరకాలునకిచ్చి వైభవముగ వివాహ మొనర్చిరి.

అంతట పరకాలుడు కుముదవల్లినిగూడి భాగవత తదీయారాధన మొనర్చుచుండెను. ఇది జూచి సహింపలేని కొందరు, చోళరాజును జేరి రాజా! పరకాలుడు రాజ్యము నందలి ద్రవ్యమునెల్ల భాగవత తదీయారాధనము కొఱకై వెచ్చించుచుండెను. నీకు కప్పమును జెల్లించుచుండెనా? నీకు కప్పమును జెల్లించు స్థితియును ఆతనికి లేదని దెల్ప; నారాజును తనపరివారమును కప్పము దెచ్చుటకై పరకాలుని వద్దకు బంపెను. రాజశాసనమును విన్న పరకాలు

డును రేపుమాపనుచు జరుప వారలాతనిని నిర్బంధించిరి. తదీయారాధనమునకు భంగము వాటిల్లరాదనెడి తలంపుతో పరకాలుడును ఆ రాజపరివారమును పారద్రోలించెను.

ఈ విషయమును వినిన రాజు సైన్యమునంప పరకాలుడును సైన్యమునెల్ల నిగ్రహింప, చేయునదిలేక చోళరాజే స్వయముగ పరకాలుని వద్దకు ససైన్యముగవచ్చి పరకాలుని బిలిపించి యడుగ ఆత్మరక్షణముకై యుద్ధ మొనర్చితినేగాని కృతఘ్నుడను గాను, మీ ధనమిత్తును రండన, రాజును నా ద్రవ్యము దెచ్చుటకై మిత పరివారముతో నొక ఆప్తుడగు మంత్రిని పరకాలుని వెంట బంపెను.

ఆ మంత్రియు పరకాలుని వెంబడించి ఆతడన్నట్లు ధనమీయక పోవుటచే నొక శూన్యదేవళమున పరకాలుని నిర్బంధించి చుట్టును తన భటులను కావలియుంచెను. పరకాలుడును స్నానఅన్నపానాదులు మాని మూడు దినములు శ్రీరంగనాథుని శ్రీవేంకటేశుని వరదరాజులను శరణాగతి మొనర్ప, కరిగిరి వరదుడు కలను గన్పించి, కాంచీనగరమునకు వచ్చి వేగవతీ నది యొడ్డున గల పెన్నిధిని ద్రవ్వి తీసికొనుమని జెప్పి యదృశ్యమాయెను. పరకాలుడును నీ విషయమును మంత్రికి దెలియజెప్పి మంత్రిని యాతని పరివారమును దోడ్కొని కంచికేగి నదియొడ్డున త్రవ్వి జూడ నిధి గన్పింపదాయెను. పరకాలుడును వరదరాజుల దలచుచు

నిద్రింప నాతడు కరుణతో నిధియున్న చోటు గుర్తులను దెల్ప నచ్చటికేగి త్రవ్వి యపారమగు ధనరాశిని లభించి, రాజధనమిచ్చిపంపి మిగిలిన ద్రవ్యముతో తదీయారాధన మొనర్చుచుండిరి. మంత్రియు తనపరివారముతో నారాజ ద్రవ్యమును గొనిపోయి రాజునకర్పించ నతడు పరకాలుని వైభవమున కచ్చెరువొంది యాద్రవ్యమును బొక్కసమున గలువనీయక దానధర్మము లొనర్చెను.

పరకాలురును భార్యయగు కుముదవల్లితో స్వార్జిత ద్రవ్యముతో తదీయారాధన మొనర్చు తలంపును దెలుప, ఆమెయు నంగీకరింప, భార్యతోను (1) నీర్ మేల్ నడప్పాన్ (నీటిపై నడచువాడు) (2) నిழలొతుఙ్గువాన్ (నీడన యొదుగువాడు) 3) తాళూతువాన్ (తాళమును ఊదితీయువాడు) 4) తోలా వழక్కన్ (గాలిలో నడచువాడు) నగు నల్గురు మంత్రులు సహాయులుగను, 'ఆడల్ మా' అనెడి గుఱ్ఱమును "అమరథ్ కడమాకళియానై" అనెడి ఏనుగును వెంటనిడుకొని అడవులలో నివసించుచు పట్టణములను గ్రామములను పల్లెలను గల అవైష్ణవద్రవ్యమును దొంగిలించి తెచ్చి భాగవత తదీయారాధన మొనర్చుచుండెను.

ఒక గ్రామమున నొకనాటి చీకటిరాత్రియందు ఒక సంపన్న గృహస్థు పెరటి వాకిలియందు పరకాలురు పొంచి

యుండిరి. ఆ గృహిణి బంగరు భోజన పాత్రను కడుగుటకు దొడ్డిలోనికిరాగానే పరకాలురాపాత్రను లాగుకొని చీకటిలో నావలకు దూకిరి. వెంటనే యామె అస్మద్గురుభ్యోనమః యని పలికి లోనకేగి యీ విషయమును భర్తతో జెప్పెను. పరకాలు రావాక్యమును విని సంభ్రమముతో నిది భాగవత ద్రివ్యమని దలచి యాపాత్రను తలుపున కానించి వెడలి పోయిరి. ఆ దంపతు లిరువురును దీపమునుగొని వచ్చి చూచుసరికి బంగరుపళ్ళెరము తలుపు ప్రక్కనే గన్పించెను. అంతట నా భర్త భార్యతో నీప్రాంతమున పరకాలురు భాగవత తదీయారాధనకై అభాగవత ద్రివ్యమును దొంగి లించుకొని పోవుచుండిరని వింటిని. ఆతడు నీ చేతిలోని పళ్ళెమును లాగుకొనినప్పు డేమైన నంటివా ? యని యడి గెను. అందులకామె నేనేమియు దూషించలేదు, అస్మ ద్గురుభ్యోనమః యని యాచార్యులను దలచుకొంటిననెను. అయ్యో అదియే యింతపనిజేసినది, ఈవిధముగనైన మన ద్రివ్యము భాగవత తదీయారాధనమున బడియుండెడిది, నీ వాచార్యులను తలచుటచే వైష్ణవద్రివ్యమని విడిచిపోయిరి, యని యజమాని మిక్కిలి చింతించెను. ఇట్లు పరకాలురు తదీయారాధనము కొనసాగించుచుండిరి.

ఒకనాడు పరకాలురు బిల్వారణ్యమున దారిదోపిడికై వేచియుండిరి. నాటి పగటి కాలమున మూడవ ఝాము

వరకును నొక్కరును బాటసారులు గన్పింపలేదు. పరకాలురు నేటి తదీయారాధన మెట్లోయని చింతించుచు, శిష్యునొక్కనిని యెత్తగు చెట్టు చివరి కొమ్మపైనెక్కి నాల్గు దిక్కులనుండియు నెవరేని దూరమున వచ్చుచుండిరేమో చూడుమనిరి.

అపుడు భగవంతుడగు శ్రీరంగనాథుడు పరకాలుని చరమ పురుషార్థ నిష్ఠకు సంతృప్తుడై కటాక్షింపనెంచి లక్ష్మితో గూడి తాము నూతన దంపతులవలె పల్లకీనెక్కి బ్రహ్మను వృద్ధపురోహితుడుగను దేవతలను పెండ్లి బంధువులవలెను జేసికొని అపారమగు ధనసంపదలతో గూడి అనేకాభరణ వస్త్రములతో ప్రయాణమైరాగా పరకాలురును తమ పరివారముతో వారినడ్డగించి ధనమునెల్ల లాగికొని భూషణములను వస్త్రములనుమూటగట్టుకొని మరియు పెండ్లికొమరుని కాలి వ్రేలిన గల బంగరు చుట్టును గూడ దీసి యిమ్మని నిర్బంధించెను. అప్పుడు పెండ్లికొమరుడును, ఈ పాదాంగుళీయకమైన విడువరాదా? యన, పరకాలురును దానితో శ్రీ వైష్ణవతదీయారాధనమున కొక దినమునకు విస్తళ్ళకైన సరిపోవును గాన తీసియిమ్మని నిర్బంధించిరి. అంతట నా పెండ్లికొమరుడు చిరునగవుతో పరకాలురను జూచి నాయనా! నీవు కలివైరివా? యనగా నాటినుండియు నా నామము సార్థకమాయెను. పరకాలురును ద్రవ్య

మంతయు మూటగట్టించి తమ పరివారమును మోసికొని పొండని యాజ్ఞాపింప వారును మూటల నెత్తుకొని కదల జాలరైరి, అదిజూచిన పరకాలురు మిక్కిలి కోపముతో కత్తిని జూపి పెండ్లికొమరుని భయపెట్టుచు మంత్రించితివా యేమి?, అగుచో దానిని దెలుపుమనగా పెండ్లికొమరుడును దగ్గరకు రమ్మని పరకాలుని కుడిచెవిలో తిరుమంత్రము నుపదేశించి మంత్రార్థమును గృపజేసి తన నిజరూపమును దర్శింపజేయ, పరకాలురును భగవానుని కృపచే భగవత్స్వరూప రూప గుణ విభూతి చేష్టితములనెల్ల ననుభవించి, యున్మస్తకానందము లోన నిముడక దివ్య ప్రబన్ధరూపముగ బయల్పఱచిరి.

భగవానుడును మిక్కిలి ప్రీతుడై నాటినుండియు దివ్య దేశములనెల్ల నీ దోపిడి యుత్సవము జరుపునట్లాజ్ఞాపించెను.

అంతట పరకాలురు శ్రీరంగనాథుని సేవింప సపరివారముగ శ్రీరంగముజేరి శేషతల్పమున నున్న వానిని దర్శించి అత్యంత భక్తియుక్తులై తీర్థ శఠకోప ప్రసాదముల స్వీకరించి శ్రీరంగనాథునికి మంటప గోపుర ప్రాకారముల నిర్మాణకైంకర్యమొనర్ప దలచి మంత్రులతో నాలోచింప, వారును నాగపట్టణమున నొక బౌద్ధాలయమున బంగరు విగ్రహముగలదు, దానిని దెచ్చుట యుక్తమని దెల్ప, కలివైరియు వారినిగూడి నాగపట్టణము జేరి సారపుష్కరిణీ

తీరమున సుందరారణ్యమున నున్న సుందరరాజస్వామికి నమస్కరించి బౌద్ధాలయమును జేరిరి.

మిక్కిలి యెత్తుగను నునుపుగను నున్న నా బౌద్ధాలయమున ప్రవేశించుటకు ఎంత ప్రయత్నించినను కలివైరికి దారి గన్పడలేదు.

ఆపట్టణవాసులను విచారింపగా, నాలయమును నిర్మించిన శిల్పి "వేపాణ"మను ద్వీపవాసియని యెరిగి, నావనెక్కి యా ద్వీపము జేరి యాశిల్పితో మిక్కిలి చెలిమి జేసి యాతనిని యనేకములగు కథలచే నానందపఱచి, మాటల సందర్భమున బౌద్ధాలయమున ప్రవేశించు మార్గమును గూర్చి యడుగ శిల్పియు శిఖరమున సవ్యాపసవ్యములుగ తిరుగు రెండు చక్రములు గలవనియు వానిని అరటి మోదలచే తిరుగకుండ నాపి శిఖరమును పైకెత్తినచో లోనకు మార్గమేర్పడునని దెలుప, సంతసించి యారాత్రిగడిపి పరకాలురు తమ మంత్రి వర్యులతో గూడి నాగపట్టణమునకు ప్రయాణమైరి.

అపుడు మిక్కిలి ధనవంతుడగు నొక వ్యాపారి ఓడ నిండ పోకచెక్కలు నింపుకొని నాగపట్టణమునకై బయలు దేరుచుండెను. పరకాలురును పరివారమును, వ్యాపారిని మంచిజేసికొని ఆతని ఓడనెక్కిరి. దారిలో పరకాలురు పోకవ్యాపారితో స్నేహమొనర్చి యొకపోకచెక్కను దీసికొని దానిని రెండు ముక్కలుగా జేసి ఒకసగము ఓడలోని సరుకులో

నందరుజూచునట్లు పడవేసి, వ్యాపారితో నయ్యా నాగపట్ట ణము జేరగనే నా సగము పోకను ఇచ్చివేయవలెను సుమా యనగా వ్యాపారియు నవ్వుచూ అట్లే తీసికొనుడనెను. అంతట పరకాలురును మీరన్నట్లు చీటీ వ్రాసియిండని కోరగా నా వ్యాపారియు ఓడలోని మీ సగము పోకను నాగపట్నము జేరగనే మీరు తీసికొనవచ్చునని వ్రాసి యిచ్చెను.

అంతట ఓడ నాగపట్టణమును జేరగనే పరకాలురును కూలీలతో ఓడలోని సరుకులో సగభాగమును తాముదింపించు కొన మొదలిడిరి. అందులకు వ్యాపారి పరకాలునితో అయ్యా మీది వక్కలోని సగమేకదా యన, ఓడలోని పోకలో సగమని నీవే వ్రాసి ఇచ్చితివిగదా యన, వ్యాపారియు బదులు చెప్పలేక మిన్నకుండెను. అంతట పరకాలురు సగము పోకను అమ్మి సొమ్ముచేసికొని తమ మంత్రులతో పట్టణములోని కేగిరి.

ఆరాత్రి పరకాలురు మంత్రులతోగూడి శిల్పి వలన సంగ్రహించిన ఉపాయముతో నా శిఖరమును పెల్లగించి ఆలయమున ప్రవేశించి బంగరు బౌద్ధవిగ్రహమును పెల్లగించి తరలించుకొనిపోవుచు తెల్లవారుసరికి కృష్టకుటీపురమును జేరి మోకాటిలోతు బురదగల పొలములో పాతిపెట్టిరి. పరకాలు రంతట శ్రీకృష్ణపురమునందలి శ్రవణతీర్థమున స్నానమాడి

యూర్ధ్వపుండ్రముల ధరించి అచ్చటనేగల పొగడపూలను గోసుకొని యా వృక్షమును కాయలు లేక యెప్పుడును పూలతోనే యుండునట్లానతిచ్చి, ఆలయమునందలి దామో దరు నర్చించి యాతని యనుగ్రహమునుబొంది రాత్రికాగానే విగ్రహమును బైటకుదీసి రాత్రియెల్ల ప్రయాణముజేసి తిరు ప్పేర్ నగర్ చేరిరి. అచ్చట శేషపాన్పుపై పరున్న అప్ప క్కుడత్తాన్ స్వామిని సేవించి తీర్థప్రసాదము లుజ్జీవించి శ్రీరంగమును జేరిరి. శ్రీరంగమున నా బౌద్ధవిగ్రహమును చిటికెనవ్రేలినిదప్ప తక్కినదంతయు కరిగించి శ్రీరంగమున ప్రాకారగోపురమంటపాది నిర్మాణకైంకర్యములకు వినియో గించిరి.

నాగపట్టణమున బౌద్ధవిగ్రహము దొంగిలింపబడిన మరునాటి ఉదయమున బౌద్ధాలయ అర్చకుడు ఆరాధన మొనర్చుటకై ఆలయ ద్వారముల దెఱచి లోన బంగరు విగ్రహము గన్పింపక పోవుటచే నాలయాధికారులకు దెల్ప, వారును సంభ్రమాశ్చర్యములతో వచ్చి చూచి భయభ్రాం తులై నేర్పరులగు చారులను నలుదిక్కులకును పంపిరి. వేగులవారును వెదకుచు వచ్చి శ్రీరంగమున బౌద్ధవిగ్రహము కరిగింపబడుటను దెలిసి నాగపట్టణమున కీవార్తను దెలియ బఱచిరి. అంతట బౌద్ధాలయపుటధికారులెల్లరును శ్రీరంగ మునకు వచ్చి పరకాలుల నిర్బంధింప, పరకాలురును శ్రీ

రంగపాలకునియెదుట నా బౌద్ధులకు సంవత్సరాంతమునకు చిటికెనవ్రేలు కొలత పడకుండునట్లీయగలనని చీటీ వ్రాసి యిచ్చి వారలను సాగనంపెను. ఈ సంవత్సరములో పునః పరకాలురు శ్రీరంగ ప్రాకారాది సకల కైంకర్యములను పూర్తి జేసిరి. సంవత్సరపు గడువు పూర్తి కాగానే బౌద్ధ ఆలయాధికారులు పరకాలుని జేర నాతడును విగ్రహపు చిటికెనవ్రేలు నొక గుడ్డలో మూటగట్టి వారల కందించెను. అదిచూచిన బౌద్ధాలయాధికారులు పాలకునియెదుట నాగో పణమొనర్ప పరకాలురును చీటీని దెమ్మని, యందు తాను వ్రాసినట్లుగనే చిటికెనవ్రేలు కొలతలేకుండ యిచ్చితినని దెల్ప అధికారులును తమ తెలివిలేమికి చింతించి చేయునది లేక కాంతిహీనులై వ్రేలును మాత్రముగొని తిరిగిపోయిరి.

నాల్గవ ప్రాకార నిర్మాణమున మధ్యలో తొండరడి ప్పొడి యాళ్వార్ల గృహము అడ్డమురాగా పరకాలురు దానిని పడగొట్టక తప్పించి ప్రాకారమును నిర్మింపజేసిరి. అందులకు అర్చామూర్తులును మహాత్ములునగు తొండరడి ప్పొడి ఆళ్వార్లు మిక్కిలిసంతసించి ఆగృహమునకు పర కాలగృహమని పేరుంచిరి. అది శ్రీరంగమున చంద్ర పుష్కరిణికి ఈశాన్యమున పరకాలమంటపమని నేటికిని ప్రసిద్ధిగల్గి కన్పించుచున్నది.

ప్రాకారనిర్మాణాదులొనర్చిన శిల్పులకు నిర్మాణములు పూర్తియైన తరువాత వేతనము లిత్తునని యొప్పించుకొనుటచే శిల్పులెల్లరును నొక్కమారు వేతనములకై నిర్బంధింప పరకాలురు తిరువెళ్ళరైలోని పద్మలోచన స్వామి సన్నిధిన ధనమిత్తునని వారినెల్లరను నావపై నెక్కించుకొని ఉత్తర కావేరి పాయను దాటుచు నదిమధ్యన నావను ముంచి వేయించిరి. ఇట్లు శిల్పులెల్లరును చనిపోవుటచే నా పాయకు కొల్లడము (చంపబడినచోటు) అని ప్రసిద్ధియై యున్నది. అంతట శిల్పుల బంధువులెల్ల పరకాలుని చుట్టుముట్టి బాధింప, పరకాలురు మధుర వాక్కులతో వారలతో "అయ్యలారా! కాలమహిమచే నిట్లాయెనే గాని యిందులకు నేను కారణముగాదు, బ్రహ్మాదులకైన కాలమును తప్పించుకొన సాధ్యముగాదుకదా" యని పలుక నందులకు వారొడంబడి అయినచో వారికీయవలసిన వేతనములెల్ల మాకిమ్మని నిర్బంధింప పరకాలురును తానేమియు వారికి బాకీలేననియు నీయవలసిన దానికన్న నెక్కువగనే వారికిచ్చితిననియు నీ విషయమును చనిపోయిన శిల్పులచేతనే చెప్పించెదనని దెల్పి మనసున శ్రీరంగనాథుని దలచి ఆకసమువంక జూచుచు నో శిల్పులారా! మీరెల్లరువచ్చి మీ మీ బంధువులకు మీ సొమ్ము ముట్టినదని దెల్పుడని ప్రార్థింప, వారెల్లరు దివ్యదేహములతో దివ్యవిమానములలో వచ్చేసి ఆకసముననిల్చి, పరకాలురు మహానుభావులు వారు మాకీయ

వలసినదానికన్న నెక్కుడుగనే ముట్టజెప్పిరి, మీరును సుఖింప గోరుచో వారినాశ్రయింపుడని దెల్పి యదృశ్యులైరి.

పరకాలురును వలలువేయించి శిల్పుల కళేబరము లెల్ల పట్టించి తెప్పించి వాటికి అగ్నిసంస్కారములు వారల జ్ఞాతులచే జేయించుటకై కొల్లడము ఒడ్డున నాల్గవ భాగము భూమిని 108 సువర్ణనాణెముల ఖరీదునకు శ్రీరంగనాథునుండి తీసుకొని యచ్చట నా కార్యమును నిర్వర్తింప జేసిరి. క్రయ పత్రికయందు భట్టార్యులు చేవ్రాలు జేయకపోవుటచే నాటి నుండియు భట్టరు వంశస్థులకు తప్ప శ్రీరంగపురవాసుల కాప్రదేశము స్మశానవాటికగ నేర్పడెను. శ్రీరంగ మున నుత్తర కావేరియందు మాఘమాసమున శిల్పులను ముంచుటచే, మాఘమాసమున కొల్లడమున స్నానమొన ర్చుట యుత్తమమని దెల్పుదురు.

పరకాలురును శ్రీరంగమునకు వాయువ్యదిశన నొక మంటపము నిర్మించుకొని యందు నివసించుచు, దేశములన్నిటి యందును సంచరించి పండితుల ననేకుల జయించుచు చోళ మండలమందలి త్రివిక్రపురంబును జేరిరి. అచ్చటకు పశ్చిమ మున బ్రహ్మపురము గలదు. అందు సంబంధ ప్పెరుమాళ్ అను శైవపండితుడు అనేకులగు శిష్యులను గలిగియుండెను.

బ్రహ్మపురపు రాజవీధిన పరకాలుర వైభవమును

కీర్తించుచు వారి శిష్యులేగుచుండగా సంబంధప్పెరుమాళ్ శిష్యులది విని సహింపజాలక నడ్డగించిరి. అపుడు పరకాలురతో సంబంధప్పెరుమాళ్ వాదమునకు సిద్ధమైరి.

భగవద్ద్వేషియగు సంబంధప్పెరుమాళ్ సంబంధముచే నా బౌద్ధపురమంతయు పాషండ ధర్మములతో నొప్పుచుండెను. శ్రీహరి విగ్రహము లేని యూరున వాదించుట కిష్టపడని పరకాలురకు నొక వృద్ధవైష్ణవి గాన్పించెను. ఆమె వద్దనున్న వేణుగోపాల విగ్రహమును పూజించి పరకాలురు సంబంధప్పెరుమాళ్ళను వాదమున నోడించిరి. సంబంధప్పెరుమాళ్ళును పరకాలుర విద్యకు ఆశ్చర్యపడి శీఘ్రకవనము చిత్రకవనము మధురకవనము విస్తరకవనమను నీ నాలుగు విధములగు కవిత్వచాతుర్యము మీకే తగునని అంగీకరించి బహుసన్మానముల నొసంగి స్తుతించి సాగనంపిరి.

కీర్తిమంతులగు పరకాలురు మహేంద్రాద్రి మొదలు హిమాలయము పర్యంతముగల శ్రీమన్నారాయణుని దివ్యదేశములు 108లోను 83 దివ్యదేశములను సేవించి యచ్చటి పెరుమాళ్ళను మంగళాశాసన మొనర్చిరి.

వీరు అనుగ్రహించిన దివ్యప్రబన్ధములు ఆరు. అవి 1) పెరియతిరుమొళి 2) తిరుక్కుఱున్దాణ్డకమ్ 3) తిరునెడున్దాణ్డకమ్ 4) తిరువెళుకూఱ్ఱిరుక్కై 5) శిఱియతిరుమడల్

6) పెరియతిరుమడల్. ఈ యారును నమ్మాళ్వార్ల నాల్గు దివ్య ప్రబన్ధములకును (సంస్కృతవేదములకు అంగములవలె) షడంగములైనవి.

వీరు అవతరించిన దినము మొదలు కూరత్తాళ్వార్ల అవతారదినము వరకును ద్రావిడ వేదమునకు నిగమన (అనధ్యయన) కాలమని యేర్పడియున్నది.

వీరి తిరునామములు, నీలురు పరకాలురు కలివైరి తిరుమంగైమన్నన్ తిరుమంగైయాళ్వార్లు మొదలగునవి.

వీరు తమ దివ్యప్రబన్ధముల, ఆశు మధురమ్ చిత్రం విస్తారమ్ అను చతుర్విధ కవితలు జెప్పుటచే వీరికి చతుష్కవి శిఖామణులను బిరుదము గలదు.

ఇట్లు పరకాలురు అనేక విధములుగ భాగవతోత్తములకును భగవంతునకును విశేషకైంకర్యములొనర్చి ఉత్కృష్టమగు శ్రీవైష్ణవ ధర్మమును భూలోకమున స్థిరముగ నెలకొల్పి, 105 సంవత్సరములు వేంచేసియుండి శ్రీరంగనాథుని శాసనముచే శ్రీరంగనగరమున కేగి యచ్చట విష్ణుసాయుజ్యము నొంది యర్చారూపమును ధరించి విష్ణాలయములను వైష్ణవగృహములను నేటికిని అర్చింపబడుచు నుండిరి.

## తిరుమఙ్గై యాళ్వార్ల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ వృశ్చికే కృత్తికాజాతం । చతుష్కవి శిఖామణిమ్ ।
షట్ప్రబన్ధకృతం శార్ఙ్గ । మూర్తిం కలిహమాశ్రయే ॥
,, సుధాగానాబ్దానాం । కలియుగభవానామపగమే ।
నళే వర్షేమాసే శరదిచరమే దైవతగురోః ।
దినే తారే వహ్నేః శిశిరకిరణే పూర్ణకిరణే ।
క్షితావావిర్భూతః కలిరిపురమేయాత్మ మహిమా ॥
నిత్య॥ కలయామికలిధ్వంసం । కవింలోక దివాకరమ్ ।
యస్యగోభిః ప్రకాశాభిః । ఆవిద్యం నిహతంతమః ॥

## వాళి తిరునామములు

కలన్ద తిరుక్కార్త్తికై యిల్ కార్త్తికైవన్దోన్ వాళియే ।
కాశినియిల్ ఒణ్ కుఱైయలూర్ క్కావలోన్ వాళియే ।
నలన్తికళ్ ఆయిరత్తెణ్పత్తు నాలురైత్తాన్ వాళియే ।
నాలైన్దుమ్ ఆఱైన్దుమ్ నమక్కురైత్తాన్ వాళియే ।
ఇలఙ్గెళుకూత్తిరుక్కై యిరుమడలీన్దాన్ వాళియే ।
ఇమ్మూన్నిల్ పాట్టిరునూత్తిరుపత్తెళ్తైత్తాన్ వాళియే ।
నలన్తికళుమ్ కుముదవల్లి మణవాళన్ వాళియే ।
వాట్కలియన్ పరకాలన్ మఙ్గైయర్కోన్ వాళియే ॥

## నాళ్ పాట్టు

పేదై నెఞ్జే యిన్ఱై ప్పెరుమైయఱిన్దిలై యో ।
ఏదు పెరుమై యిన్ఱై క్కెన్నెన్నిల్ । ఓదుకిన్రేన్
వాయ్త్త పుకళ్ మఙ్గైయర్కోన్ మానిలత్తిల్
వన్దుదిత్త । కార్త్తికై యిల్ కార్త్తికై నాళ్ కాణ్ ॥

మాఱన్ పణిత్త తమిళ్ మఱైక్కు మఙ్గైయర్కోన్ ।
ఆఱఙ్గఙ్గూఱ అవతరిత్త । వీఱుడైయ
కార్త్తికై యిల్ కార్త్తికై నాళెన్ఱెన్ఱు కాతలిప్పార్ ।
వాయ్త్త మలర్ తాళ్కళ్ నెఞ్జే వాళ్త్తు ॥

* * * * *

# ఆచార్య సంగ్రహ చరిత్రలు

## శ్రీమన్నాథమునులు

తొండీర చోళదేశముల మధ్య వీరనారాయణమను పట్టణము (తిరుకోవలూరు) గలదు. అందు ఈశ్వరభట్టార్యు లను నొక బ్రాహ్మణోత్తములు గలరు. వారికి, కలియుగ మున 3264 సంవత్సరములు గడువగా శోభకృన్నామ సం॥ జ్యేష్ఠమాసమున పూర్ణిమ దినమున అనూరాధా నక్షత్రమున బుధవారమున విష్వక్సేనుల మంత్రియగు కుముదగణేశుని యంశమున నాథమునులను బుత్రు లవతరించిరి. నాథమును లును సకల శాస్త్రవిశారదులై విష్ణుభక్తిపరాయణులై జ్ఞాన సంపన్నులై వీర నారాయణ పురము నందలి రాజగోపాల దేవునకు సకలవిధ కైంకర్యముల నొనర్చుచు నుండిరి. నాథ మునులకును ఈశ్వరమునులను పుత్రులు కలరు.

శ్రీమన్నాథమునులును, భగవానుడు స్వయముగ వేంచేసియున్న దివ్య దేశముల ననుభవింపగోరి, రాజమన్నారు నాజ్ఞగొని సకుటుంబముగ ఉత్తర దేశయాత్రలకై బయల్దేరిరి.

శ్రీముష్ణమున నిత్యపుష్కరిణీ తటముననున్న వరాహ పెరుమాళ్ళను సేవించి; గోపురమున వామన తీర్థస్నాన మాడి త్రివిక్రముని సేవించి; ఘటికాచలము (చోళంగి పురము)న అమృతఫలప్రదుడగు నృసింహుని సేవించి; తొండీరమండల దివ్యదేశముల నన్నిటిని క్రమముగ సేవించి;

ఉత్తరమున మొట్టమొదటగ వేంకటాద్రి (తిరుమల) న శ్రీ శ్రీనివాసుల సేవించి; యహోబలమున (గరుడాద్రిన) హిరణ్యుని జంపిన నృసింహుని సేవించి; పాండురంగమున శ్రీవిఠలుని సేవించి; శ్రీకూర్మమున కూర్మనాథునిసేవించి; మధురయందు బాలకృష్ణుని సేవించి; మాయలో మధుసూదనుని సేవించి; గోవర్ధనమున గోపవేషధరు శ్రీకృష్ణుని; భక్తలోచనమున భవార్తిహరుని; గోమంత పర్వతమున కృష్ణుని; హరిద్వారమున జగత్పతిని; గంగాసాగర (ప్రయాగ క్షేత్ర) మున విష్ణుని; చిత్రకూటమున రాఘవుని; బృందావనమున నందసుతుని; కాళియహ్రదమున గోవిందుని; బదరీ క్షేత్రమున నారాయణుని; నైమిశారణ్యమున హరిని; సాలగ్రామమున హరిక్షేత్రమును; అయోధ్యయందు శ్రీరామచంద్రుని సేవించుచు; యమునాతీరమున గోవర్ధనగ్రామమున కృష్ణభగవానుని సేవించి యచ్చట కొంతకాలముండిరి. ఒకనాటిరాత్రి నాథమునుల స్వప్నమున వీరనారాయణ (తిరుక్కోళూరు) అధిపతియగు శ్రీ రాజగోపాలుడు సాక్షాత్కరించి తనవద్దకు తిరిగి రమ్మని తెలిపెను.

అంతట నాథమునులు మేల్కాంచి సకుటుంబముగ గోవర్ధనేశుని యాజ్ఞబడసి వీరనారాయణ పురమునకు ప్రయాణమై మార్గమధ్యమున జగన్నాథక్షేత్రమున పురుషోత్తముని; సింహాచలమున వరాహనృసింహుని; అహో

బలమున నారసింహుని; తిరుమలన వేంకటేశుని; ఘటికాచలము (చోళంగిపురము) న నృసింహుని; గృధ్రసరోవరము (తిరుప్పుట్కుళి) న విజయరాఘవుని; కాంచీపురిని వరదరాజులను; వీక్షారణ్యము (తిరువళ్ళూరు) న వీరరాఘవుని; తిన్ననూరున నన్నుగన్నతల్లియను ప్రసిద్ధిగల లక్ష్మిని భక్తవత్సలుని; మహీసారపురము (తిరుమళ్ళిశై) న మంగవల్లీ జగన్నాథులను, అచ్చటనే భక్తిసారులను సేవించి; కైరవిణీ తీరము (తిరువళ్ళిక్కేణి) న పార్థసారథిని, రంగనాథుని, రాఘవుని, గజేంద్ర రక్షకుని, లక్ష్మీనృసింహుని, సేవించి మైలాపురమున మహదాహ్వాయులగు పేయాళ్వార్లను సేవించి; వారవతరించిన బావితీర్థముచు ద్రాగి, అచ్చటి మాధవుని కేశవుని సేవించి; తోతాద్రి (తిరునీర్మలై) జేరి రంగనాథుని సేవించి; తిరువిడవెన్దై కళ్యాణసరస్సున స్నానమాడి కోమలవల్లీ వరాహస్వాముల సేవించి; మహాబలిపురమున స్థలశయనుని సేవించి; తిరువహీంద్రపురమున దేవదేవుని సేవించి; చిత్రకూటమున గోవిందరాజుల సేవించి; చోళదేశపు దివ్యతిరుపతులన్నిటికి నమస్కరించి; శ్రీరంగాయని యుచ్చరించిన మాత్రముననే మనుజుల సకల పాపముల బోగొట్టెడి శ్రీరంగనాథునకు నమస్కరించి; కుంభకోణము జేరి శార్ఙ్గపాణికి నమస్కరించి; వీరనారాయణపురమును జేరి రాజగోపాలుని దివ్యవిగ్రహమును సేవించి చేయు

మొగిడ్చి నిలచిరి. రాజగోపాలుడును నత్యంతాదరముతో నర్చకులచే తీర్థప్రసాదశఠకోపములను మాలను సనుగ్రహించి అచ్చటి వైష్ణవుల నెల్లర రావించి వీరిని నావలెనే యాదరింపుడనగా, వారును నాథమునులకు గృహానిర్మాణ మొనర్చ, నాథమునులును రాజగోపాలునకు వెనుకటివలెనే కైంకర్య మొనర్చుచు ఆశ్రితులకు శాస్త్రముల నుపదేశించుచు నచ్చట సుఖముగ నుండిరి.

ఇట్లుండ నొకనాడు పశ్చిమదిశనుండి శ్రీవైష్ణవులు కొందరేతెంచి వీరనారాయణపురమునందలి రాజగోపాలుని సన్నిధిలో శ్రీ శార్ఙ్గపాణి విషయమున శ్రీశఠగోపులు కృపజేసిన ఆరావముతే యనెడి తిరువాయ్మొళ్ళిలోని పది పాశురములను విన్నవింప, నది విన్న నాథమునులును మిక్కిలి సంతసించి వారితో నయ్యా ఈ స్తోత్రము చివరన ఓరాయిరత్తుళిప్పత్తు (ఒకవేయిలో నీపదియు) యని చదివిరి, మిగిలిన గ్రంథమునంతను చక్కగ పారాయణజేయుడని యడుగ, నందులకు వారును అయ్యా! యీ మాత్రమే మాకు పరంపరాగతముగ వచ్చినది, మిగిలిన దెచ్చటను గానమనిపలుక, వారివలన నా పదిపాశురములను గ్రహించి వారిని సత్కరించి పంపివైచి, నాథమునులును కుంభకోణము జేరి ఆరావముదు పాశురములచే శార్ఙ్గపాణిని ప్రార్థింప, నాతడు ప్రత్యక్షమై, నమ్మాళ్వార్లయనుగ్రహముచే దీని మొత్త

మును పొందవచ్చునని దెల్ప, నాథమునులును భగవద్వాక్య మును విని యాతనికి నమస్కరించి శీఘ్రముగ కురుకాపురికి జేరిరి.

కురుకాపురిన ఆదినాథుని సేవించి చింతచెట్టు మొదలున అర్చామూర్తిగనున్న శఠారులను సేవించి, యచ్చటనే కైంకర్యమొనర్చుచునున్న మధురకవుల శిష్యులగు శ్రీ పరాంకుశదాసులనెడి స్వామిని సమీపించి నమస్కరించి "శఠారి దివ్యసూక్తు" లేల లేకుండపోయెను? అవి తిరిగి యెట్లు లభింపదగునని ప్రార్థింప నందులకు శ్రీ పరాంకుశ దాసులును తమ ఆచార్యులగు మధురకవులను దలచి నమస్కరించి యిట్లు జెప్పదొడంగిరి.

అయ్యా శ్రీశఠకోపులు లోక సంరక్షణార్థమై ద్రావిడ భాషలో నాలుగు దివ్యప్రబన్ధములు రచించిరి. అందునను నాల్గవదగు తిరువాయ్మొళ్ళి సామవేదసారమై మోక్షప్రదానమున సారభూతమైనది. దానిని నేర్పినవారును నేర్చిన వారును గ్రన్థపూర్తియగునంతలో మోక్షమును బొందుచుండిరి. ఈ కారణముచే నెవ్వరును చెప్పువారును చదువు వారును మరణభయముచే లేకుండపోయిరి. కణ్ణినుణ్ శిఱుత్తాంబు దివ్యప్రబన్ధము నెవ్వరు 12 వేల పర్యాయములు శఠారి సన్నిధిలో పారాయణ మొనర్తురో వారికి

నమ్మాళ్వార్లు ప్రత్యక్షమగుదురని ప్రసిద్ధి, యింతవరకెవ్వ రును నట్లు జేసినవారు లేరని దెల్పిరి.

నాథమునులును శ్రీపరాంకుశదాసుల మాటలకంగీక రించి కణ్ణినుణ్ శిఱుత్తాంబు దివ్యప్రబన్ధమును పొంది చింత చెట్టువద్దగల నమ్మాళ్వార్ల అర్చామూర్తి యెదుట గూర్చుండి పన్నెండువేల పర్యాయములు జపించిరి.

శ్రీమహాలక్ష్మి పురుషకారముతో శ్రీ శఠకోపులు సచ్ఛిష్యలక్షణములుగల నాథమునులకు దివ్యచక్షువులనిచ్చి తమను దర్శింపజేసి దివ్యప్రబన్ధములనెల్ల సాకల్యముగ నుపదేశించి, తిరువాయ్ మొழியందు పొలికపొలిక పాశుర ములలోని శ్రీ వైష్ణవసమృద్ధికి కారకులగు భవిష్యదాచార్య విగ్రహమును సంకల్పించి యొసంగిరి. దానినే నాథమునులు పుణ్డరీకాక్షులకును, వారు శ్రీరామమిశ్రులకును, వారు యామునమునులకు నీయగా నది వారి తిరువారాధనముల నుంచుకొనుచు వచ్చిరి.

నాథమునులును శ్రీశఠకోపుల వలన సకలద్రవిడ వేదములను లభించి, వెనుకటివలెనే దివ్యప్రబన్ధానుసంధాన పూర్తిన చేతనులు పరమపదించకుండునట్లు ప్రార్థింప; శ్రీ శఠకోపులును "మరణమానాళ్" అనుపదమును "మరణ మానాల్" అనిమార్చి దివ్యప్రబన్ధము ననుసంధించువారు

శరీరావసానమున పరమపదము నొందెదరని జెప్పి; దానిని లోకమున ప్రచార మొనర్చుడని యాజ్ఞాపింప, నాథమునులును నాజ్ఞగొని, కుంభకోణమున శారంగపాణిని సేవించి వీర నారాయణపురమును జేరి రాజగోపాలునకు భక్తితో నమస్కరించిరి.

ఆతరువాత నాథమునులు తమ మేనల్లుళ్ళగు కీలైయకత్తాళ్వాన్ కీళైయకత్తాళ్వాన్ (నాథమునుల యింటికి పడమరన యిల్లుగలవారు, తూర్పున యిల్లుగలవారు)లచే నాదివ్యప్రబన్ధమెల్ల చక్కగ చదివించి దానిని దేవగానముతోఁ గూర్చి శ్రీరంగము కాంచీపురము, వేంకటాద్రి మొ॥ దివ్యదేశములన్నిటియందును ననుసంధింపజేయుచు నచ్చటచ్చటి పండితులకెల్ల దీనిని నధ్యయన మొనర్పజేసి ప్రకాశింపజేసిరి. ఇట్లు ద్రావిడ దివ్యప్రబన్ధములు తిరిగి శ్రీమన్నాథమునులచే వెలుగొందెను.

ఆకాలమున దేవగాన విశారదయగు నొకవేశ్యయు మనుష్యగానమున నిపుణయగు మరియొక వేశ్యయు చోళ రాజసభలో గానమొనర్ప, మనుష్యగాన మొనర్చిన వేశ్యనే యారాజును నచ్చటిపండితులును మెచ్చి బహుమతులిచ్చి పంపి, దేవగాన మొనర్చిన కాంత ననాదరించిరి.

అంతట నా దేవగాన మొనర్చిన వారవనిత యీ దేవ

గానమును దేవతలే యెరుగుదురు గాన దేవతాసన్నిధులలోనే గానమొనర్పవలెనని తలచి భగవానుని ఆలయముల నన్ని టను భక్తితో గానము జేయుచు సంచరించుచు వీరనారా యణపురము జేరి రాజగోపాలుని సన్నిధానమున గానమొన ర్చెను. ఆగానమునకు అచ్చటనే యున్న నాథమునులు మిక్కిలి సంతసించి యావేశ్యకు తీర్థ ప్రసాదములను మాలను శేషవస్త్రమును నిప్పించి పంపిరి. ఆ వారకాంతయు చోళ రాజసభకేగి రాజా! నా దేవగానము నెఱింగిన శ్రీవైష్ణ వోత్తములగు నాథమునులు వీరనారాయణపురమున గలరని దెలుప, నారాజును నాథమునులను సగౌరవముగ రప్పించి యెదురేగి భక్తితో పూజించి, దేవగానము నెరుగు నుపా యమును దెల్పుడని ప్రార్థించెను. అంతట నాథమునులును రాజా! దేవగానమును సలక్షణముగ నెరిగిన వారు, తాళముల ధ్వనిని వినినంతనే వాని బరువును కొలతను చెప్పగల్గుదురని దెల్పెను. ఆ మాటను వినిన చోళరాజు మూడువందల నలుబది తాళములను దెప్పించి వాని నన్నింటిని యొకేమారు ప్రయోగింప జేసెను. నాథమునులును ఆయా ధ్వనులనుబట్టి వానివాని తూకములను ప్రమాణములను హెచ్చుతగ్గులు లేక తెలియబఱచిరి. ఆ రాజును మహాశ్చర్యముతో నాథ మునులకు నమస్కరించి భక్తితో చాలధనము నర్పింప, దానిని గ్రహింపక, యారాజు నాశీర్వదించి నాథమునులు

వీరనారాయణపురమున కేగి రాజగోపాలదేవునకు సకలవిధ కైంకర్యముల నాచరించుచుండిరి.

వీరి నాశ్రయించిన శిష్యులలో ప్రధానులు పదునొకండుగురని ప్రసిద్ధి. అందు 1. ఉయ్యకొండార్లు (పుండరీకాక్షులు) 2. కురుకావలప్పన్ 3. కీళైయకత్తాళ్వాన్ 4. మేలైయకత్తాళ్వాన్ 5. తిరుకణ్ణమంగైయాండాన్ ఐదుగురు ప్రసిద్ధులు. వీరిలో పుండరీకాక్షులకు రహస్యార్థములను జెప్పి శ్రీరంగమున దర్శనస్థాపకులనొనర్చిరి. కురుకావలప్పన్ కోరికపై అష్టాంగయోగమును నుపదేశించిరి. వీరు వీరనారాయణపురమున యోగమున నుండిరి. మేలై, కీళైయకత్తాళ్వానుల నిద్దరను నాథమునుల మేనల్లుండ్రశ్రీరంగని గానముచే మెప్పించ నేర్పఱచిరి.

నాథమునులు రచించిన గ్రంథములు 1. న్యాయతత్వశాస్త్రము 2. పురుషనిర్ణయము 3. యోగరహస్యము.

నాథమునులు తమ కుమారులగు నీశ్వరమునులను జూచి నాయనా నీకు కుమారుడు గల్గగలడు. ఆతనికి యమునైత్తుఱైవన్ (యామునులు) యని పేరుపెట్టమనిజెప్పి పుండరీకాక్ష, కురుకావలప్పన్‌లనుజూచి నేను మీ కొసగిన శాస్త్రములనెల్ల నా మనుమనికి దెల్పి యాతనిని దర్శనస్థాపకునిగా జేయుడని యాజ్ఞాపించిరి.

ఒకనాడు చోళభూపతి తన భార్యలతో వీరనారాయణ పురమున మన్నారుదాజగోపాలుని సేవించి తిరిగివెళ్ళుటను జూచిన నాథమునులు, శ్రీకృష్ణుడు గోపికాస్త్రీలతోగూడి వెళ్ళుచానినిగా దలచి భక్తిపారవశ్యముచే గంగైకొండ చోళపురమువరకున్ను పరుగిడిరి, ఆదిచూచిన వారి శిష్యులు వెంబడించి, వారికి స్మృతిగల్గించి మరల్చిరి.

నాథమును లొకనాడు యోగమును జాలించి లేవగనే వారికుమార్తె 'నాయనా ఇపుడే దీర్ఘబాహువులగల్గి కాంతి మంతులగు నిరువురు రాజపుత్రులు ధనుర్బాణములు ధరించి యొకస్త్రీయు వానరమును వెంటరాగా మనయింటివాకిట నిల్చి నాథమును లెచ్చటనున్నారని' మిక్కిలి ప్రేమతో నడిగి యీదిక్కుగ వెళ్ళిరనిజెప్ప, నాథమునులును వచ్చిన వారు శ్రీసీతారామలక్ష్మణులును ఆంజనేయులుగను దలచి, వారేగిన దిక్కుగ వెంబడించి దారిలో కన్పించిన వారినెల్ల నడుగుచు పోయిపోయి వారినెచ్చటనుగానక దుఃఖాతిశయముచే శరీరమును విడిచి పరమపదము నలంకరించిరి. వీరు శిలావిభూతిలో 330సం॥ వేంచేసియుండి ధాతృనామసం॥ మాఘశుద్ధ ఏకాదశిన పరమపదించిరి. ఈ విషయము దెల్సిన పుండరీకాక్షులు మొదలగు శిష్యులు ఈశ్వర మునుల నోడొక్కని చని, నాథమునుల చరమ శరీరమునకు బ్రహ్మమేథసంస్కారాదులు జేయించిరి.

# శ్రీమన్నాథమునుల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ జ్యేష్ఠమాసేత్వనూరాధా । జాతం నాథమునింభజే ।
యశ్శ్రీశతారే శ్రుతవాన్ । ప్రబన్ధమఖిలంగురోః ॥

నిత్య॥ నమోచిన్త్యాద్భుతాక్లిష్ట । జ్ఞానవైరాగ్యరాశయే ।
నాథాయ మునయేఽగాధ । భగవద్భక్తిసిన్ధవే॥

,, వ్యోమ్నః పరస్తాత్సవిధంసమేత్య ।
లక్ష్మ్యా నియోగాత్కురుకాధిరాజః ।
సమంత్రరాజం ద్వయమాహయస్మై ।
నాథాయ తస్మై మునయే నమోస్తు ॥

## వాళి తిరునామములు

ఆనితనిల్ అనుడత్తిల్ అవతరిత్తాన్ వాళియే ।
ఆళవన్దారుక్కుపదేశమ్ అరుళివైత్తాన్ వాళియే ।
పాను తెర్కుక్కణ్డవన్ శొల్ పలవురైత్తాన్ వాళియే ।
పరాఙ్కుశనార్ శొర్పిరపన్దమ్బురిన్దుకత్తాన్ వాళియే ।
గానమురతాళత్తిల్ కణ్డిశైత్తాన్ వాళియే ।
కరుణైయినాల్ ఉపదేశిక్కతియళిత్తాన్ వాళియే ।
నానిలత్తిల్ కురువరైయై నాట్టినాన్ వాళియే ।
నలన్తికళు నాతముని నఱ్పతఙ్గళ్ వాళియే ॥

* * * * *

## శ్రీ పుణ్డరీకాక్షులు (ఉయ్యకొణ్డార్)

శ్రీరంగమునకు వాయువ్యదిక్కున మూడుక్రోసుల దూరమున తిరువెళ్ళఱైయను దివ్యదేశముకలదు. అందు చైత్రమాసమున పౌర్ణమి తిథియందు చిత్రానక్షత్రమున జయత్సేనుని అంశన పుండరీకాక్షు లను వారవతరించిరి. వీరు నాథమునులకు శిష్యులై వీరనారాయణ పురమున ఆచార్యకైంకర్యముల నొనర్చుచు వారియాజ్ఞచే సిద్ధాంత ప్రవర్తకులై శ్రీరంగమున 105 సంవత్సరములు వేంచేసి యుండి పరమపదించిరి. వీరి నాశ్రయించిన శిష్యులు మణక్కాల్ నంబి, తిరువల్లిక్కేణిప్పాణ్ పెరుమాళ్ అరైయర్, శెట్టలూర్ పృవ్రి శెణ్డలఙ్గారర్, శ్రీపుణ్డరీకదాసర్, ఉలకు పెరుమాళ్ నఙ్గై యను వారైదుగురిలో మణక్కాల్ నంబి (శ్రీరామమిశ్రులు) అత్యంత భక్తియుక్తులై యుండిరి.

## శ్రీపుణ్డరీకాక్షుల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ చైత్రమాసే కృత్తికాయాం । ఉదితం సద్గుణార్ణవమ్ ।
శ్రీనాథముని సచ్ఛాత్రం । పుణ్డరీకాక్షమాశ్రయే ॥

## వాழி తిరునామములు

వాల వెయ్యోన్దనై వెన్ఱవడివழగన్ వాழிయే ।
మాల్ మణక్కాల్ నమ్బితొழுమలర్ప్పదత్తోన్ వాழிయే ।
శీలమిగు నాదముని శీరురైప్పోన్ వాழிయే ।

శిత్తిరై యిల్ కార్తిక్కై నాళ్ శిఱక్కవన్దోన్ వాళ్ఞియే ।
నాలిరణ్డుమ్ ఐ య్యైన్దుమ్ నమక్కురైత్తాన్ వాళ్ఞియే ।
నాలెట్టి నుట్పొరుళై నడత్తినాన్ వాళ్ఞియే ।
మాలరఙ్గమణవాళర్ వళముళైప్పోన్ వాళ్ఞియే ।
వైయముయ్య కొణ్డవర్ తాళ్ వైయకత్తిల్ వాళ్ఞియే ॥

* * * * *

## కురుకైక్కావలప్పన్

ఆ కాలమున పాండ్య దేశమున కురుకానగరమున పుష్య మాసమున విశాఖయందు కురుకైక్కావలప్పన్ అనువా రవతరించి పుండరీకాక్షుల పురుషకారముచే నాథమునుల నాశ్రయించి శ్రీ వైష్ణవోత్తములై ఆచార్యులవలన అష్టాంగ యోగమును బడసి వీరనారాయణపురమున నూటడెబ్బది యేడు (177) సంవత్సరములు యోగ మొనర్చుచు నుండి పరమపదించిరి.

* * * * *

## శ్రీరామమిశ్రులు (మణక్కాల్ నంబి)

చోళదేశమున కావేరితీరమున శ్రీరంగసమీపమున మణక్కాల్ నగరముగలదు. అందు విరోధినామసం॥ మాఘ శుద్ధ చతుర్దశిన మఖానక్షత్రమున కుముదాక్షుల యంశమున

నొక బ్రాహ్మణగృహమున మణక్కాల్‌నంబి యవతరించిరి. వీరు పుండరీకాక్షుల నాశ్రయించి యెల్లవేళల నాచార్య కైంకర్యముల నత్యంతభక్తితో నొనర్చుచు 12 సంవత్సరము లుండిరి. ఆకాలమున పుండరీకాక్షుల భార్య ఆణ్డాళ్ళమ్మ గారు పరమపదించుటచే శ్రీరామమిశ్రు లాచార్య గృహ కైంకర్యము లన్నిటి నొనర్చుచు గురుభక్తి గలిగియుండిరి.

శ్రీ పుండరీకాక్షుల కిరువురు కుమార్తెలు కలరు. వారు స్నానమొనర్చి వచ్చుచుండెడి మార్గమున కాలువయడ్డముగ నుండెను. అందలి బురదలో దిగుటకు అసహ్యపడి వారు దిగకుండిరి. అంతట వారి వెంటవచ్చు చున్న శ్రీరామమిశ్రులు కాల్వకడ్డముగ ఒంతెనవలె తాము పండుకొని తమ వీపుమీదనుండి వారు దాటునట్లు జేసిరి.

ఇల్లుజేరిన కుమార్తెలీ చేష్టితమును తండ్రిగారగు పుండరీ కాక్షులకెరిగింప వారును మిక్కిలి ప్రీతులై తమ శ్రీపాద ద్వయమును శ్రీరామమిశ్రుల శిరస్సునకు స్పృశింపజేసి, మిక్కిలి యాదరించి, మానస వాచిక కాయికములచే చేయ బడిన పాపములనెల్ల నశింపజేయగల ద్వయమంత్రమును మరల ననుగ్రహించిరి.

తరువాత కొంత కాలమునకు శ్రీ పుండరీకాక్షులు పరమపదమునకు వేంచేయుచు శ్రీరామమిశ్రులతో ''మా రే

యీాదర్శనస్థాపకులై శ్రీరంగమున వేంచేసియుండి, శ్రీనాథ మునుల కుమారులగు నీశ్వరమునులకు పుత్రులుదయింతురు, వారికి యమునత్తురైవన్ అను తిరునామ మేర్పఱచి సిద్ధాన్త ప్రవర్తకుల నొనర్పుడు. ఇది మా ఆచార్యుల ఆజ్ఞ, నేనుండు కాలమున నీశ్వరమునులకు పుత్రులు గల్గరైరి, కావున మీా పరమాచార్య యాజ్ఞను పాటింపు'' డని చెల్పి శ్రీపుండరీకాక్షులు శ్రీమన్నాథమునుల శ్రీపాదముల దలచుచు పరమ పదించిరి. శ్రీరామమిశ్రులును ఆచార్యులకు బ్రహ్మమేధ సంస్కార మొనర్చి, సహాధ్యాయులతో గూడి, శ్రీ వైష్ణవ సిద్ధాన్తమును వృద్ధిబొందించుచు నుండిరి. వీరు భూలోకమున 105 సం॥ వేంచేసియుండిరి. వీరినాశ్రయించిన శిష్యులైదుగురు ప్రధానులు. వారలు 1) ఆళవన్దార్, 2) తెయ్వత్తుక్కరశునంబి, 3) గోమఠత్తుత్తిరువిణ్ణకరప్పన్, 4) శిఱుప్పుళ్ళూరుడైయ పిళ్ళై, 5) వంగిపురత్తాచ్చి.

## శ్రీరామమిశ్రుల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ మాఘే మఖాయాం సమ్భూతం, శ్రీరామ గురుసత్తమమ్,
పుణ్డరీకాక్ష పాదాబ్జ, చంచరీక మహంభజే.

శ్లో॥ అయత్నతో యామునమాత్మదాసం, అలర్కపత్రార్పణనిష్క్రయేణ,
యఃక్రీతవానాస్థితయౌవరాజ్యం, నమామితం రామమమేయసత్త్వమ్.

## వాళి తిరునామములు

తేశముయ్యక్కొణ్డవన్ తాళ్ శెన్నివైప్పోన్ వాళియే ।

తెన్నరఙ్గర్ శీరరుళై చ్చేర్న్దిరుప్పోన్ వాళియే ।
తాశరతి తిరునామమ్ తఙ్గైక్కువన్దోన్ వాళియే ।
తమిళ్ నాథమునియుగప్పెత్తాపిత్తాన్ వాళియే ।
నేశముడ నారియనై నియమిత్తాన్ వాళియే ।
నీణిలత్తిల్ పదిన్మర్కలై నిఱుత్తినాన్ వాళియే ।
మాశిమకన్దనిల్ విళఙ్గ వన్దుదిత్తాన్ వాళియే ।
మాల్ మణక్కాల్నమ్బి పదం వైయకత్తిల్ వాళియే ॥

* * * * *

## శ్రీయామునాచార్యులు

శ్రీమన్నాథమునుల కుమారులగు ఈశ్వరమునులు తమ భార్యయగు శ్రీరంగనాయకితో వీరనారాయణపురమున కాపురముండు కాలమున, కలిలో ధాతృనామ సంవత్సరము కర్కటమాసమున పూర్ణిమాతిథియందు శుక్రవారమున ఉత్తరాషాఢ నక్షత్రమున శ్రీమన్నారాయణుని సింహాసనాంశమున నొక పుత్రునుదయించిరి. ఈ విషయము నెఱిగిన శ్రీరామమిశ్రులు శ్రీరంగమునుండి వీరనారాయణపురమునకు విచ్చేసి యాబాలునిగాంచి పండ్రెండవదినమున యథావిధిగా జాతకర్మను చేయించి యామునాచార్యులని నామకరణము జేయించిరి. తరువాత ఈశ్వరమునులు ఆయా కాలములందు యథాశాస్త్రముగ అన్నప్రాశన

చౌలోపనయనాదులనెల్ల గావించి నాల్గువేదముల నభ్యసింప జేసిరి. సూక్ష్మబుద్ధియగు యామునార్యులు ఒక్కమారు వినినంతనే సకలమును గ్రహించుచు పద, క్రమ, జటా, వర్ణ, క్రమాదులతో గూడిన వేదములను, వేదాంగములను బాల్యముననే పూర్తియొనరించిరి. అంతట వీరి తండ్రిగారగు ఈశ్వరమునులు వీరిని శాస్త్రపండితుల జేయదలచి మహాభాష్యభట్టులవద్ద సర్వశాస్త్రముల జదివించుచుండిరి.

ఆకాలమున చోళభూపతి పురోహితుడగు ఆక్కియాళ్వాను పండితుడు దుర్మదుడై రాజ్యమునందలి పండితులెల్లరినుండియు ప్రతిసంవత్సరమును కప్పమును వసూలు జేయుచుండెను. మహాభాష్యభట్ట రాసుంకమును చెల్లించలేకుండుటవలన రాజభటులు వచ్చి నిర్బంధింప దొడగిరి. ఈ విషయమును విన్న యామునార్యులు మిక్కిలి కోపించి నిరంకుశులై యారాజదూతల బెదిరించి యొక శ్లోకమును వ్రాసిపంపిరి. "మేము కేవలము కవులము మాత్రమే కాము, కేవలము మంత్ర తంత్ర వేత్తలమూ గాము, కాని ప్రతివాదులనెడి యేనుగుల గర్వమును నిర్మూలింప సమర్థులము" అను అర్థముతో గూడిన పత్రికను రాజపురోహితుడు జూచి కలతజెందిన మనసుగలవాడై యావిషయమును రాజునకు దెల్పి, "రాజా! మహాభాష్యభట్టరు శిష్యుడగు పండ్రెండు సంవత్సరముల యా బాలుని పిలిపించి, నీయాజ్ఞ

నతిక్రమించినందులకు శిక్షింపు''మని కోరగా, పండితప్రియు డగు నారాజు బాలుని దోడ్కొనిరండని దూతలనంపెను. బుద్ధిమంతులగు యామునార్యులును యనాదరముతో గూడిన రాజాహ్వానమును లక్ష్యపెట్టకుండిరి. అంతట నారాజు మహా వైభవముతో పల్లకినంప యామునార్యులును దాని నధిరో హించి, రాజసభయందు పండితగోష్ఠిలో ప్రవేశించిరి. అంతట నారాజపురోహితుడు యామునార్యులనుజూచి నీ వేమి చదివితివని యడుగ, "పర్వతపుత్రియగు పార్వతి యొక్క చిగురులవంటి పాదములనుండుటచే ధన్యమగు ప్రదేశముగల హిమవత్పర్వతము మొదలు, రావణునిచే తీసికొనిపోబడిన సీతాదేవి ముఖపద్మమును వికసింపజేయు టకై నిర్మింపబడిన సేతువువరకును, సూర్యచంద్రులను ఉదయాస్తమయములతో తనకు శిరోభూషణముగా ధరించెడి ఉదయగిరి మొదలు అస్తగిరివరకు పూర్వోత్తర మీమాంసా శాస్త్రములలో నావలె కృషియొనర్చిన మొనగాడెవడైన మరియొకడున్నచో వెతికి తెమ్ము" అనెడి యర్థముగల శ్లోక మును ఆశువుగ జెప్ప, దుర్బుద్ధియగు నా వృద్ధపురోహితుడు బాలునితో శాస్త్రవాద మొనర్పగోరెను.

అంతట యామునమునులారాజుతో పండితమాధ్యస్థ ముగగాని వాదించనని దెల్ప, నారాజును, దేశములనెల్లెడల నున్న పండితులనెల్ల రావించెను.

అంతఃపురమున నేకాంతమున రాజునకును పట్టమహిషికిని ఎవరు జయింతురను విషయమున వివాదము జరిగెను. రాజు, పురోహితుడే జయించుననెను. బాలురగు యాముసులే జయింతురని పట్టమహిషి వాదించెను. పురోహితుడే జయించుచో వేటకుక్కల కాహారము నేర్పఱచుచు నీచవృత్తి నాచరింతునని పట్టమహిషియు, బాలుడే జయించుచో నాతనికి అర్ధరాజ్యమిత్తునని రాజును ప్రతిజ్ఞల నొనర్చిరి.

పండిత సమూహములతో గూడిన సభామంటపమున రాజుచే నాహ్వానింపబడి యామునార్యులును రాజుచే నాజ్ఞాపింపబడి పురోహితుడును వాదనకు సిద్ధమైరి.

అప్పుడు ఆక్కియాళ్వానను రాజపురోహితుడు యామునులను జూచి "నీవు బాలుడవగుటచే ముందుగ శాస్త్రవాదమునకు తగవు; లౌకికముగ నేవేని మూడు మాటలు జెప్పుము, వానికి నే నారు తప్పులు పట్టగలను, లేకున్న నే నారు మాటలు జెప్పెదను, నీవు మూడు తప్పులు పట్టుము, జయించినవారు ఓడినవారి శిరమును తన్న వచ్చునని పలికెను. అంతట యామునాచార్యులు పురోహితుని జూచి 1) నిన్ను గన్న తల్లి గొడ్రాలు కాదు; 2) ఈ రాజు ధర్మాత్ముడు; 3) ఈ రాజు భార్య పతివ్రత; ఈ మూడుమాటలకు కాదని సమాధానము జెప్పుమన, పురోహితుడు సిగ్గుపడి నిరుత్తరుడాయెను.

అంతట పండితులెల్లరును నీ మూడు వాక్యములను పురోహితుడే యడిగినచో నీవేమి సమాధానము జెప్పుదువని యామునార్యుల నడుగ నాతడిట్లు సమాధానము జెప్పెను.

1) పండితులనెల్ల నవమానపరచుచు పండితలోకమునకు కంటకుడగుటచేత నీతనిగన్నతల్లి బిడ్డడులేనిదే యగుటచేతను, ఏకపుత్రుని గనుటచే కదళీవంధ్య యగుటచేతను పురోహితుని తల్లి గొడ్రాలనబడును.

2) పండితుల నవమానపరచెడి వీనిని పురోహితునిగా నంగీకరించుటచే నీరాజు ధర్మాత్ముడుగాడు.

3) ఏకాంతముననేని భర్తతో వాదించుటచే నీరాజు భార్య పతివ్రతగాదు.

శ్రీయామునాచార్యులిట్లు యుక్తియుక్తమగు సమాధానముల జెప్పగా పండితులెల్లరును బాగు బాగని మెచ్చుకొనిరి. యామునాచార్యులు ఆక్కియాళ్వాన్‌తో నీవు రాజపురోహితుడవగుటచేతను, వయోవృద్ధుడవగుటచేతను, బ్రాహ్మణుడవగుటచేతను ఓడినవారి తలతన్నవలెననెడి, మన, ముందటి ప్రతిజ్ఞను మానుకొనుచుంటిని, నేటినుండియు పండితులవద్ద శుల్కమును వసూలు శేయుట మానుమని జెప్పి రొప్పించెను. అందులకు రాజును పండితులును యామునాచార్యులను కీర్తించిరి.

అంతట తెరచాటున వాదముల వినుటకై వచ్చి కూర్చున్న రాజు పట్టమహిషి పరుగున వచ్చి యామున బాలుని యెత్తుకొని "ఎన్నై ఆళవన్దారే" (నన్ను రక్షింప వచ్చినవారా!) యనుచు అంతఃపురమునకు తీసికొనిపోయెను. నాటినుండియు యామునాచార్యులకు ఆళవన్దారనెడి ప్రసిద్ధ నామము చేర్పడెను.

రాజును తన మాటచొప్పున అర్ధరాజ్యమును సమర్పింప యామునాచార్యులు రాజ్యపరిపాలన మొనర్చుచు యుక్త వయస్కులై వివాహమాడి వరరంగాచార్యులు, శొట్టనంబి యను నిరువురు పుత్రసంతతిని బడసి సుఖించుచుండిరి.

శ్రీరామమిశ్రులంతట యామునాచార్యుల చరిత్రను విని మిక్కిలి సంతసించి వారిని జూచువేడ్కతో నా రాజ భవనమునకు వెళ్ళి ద్వారపాలకులడ్డగింపగా లోనకేగు నుపాయమాలోచించి వంటవైష్ణవుని జేరి యామునార్యుల కిష్టమగు కూరను దెల్సికొని, ప్రతిదినమును నా యలర్క శాకము (ఉస్తెయాకుకూర) ను దెచ్చియిచ్చుచుండిరి. ఇట్లు ఆరు మాసములు దెచ్చి యిచ్చినను వీరినిగూర్చి యామునా చార్యులు విచారించరైరి. అందులకు శ్రీరామమిశ్రులు మిక్కిలి విచారించి, నాల్గురోజులు కూరను దెచ్చియిచ్చుటను మానుకొని, ఐదవరోజున మరల దెచ్చియిచ్చిరి. అంతట యామునాచార్యులు వంట వైష్ణవుని జూచి, నాల్గురోజులు

కూర లేకపోవుటకు కారణమడుగ నావంట స్వామియు "నయ్యా! ఒక వృద్ధవైష్ణవస్వామి ఆరు మాసముల నుండియు దెచ్చియిచ్చుచు నాలుగురోజులు మానుకొనెను, వారే నేడు మరల దెచ్చియిచ్చిర" ని దెల్ప, ఆళవన్దార్లు విని, "రేపు వారు వచ్చినచో తప్పక నాకు దెల్పు" మని యాజ్ఞాపింప నట్లేయని మరునాడు శ్రీరామమిశ్రులు వచ్చినతోడనే తెలియబఱచెను. ఆళవన్దార్లును శీఘ్రముగ వారినిజేరి నమస్కారపూర్వకముగ నాసనమిడి "మీరింత కాలముగ నాకిష్టమగు నలరకశాకమును దెచ్చి ఇచ్చుచుండుటకు కారణమేమి? మీకేమి కావలయునని యడుగ, శ్రీరామమిశ్రులును "మీపెద్దలు దాచిన నిధియున్నది, అది యున్నచోటు నేనెఱుగుదును, దానిని మీరు తీసికొనువరకు నేను మీవద్దకు వచ్చిపోవుచుండునట్లు ద్వారపాలకుల ఆటంకము లేకుండ చేయవలయునని కోరగా వారట్లేయని యంగీకరించిరి. ఆనాటినుండియు శ్రీరామమిశ్రులు ప్రతి దినమును వచ్చి యామునాచార్యులకు భగవద్గీతయందలి పదునెనిమిది యధ్యాయముల సారమును దెల్పుచుండ రోజు రోజునకును మిక్కిలి ఆర్తులై చరమశ్లోకార్థమును వినినంతనే వరిపైరునకు ధాన్యము పండినకొలదియు తలను వంచునట్లు, సర్వేశ్వరునియందు ప్రీత్యతిశయముచే సంసారమునందరుచి గల్గుటను దెలిసిన శ్రీరామమిశ్రులు జ్ఞానమునకు సంకోచము గల్గించనట్టిదియు, యమవశ్యతను గల్గించనట్టిదియునగు శ్రీ

రంగక్షేత్రమునకు యామునాచార్యులను దోడ్కొనిపోయి శ్రీరంగనాథుని దర్శింపజేసి "ఇదియే మీపెద్దలు దాచి యుంచిన నిధి" యని జూప, సేవించి, వెనుక వ్యర్థముగ జరిగిన కాలమునకు చింతించి, ఆనందబాష్పములు కారుచుండ శ్రీరంగనాథుని యనుభవించి ప్రతికూలమగు సంసారమును త్యజించి ఉత్తమాశ్రమమగు సన్న్యాసమును స్వీకరించి వేరొక విషయము నెరుగక శ్రీరంగనాథునకు సర్వవిధకైంకర్యముల నొనర్చుచు నచ్చటనే వేంచేసియుండి సకల సంప్రదాయ రహస్యార్థములను శ్రీరామమిశ్రులవలన లభించి సిద్ధాన్త ప్రవర్తకులైరి.

ఇట్లున్న కాలమున నొకనాడు శ్రీరామమిశ్రులు యామునాచార్యులను జూచి ఇంకను మరియొక రహస్యము కురుకైకావలప్పన్ యను నాథమునుల శిష్యునికడనున్నది, వానివద్దకేగి ఆ యష్టాంగయోగరహస్యమును బొందవలసినదని దెలుప, నందులకు యామునులు ఆ రహస్యము మీకేల లభింపలేదని యడుగ, మా ఆచార్యులగు పుండరీకాక్షులు, "పీనుగయట్లుండ పెండ్లిసేయగనగునె" యని పొందరైరి, దానిచే మాకును నది లభింపదాయెను, అని దెల్ప నట్లే నారివద్దనే తెల్సుకొనెదమని యంగికరించి ఆళవన్దార్లు శ్రీరంగమున వేంచేసియుండి దర్శనస్థాపన మొనర్చుచుండిరి. శ్రీరామమిశ్రులును తమ అన్తిమదశయందు ఆళవన్దారుల

జూచి నాథమునులతో రెండు సంబంధములుగల మీరు వారి పాదములే ప్రాప్యప్రాపకములని నమ్మియుండి, మీ వలెనే యొక దర్శనప్రవర్తకులనేర్పఱచి శ్రీరంగమును విడువకయుండుడని ఆజ్ఞాపించి, శ్రీపుణ్డరీకాక్షుల పాదపద్మములు దలచుచు పరమపదమునకు వేంచేసిరి. ఆళవన్దార్లును ఆచార్యులకు బ్రహ్మమేధ సంస్కారములనెల్ల నొనర్చిరి.

అనంతరము ఆళవన్దార్లు తమ శిష్యులతో, కురుకావలప్పన్ ఉన్న ప్రదేశమును జేరి, యోగభంగము కాకుండ నిశ్శబ్దముగ నిలిచియుండిరి. గోడ కావలగదిలో సమాధి యోగముననున్న కురుకావలప్పన్ వెనుకకుతిరిగి "ఇచ్చటకు శొట్టకులము వారెవరైన వచ్చిరా" యని యడుగ, అయ్యా యామునదాసుడను శ్రీరామమిశ్రులచే పంపబడి వచ్చితి నని దగ్గరకేగి, "స్వామీ! మీరు గోడకావలను నేను గోడకీవలను నుంటిమిగదా! నేవచ్చినట్లు మీకెట్లు తెలిసిన" దని యడిగిరి. అందులకు అప్పన్, సర్వేశ్వరుడు నాభుజములపైనిల్చి నాముఖమును జూచుచుండ, వాని వక్షస్థలము నందలి లక్ష్మి స్తనములతో పొడిచినను, ప్రక్కకు తిరుగని వాడు, నేడు వెనుకకుతిరిగి మీవైపు జూచుచున్నాడు, అట్లు సర్వేశ్వరుడు జూడగల్గునది నాథమునులయందలి ప్రీతిచే వారి వంశస్థులగు శొట్టకులమునందలి వారివైపే యగుటచే నేనట్లు జెప్పితిననిరి. అంతట యామునాచార్యులు యోగ

రహస్య క్రమము ననుగ్రహింపవలయునని అప్పన్ ను ప్రార్థింప, వారును "నట్లే చేయుదును, రాబోవు పుష్య మాసమున గురుపుష్యయోగమున అభిజిన్ముహూర్తమున నేను శరీరమును విడిచెదను, నాటికి ముందుగ రావలసిన" దని వ్రాసి యీయగా, దానిని గ్రహించి యామునా చార్యులు శిష్యులతోగూడి శ్రీరంగమును జేరిరి.

తరువాత శ్రీరంగమున శ్రీరంగనాథుని సన్నిధిన అధ్యయనోత్సవ సందర్భమున తిరువరఙ్గప్పెరుమాళరైయర్ శ్రీమన్నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళి దివ్యప్రబన్ధము నభి నయించుచు పాడునప్పుడు ఆళవన్దార్ ముఖమును జూచుచు "భక్తులున్నచో తిరువనంతపురము నందలి అనంత పద్మ నాభుని సేవించుడు" అనెడి వాక్యమును అనేకమారులు పాడగా, వినిన ఆళవన్దారులు "మేమును నమ్మాళ్వార్ల భక్తకోటిలో జేరవలెనన్న తిరువనంతపురమును సేవించవలె నని తలచి, సభనుంచి లేచి శ్రీరంగనాథునకు విన్నవించి అంగీకారమునొంది, మఠమునకు కావలిగ తెయ్‌వవారి యాజ్ఞాను నియమించి, తిరువనంతపురమున కేగి అనంత పద్మనాభుని మూడువాకిళ్ళన సేవించి యచ్చట కొన్నినాళ్ళు వున్న వెనుక సన్నిధిస్వాములనుజూచి కురుకైకావలప్పన్ వ్రాసియిచ్చిన చీటీని తెమ్మని, పరికించ, ముహూర్తదినమూ నాడే యగుటచే, "ఒక పుష్పక విమానము లభించక

పోతిమే'' యని మిక్కిలి దుఃఖించిరి. నాటినుండియు సంప్ర దాయమున అష్టాంగయోగము మృగ్యమైనది. యామునులు తిరిగి శ్రీరంగమునకు వేంచేయుచుండిరి.

## తెయ్వవారియాణ్డాన్

శ్రీరంగమున మఠాధిపత్యమును వహించియున్న తెయ్వవారిఆణ్డానునకు, ఆచార్యుని యెడబాపును సహింప లేక పోవుటచే, నిద్రాహారములులేక శరీరమెల్ల శుష్కించు టచే, దగ్గరనున్న స్వాములు వీరిని వైద్యులచే పరీక్షింప జేయ, వారును ''వీరికి దేనియందో కోర్కెగలదు, అది తీరకపోవుటచే నిట్లగుచుండిరింతియేగాని శరీరమున నెట్టి రుగ్మతయు లేద''ని తెల్పిరి. అంతట దగ్గరనున్న స్వాములు ''మీకేవిషయమైన కోర్కెగలద'' ని యడుగ తెయ్వ వారిఆణ్డానును 'దాసునకు ఆచార్యవిషయమునదప్ప వేరొక విషయమున్నదా ?' యని దెల్పగా, అయినచో వీరిని ఆళ వన్దార్లసన్నిధికే తీసికొనిపోదమని స్వాములును వారినొక తొట్టిలో గూర్చుండబెట్టి మోసుకొనిపోవుచుండ ఆణ్డానును ఆచార్యసన్నిధికి వెళ్ళుచుంటిమిగదా యనెడి యుత్సాహ ముతో లేచి మెల్లమెల్లగ నడవసాగిరి. యామునార్యులును తమ శిష్యులతోగూడి తిరుగుప్రయాణమున తిరువనంతపుర మును దాటి మూడుకోసులదూరము వచ్చుసరికి తెయ్వ వారిఆణ్డానును తనతోటి స్వాములతో ఆళవన్దారుల నెదు

రొక్కని సాగిలబడి మ్రొక్కి శక్తి లేకపోవుటచే లేవక పరుండి యుండిరి. అంతట యామునులును ఆండాన్నుజూచి 'రామ చంద్రుడు స్వతంత్రుడు వీరుడును నగుటచేత భరతుడు చెప్పినచోటనే యుండెను, నేను అస్వతంత్రుడను పరాక్రమము లేనివాడనగుటచే మీరుంచిన చోటనుండక వచ్చివేసి తిరి' అని చిరుకోపముతో పలికిరి. అంత తెయ్వవారి ఆండాను 'అయ్యో! స్వరూపహాని కల్గినదే' యని యెంత గనో నొచ్చుకొని పాదములనుండి లేవక యట్లే పరుండిరి. అందులకు దగ్గరగల స్వాములు, ఆచార్యుని యెడబాపుచే వీరిట్లగుటచే తీసికొనివచ్చితిమని విన్నపింప, యామున మునులును సంతసించి ఆణ్డానును లేవనెత్తి ఆలింగనమొనర్చి వీపును ద్రువ్వుచు, దగ్గర నేగల తిరువనంతపురమును సేవించి రమ్మన, ఆణ్డానును 'నన్నెదురొక్కన్నదే నా యనంతపుర' మని దెల్ప, ఏ ఆచార్యునిచే న్యాసవిద్య తెలుపబడినదో వారే వైకుంఠము, క్షీరాబ్ధి, ద్వారక మొదలగు 108 దివ్య దేశములును ననెడి నిష్ఠకు సంతసించి వారితోగూడి శ్రీరంగ మును జేరి శ్రీరంగనాథుని సేవించి తమ మఠమున ననేక రహస్యార్థముల నాశ్రితులకు దెల్పుచు వేంచేసియుండిరి.

## శ్రీపరాంకుశదాసులు (పెరియనంబి)

ఆ కాలమున శ్రీరంగమున శ్రీబృహచ్చరణ వంశమున భారద్వాజ గోత్రమున యజుశ్శాఖయందు కుముదాంశచే

ధనుర్మాసమున జ్యేష్ఠానక్షత్రమున పెరియనంబిగారవతరించి సకల వేదవేదాంగ, శాస్త్రవిశారదులై యామునాచార్యుల నాశ్రయించిరి. వారును దయతో పెరియనంబిగారికి పరాంకుశదాసులను తిరునామమునుంచి ఆదరించిరి. వీరికి పుండరీకాక్షులనెడి కుమారులును, అత్తుళాయమ్మ యను కుమార్తెయును గలరు. వీరికి మహాపూర్ణులనియు పేరు గలదు.

## పెరియతిరుమలనంబి (శ్రీశైలపూర్ణుల) యవతారము.

సువర్ణనదీ తటమున వేంకటగిరిపై నుత్తరదిక్కున సుముఖుడను గణాధ్యక్షుని యంశచే శ్రీశైలపూర్ణులనెడి శ్రీవైష్ణవోత్తములు వేంకటేశుని వరదానముచే చైత్రమాసమున స్వాతీ నక్షత్రమున నవతరించి శ్రీవేంకటేశుని యందు కైంకర్యనిరతులై యుండిరి. వీరును యామునుల నాశ్రయించిరి. వీరికి యిద్దరు కుమారులును యిద్దరు కుమార్తెలును ఇరువురు తోబుట్టువులును గలరు. వీరు నిత్యమును వేంకటేశునకు స్నానము జేయించుటకై పూర్ణకుంభజలమును రెండుక్రోసులదూరమునగల పాపవినాశనమను తీర్థమునుండి దెచ్చుచుండెడివారు. ఇట్లు బహుప్రయాసతో తీర్థమును దెచ్చెడి వీరియందు వేంకటేశ్వరుడు దయగలవాడై వయోవృద్ధులగు వీరికి యుపకారమొనర్పదలచి రాజకుమారుడై వేటాడి యలసిన చిఱుచెమటగల మోముతో నొక వృక్షచ్ఛాయన నిల్చియుండెను. తిరుమలనంబిగారును పూర్ణ

కుంభమును క్రమతో మోయుచు మంత్రరత్నానుసంధాన మొనర్చుచు వచ్చుచుండ, నీ మాయవేటగాడు "తాతా దప్పికగొనియుంటిని, మంచినీరు పోయు" మని యడుగ వారును వేంకటేశ్వరుని తిరుమంజన తీర్థముగాన నీయరాదని వెళ్ళుచుండ, వేటగాడును వారివెనుకనే చప్పుడుచేయక కుండకు బాణముతో తెలియరానట్లు నేర్పరియై రంధ్ర మొనర్చి నీటిని దోసిలితో త్రావుచు నడచుచుండెను. పోయినకొలది ఘటము తేలికయగుటచే నంబిగారు వెనుదిరిగి చూచి వేటగానితో, భగవానుని యెడ నపచారమిట్లేల పడితివని యడుగ, దప్పికయై త్రాగితిని, యిప్పుడేమి కొఱత? యిచ్చటనే శుద్ధోదకమును జూపుదు" నని జెప్పి, యొక బాణమును సంధించి యచ్చటి కొండచరియపై ప్రయోగింప, నచ్చటనుండి గంగాప్రవాహమును బోలిన నొకగొప్ప ధార బయల్పడి ప్రవహింప దొడంగెను. అంత నా మాయవేట గాడు తాతా! నేటినుండియు నీ ఆకాశగంగనుండి తీర్థము దెచ్చి నాకు సమర్పింపు" మని యదృశ్యమాయెను. నాటి నుండియు నేటివరకును తిరుమలనంబిగారి వంశస్థులెల్లరును ఆకాశగంగనుండి తెచ్చిన తీర్థమును శ్రీవేంకటేశుని కైంకర్య మునకై వినియోగించుచుందురని ప్రసిద్ధి.

శ్రీవేంకటేశుడు తిరుమలనంబిగారిని తాతాయని బిలుచు టచే బ్రహ్మకు తండ్రియగు నారాయణుడు లోకులకు తాత

యగుటచే, నాతడు తాతాయని పిలిచిన కారణమున పెరియ తిరుమలనంబిగారికి నాటినుండియు పితామహ పితామహులని (తాతగారికి తాతగారని) ప్రసిద్ధి యేర్పడెను. వీరును యామునాచార్యుల నాశ్రయించి సకల వేదాన్త సారముల నెఱిగిరి.

## గోష్ఠిపూర్ణులు (తిరుక్కోట్టియూరినంబి)

పాండ్య మండలమున గోష్ఠీపురము (తిరుక్కోట్టియూరు) గలదు. అందు సౌమ్యనారాయణులను భగవానుడు శుద్ధసరోవరతీరమున నద్భుత పుణ్యవిమానమున లక్ష్మీ సహితుడై విలసిల్లుచుండెను.

అచ్చట వైశాఖమాసమున రోహిణియందు పుండరీకాంశచే తిరుక్కోట్టియూరినంబి యవతరించిరి. వీరును యామునాచార్యుల నాశ్రయించి వేదవేదాంతసారముల నెఱిగిరి.

## తిరుమాలైయాణ్డాన్

పాండ్యదేశమున శ్రీమధురాపట్టణము గలదు. దాని సమీపమున వృషభాద్రియను తిరుమాలిరుంశోలై దివ్య దేశముగలదు. అచ్చట సుందరబాహుస్వామియను శ్రియఃపతి వేంచేసియుండెను. అందు వామనాంశమున కుంభ మాసము మఖానక్షత్రమున శ్రీమాలాధరులను తిరుమాలై

యాండాన్ అవతరించిరి. వీరు సుందర బాహు స్వామికి నిత్యకైంకర్య మొనర్చుచు యామునాచార్యుల వైభవము విని శ్రీరంగము జేరి వారి నాశ్రయించిరి.

## మారనేర్నంబి

పాండ్య దేశమున మారనేరను పట్టణము గలదు. అందు చతుర్థ వర్ణమున కర్కాటమాసమున ఆశ్లేషానక్షత్రమున మారనేర్ నంబియను వైష్ణవోత్తము లవతరించిరి. వీరును యామునుల వైభవమును విని శ్రీరంగము జేరి వారి నాశ్రయించి మిక్కిలి జాగరూకతతో ఆచార్యకైంకర్యము నొనర్చుచుండిరి.

## తిరుక్కచ్చినంబి (గజేంద్రదాసులు)

తొండీరమండలమున తూర్పుసముద్రమునకు పశ్చిమ దిక్కున నొక యామడ దూరమున తిరుమళ్ళిశై పట్టణము గలదు. అచ్చటనే భక్తిసారు లవతరించిరి. దానికి పశ్చిమమున క్రోశమాత్రదూరమున పూనమల్లియను పట్టణము గలదు. అచ్చట మల్లెతీగలు ఎల్లప్పుడును పుష్పించుచుండుటచే దానికా పేరు గల్గెను.

ఆపట్టణమున మాఘమాసమున మృగశిర నక్షత్రమున వైశ్యకులమున కమలాపతి యనువారికి కుమారులుగ కాంచీ

పూర్ణులు (తిరుకచ్చినంబి) అవతరించిరి. వారు కంచి యందలి వరదరాజులయందాసక్తిచే నొకపూదోట నేర్పఱచి పుష్పమాలికలుగట్టి ప్రతి ఉదయము పూనమల్లినుండి బయ ల్దేరి మధ్యాహ్నమునకు కంచికి జేరి మాలలు వరదరాజులకు సమర్పించి, తిరిగివచ్చుచు నార్త్రియందు శ్రీపెరుంబూ దూరులోని కేశవార్యుని యింటియందుపరుండి మరు ఉదయ మునసే లేచి పూనమల్లికి జేరుచుండెడివారు. భక్తవత్సలు డగు వరదరాజస్వామి వీరి కైంకర్యమునకు ప్రీతుడై "మీ రిచ్చటనేయుండి వట్టివేళ్ళ విసనకఱ్ఱచే విసరుటయను (ఆలవట్ట) కైంకర్యము జేయుచుండు"డని యాజ్ఞాపింప నట్లేయొనర్చు చుండిరి. వీరును శ్రీరంగమునకేగి ఆళవన్దారుల నాశ్రయించి రహస్యార్థములనెల్ల బడసి తిరిగి కంచికి వచ్చి వరదరాజుల నిత్యకైంకర్య మొనర్చుచుండిరి.

## చోళరాజు సకుటుంబముగ యామునుల నాశ్రయించుట.

యామునాచార్యులకు అర్థరాజ్యమిచ్చిన చోళరాజు యామునుల వైభవముచు విని భార్యతోను పురోహితుని తోను శ్రీరంగమును జేరి వారిచే పంచసంస్కారపరుడై యామునులకిచ్చిన అర్ధరాజ్యము దీసికొమ్మని వేడగా, వారు దానిని శ్రీరంగనాథుని కైంకర్యమునకై వినియోగించిరి.

ఇంకను వీరి వైభవమును విన్న జనులనేకులు వీరిని ఆశ్రయించిరి.

వీరి శిష్యులలో 1) పెరియనంబి 2) తిరుక్కోట్టియూరి నంబి 3) పెరియతిరుమలనంబి 4) మారనేర్నంబి 5) తిరుక్కచ్చినంబి 6) ఆళవన్దారాళ్వాన్ 7) తిరుమాలైయాణ్డాన్ 8) వానమామలయాండాన్ 9) తైవవారియాణ్డాన్ 10) ఈశనాణ్డాన్ 11) జీయరాణ్డాన్ 12) తిరుక్కురుకూరప్పన్ 13) తిరుమోకూరప్పన్ 14) తిరుమోకూర్నిన్రాన్ 15) తైవప్పెరుమాళ్ 16) వకుళాభరణ సోమయాజియార్ 17) ఆట్కొండి యమ్మంగి 18) తిరుక్కురుకూర్దాసర్ 19) తిరుమాలిరుంశోలై దాసర్ 20) వడమదురై పిరందాన్ మొదలగువారు ప్రసిద్ధులైరి.

ఇట్లు తమ నాశ్రయించిన శిష్యులెల్లరికిని, నొకమారు తిరువాయ్మొళి దివ్యప్రబన్ధమును కాలక్షేపమొనర్చుచు అందుజెప్పబడిన 5వ శతకమున రెండవ దశకమగు "పొలిక పొలిక" యను తిరువాయ్మొళి ననుగ్రహించుచు నందు జెప్పబడిన రీతిని లోకమెల్ల శ్రీవైష్ణవ సమృద్ధి నొనర్పగల అత్యంత సమర్థులొక రవతరించుటను దలచి, హారీతస్మృతి యందును, యాదవాచలమహాత్మ్యమునందును కలిలో శారీరకమహాభాష్య రచయితయగు జితేంద్రియు లవతరింతురని

చదివి అట్టివారిని గూర్చి విచారించగా కాంచీపురమున యాదవప్రకాశులనెడి అద్వైత వేదాన్తికడ శ్రీవిశిష్టాద్వైత సిద్ధాన్తమునకు పూర్వపక్షముగ అద్వైతవేదాన్తమును జదువుచున్న లక్ష్మణార్యుల విశేషము దెలియవచ్చి వారిని జూచువేడ్కతో కంచికేతెంచి వరదరాజులకు మంగళాశాసనమొనర్చి దూరమునుండి యాదవప్రకాశుని శిష్యసమూహములోనున్న లక్ష్మణార్యులనుజూచి తమ తిరువారాధనలోగలట్టియు నాథమునులకు నమ్మాళ్వార్లనుగ్రహించినట్టియు భవిష్యదాచార్య విగ్రహమును బోలినవారు వీరే యని నిశ్చయించి వీరినెట్లైన తమవద్దకు తెప్పించుకొను నభిప్రాయము ప్రస్తుతమునకు వీలుబడకపోవుటచే తిరిగి శిష్యసమేతముగ శ్రీరంగము జేరిరి.

అట్లుండ కొన్నినాళ్ళకు శ్రీయామునులకు రాచపుండు గలిగెను. దానివలన గలిగినబాధను ప్రారబ్ధానుభవము గతించుచుండెననెడి ఆనందముతో ననుభవించుచుండగా, ఆచార్యుల బాధను సహించలేని మారనేరినంబి యారాచపుండును తమకిమ్మని నిర్బంధించి ప్రార్థించి లభించిరి.

యామునాచార్యులు లోకసంరక్షణకై స్తోత్రరత్నము, చతుశ్శ్లోకి, ఆగమ ప్రామాణ్యము, చిదచిదీశ్వర ప్రతిపాదకమగు సిద్ధిత్రయము, గీతార్థసంగ్రహమను నైదుగ్రంథముల రచించి సిద్ధాన్తప్రవర్తనమొనర్చుచు 125 సం॥ నిండినవారైరి.

అంత నొకనాడు శ్రీరంగనాథుడు అర్చకముఖముగ నావే శించి "యామునార్యా! నేడే మీకు పరమపదమిచ్చు చుంటిని వేంచేయు" డన, యామునులును స్వామీ! కంచి యందున్న లక్ష్మణార్యులను జూచువేడ్క కలదు, వారిని దోడ్కొనివచ్చుటకై పెరియనంబిని బంపితిని, వారువచ్చు దనుక వేచియుండి నేటికి యెనిమిదవరోజున పరమపదము నకు వత్తునని బల్కి, లక్ష్మణార్యులరాకకై యెదురుజూచు చునుండిరి.

సర్వజ్ఞుడగు శ్రీరంగనాథుడును యామున లక్ష్మణార్యు లిద్దరు నొకచోట జేరినచో తన లీలావిభూతి చెడునని తలచి లక్ష్మణార్యుల రాకను కొలది ఆలస్యమగునట్లొనర్చిరి.

యామునార్యులును తాము శ్రీరంగనాథునకు వాగ్దాన మొనర్చిన 8వ రోజు వచ్చుటచే లక్ష్మణార్యులు రాకుండుటను దలచి, వారిచే తాము చేయించదలచిన మూడు కార్యము లును తెలియబఱచుటకై మూడు చేతివ్రేళ్ళను ముడుచు కొని తమ ఆచార్యులగు శ్రీరామమిశ్రుల పాదపద్మముల దలచుచు నాచార్యసన్నిధిని జేరిరి.

## యామునాచార్యుల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ శుచౌమాస్యుత్తరాషాఢా, జాతం యామునదేశికం,
శ్రీరామమిశ్ర పాదాబ్జ, చఞ్చరీక మహం భజే.

నిత్య:- యత్పాదామ్భోరుహధ్యాన, విధ్వస్తాశేషకల్మషః,
వస్తుతాముపయాతోఽహం, యామునేయం నమామితం.

## వాళ్తి తిరునామములు

మచ్చణియుం మదిళరజ్గమ్ వాళ్విత్తాన్ వాళ్తియే ।
మత్తైనాన్గుమ్ ఓరురువిల్ మకిళ్న్దు కత్తాన్ వాళ్తియే।
పచ్చైయిట్ట రామర్ పదం పగరుమవన్ వాళ్తియే ।
పాడియత్తోనీడేఱ పప్పార్వై శెయ్దోన్ వాళ్తియే।
కచ్చినగర్ మాయనిరుకళ్ఱిల్ పణిన్దోన్ వాళ్తియే ।
కడగ వృత్తి రాడత్తు క్కాలుదిత్తాన్ వాళ్తియే ।
అచ్చమఱమనమగిళ్చ్చి అణైన్దిట్టాన్ వాళ్తియే ।
ఆళవన్దార్ తాళిణైకళ్ అనవరదమ్ వాళ్తియే ॥

## శ్రీపరాంకుశదాసుల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ ధనుశ్శ్రేష్ఠా సముద్భూతం। యామునాఙ్ఘ్రి సమాశ్రితమ్।
మహాపూర్ణం యతీన్ద్రాయ। మన్త్రరత్నప్రదంభజే ॥

నిత్య॥ కమలాపతికల్యాణ గుణామృత నిషేవయా।
పూర్ణకామా య సతతం పూర్ణాయ మహతే నమః॥

## వాళ్తి తిరునామములు

అమ్బువియిల్ పదిన్మర్ కలై ఆయ్న్దురైప్పోన్ వాళ్తియే ।
ఆళవన్దార్ తాళిణైయై అడైన్దుయ్న్దోన్ వాళ్తియే ।
ఉమ్బర్తొళుం అరఙ్గేశర్కు ఉకప్పుడైయోన్ వాళ్తియే ।
దనుకేట్టైదనిల్ ఉదిత్తపిరాన్ వాళ్తియే ।

వమ్బవిర్ తార్ వరదరురై వాళ్ది శెయ్తాన్ వాళ్దియే ।
మాఱనేర్ నమ్బిక్కు వాళ్వళిత్తాన్ వాళ్దియే ।
ఎమ్బెరుమానార్ మునివర్కు ఇదమురైత్తాన్ వాళ్దియే ।
ఎళ్దిల్ పెరియనమ్బి శరణినిదూళ్ది వాళ్దియే ॥

* * * * *

## తిరుక్కణ్ణమఙ్గైయాణ్డాన్

తిరుక్కణ్ణమంగై (శ్రీకృష్ణమంగళ) క్షేత్రమున నొక బ్రాహ్మణ గృహమున జ్యేష్ఠమాసమున కృష్ణపక్షమున శ్రవణనక్షత్రమున నిత్యసూరియంశమున తిరుక్కణ్ణమంగై ఆణ్డాన్ అనువారవతరించి తండ్రిగారిచే సకలవిధ సంస్కారములనంది సర్వశాస్త్రవిశారదులై శ్రీనాథమునులనాశ్రయించి స్వరూపజ్ఞులై ప్రసిద్ధికెక్కిరి. వీరు జ్ఞాన, భక్తి, వైరాగ్యములు గలవారై ఆచార్యాజ్ఞచే తిరుక్కణ్ణమంగై జేరి యచ్చటి యభిషేకవల్లీసహితుడగు భక్తవత్సలునకు మాలాకైంకర్య మొనర్చుచునుండిరి.

ఒకప్పుడు శూద్రులిద్దరు రెండు కుక్కలను వెంటనిడుకొని దారినపోవుచుండిరి. జాతిస్వభావముచే నొకుక్క లొకదానితోనొకటి కలియబడి కఱచుకొని చనిపోయెను. ఇట్లు చనిపోయిన తమ కుక్కలయందలి ప్రీతిచే వానియజమానులొకరితోనొకరు కలహించుకొని పొడుచుకు చనిపోయిరి.

అదే సమయమునకు ఆలయమున కేగుచున్న తిరుక్కణ్ణమంగై ఆణ్డాన్ "తమను నమ్మిన నీచజాతి కుక్కలకై వాని యజమానులొకరితో నొకరు కలహించి చనిపోయిరే, తనను నమ్మిన యీ యమూల్యమగు నాత్మవస్తువును రక్షించుకొనుటకై సర్వేశ్వరుడు వీరిమాత్రము బాధ్యత వహింపడా?" యని నిశ్చయించి తమ సర్వభరణమును సర్వేశ్వరునిపై నుంచి ఆలయపు ద్వారము ప్రక్కగనున్న నొక గూటియందు ముసుగిడి పరుండగా భక్తవత్సలుడు వీరిని మూడవనాటి వేకువన శ్రీవైకుంఠమునకు వేంచేయుడని ప్రార్థింప, వీరును తమ ఆచార్యులగు శ్రీనాధమునుల శ్రీపాదముల ధ్యానించుచు శరీరమును వీడి యాచార్యసన్నిధానమును జేరిరి.

* * * * *

## శ్రీరామానుజాచార్యులు

శ్రీవేంకటేశుని నిత్యకైంకర్యమున నున్న పెరియ తిరుమల నంబిగారికి యిరువురు తోబుట్టువులు గలరు. వారిరువురును శ్రీదేవి భూదేవి యంశముల నవతరించి కాంతిమతి ద్యుతిమతి యను పేరుల పిలువబడిరి.

అందు శ్రీదేవి యంశయగు కాంతిమతి, హారీత వంశమున నారాయణాంశచే నవతరించిన భూతపురి (శ్రీపెరుంబూదూరు) నివాసులగు ఆసూరి కేశవాచార్యులను వివాహ

మాజెను. భూదేవియంశయగు ద్యుతిమతి, నారాయణాంశ మున భరద్వాజవంశజులగు కమలనయనభట్టులను వివాహ మాడి, భూతపురి సమీపగ్రామమగు మలలమంగల గ్రామమును జేరెను.

## లక్ష్మణాచార్యుల జననము

ఈకలియందు శాలివాహనశకమున 938వ పింగళనామ సం॥ చైత్రశుద్ధ పంచమీ గురువారము కటకలగ్నమున ఆర్ద్రానక్షత్రమున ఆసూరి కేశవాచార్య కాంతిమతీదేవుల గర్భమున శ్రీపెరుంబూదూరున శేషాంశచే నొక కుమా రులు గల్గిరి. ఇది యెఱిగి తిరుమలనుంచి పెరియతిరుమల నంబి గారేతెంచి మేనల్లునకు జాతకర్మాదుల నొనర్చి జేసి సర్వలక్షణసంపన్నుడగు బిడ్డని జూచి లక్ష్మణాచార్యులని నామకరణమొనర్చిరి. లక్ష్మణాచార్యులును అన్నప్రాశన చౌళోపనయనాదులెల్ల నాయాకాలముల శాస్త్రోక్తముగ తండ్రిచే లభించి వేదవేదాఙ్గములనెల్ల నధికరించి చతుర్దశ విద్యాపారఙ్గతులై పదహారవసంవత్సరమున వివాహితులైరి.

## వివాహానంతరము యాదవునివద్ద వేదాన్తాధ్యయనము

ఆకాలమున కాంచీనగరమున యాదవప్రకాశుడనెడి ఏకదండియగు అద్వైతవేదాన్తి యొకడుండెను. లక్ష్మణాచార్య

లాతనికడ పూర్వపక్షముగా నద్వైతవేదాన్తమును జదువు చుండిరి.

మలల మంగల గ్రామమున కమలనయనభట్టునకు ధర్మపత్నియగు పెరియపిరాట్టియందు క్రోధనసంవత్సరమున పుష్యమాసమున పూర్ణిమతిథియందు సోమవారమున పునర్వసూనక్షత్రమున పుత్రులుదయించిరి. తిరుమలనంబియు నటకేతెంచి యాబిడ్డనికి గోవిన్దమిశ్రుడని పేరిడి వెడలిరి. గోవిందమిశ్రులును చౌళోపనయనాది సంస్కారయుక్తులై సకలశాస్త్రముల నధికరించి, గృహస్థాశ్రమము స్వీకరించి, కాంచీనగరమున యాదవప్రకాశునికడ లక్ష్మణార్యులు అద్వైతవేదాన్తము నధ్యయనమొనర్చుచుండెరని విని తామును నచ్చటకేగి వేదాన్తమును జదువుచుండిరి.

## యాదవుని కాశీయాత్రా వ్యాజము

యాదవప్రకాశుడును, "సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" యనెడి శ్రుతివాక్యమునకు సత్యమనగా, అసత్యముకన్న భిన్నమైనదనియు, జ్ఞానమనగా, జడభిన్నమైనదనియు, అనన్తమనగా, పరిచ్ఛిన్నభిన్నమైనదనియు జెప్పగా, లక్ష్మణార్యులును సత్యమనగా, వికారశూన్యమనియు; జ్ఞానమనగా, స్వయం ప్రకాశమనియు; అనన్తమనగా, అపరిచ్ఛిన్నమనియు; చేతనాచేతన విలక్షణమై నిత్యమైయుండు బ్రహ్మమున

కర్థము జెప్పిరి. మరియొకనాడు, లక్ష్మణార్యులు యాదవ ప్రకాశునకు తలంటిపోయునప్పుడు, 'తస్యయథా కప్యాసం పుణ్డరీకమేవమక్షిణీ' (ఛా.ఉ.1-6-7) అనెడి శ్రుతివాక్యమునకు కప్యాసమనగా వానరపృష్ఠమని యాదవులు అర్థము జెప్పగా, విని లక్ష్మణార్యులు కనులవెంట నీరుజెట్టుకొనగా జూచి యాదవుడిదియేమియనగా, కప్యాసపదమునకు కపి యనగా సూర్యుడనియు ఆసమనగా ఆశ్రయణమని యర్థము జెప్పి సూర్యునిచే వికసింపజేయబడిన లోతైన నీటిలో దృఢమగు నాళముపైగల పద్మమువంటి నేత్రములు గలవాడు భగవానుడని యర్థము జెప్పిరి. యాదవప్రకాశుడును తనకన్న విశేషార్థములను జెప్పెడు లక్ష్మణార్యునియందు మాత్సర్యముగలవాడై కాశీయాత్ర నెపమున గంగలో ముంచి వేయించ నెంచి శిష్యసమేతముగ బయల్దేరి, వింధ్యాటవిన నడచుచుండగా సూర్యాస్తమయ సమయమగుటచే సమీపపుజలప్రదేశమున లక్ష్మణార్యులును గోవిందమిశ్రులును సంధ్యావందనార్థ మొనర్చుకొనిరి. ఆ సమయమున గోవిందమిశ్రులు లక్ష్మణులతో కాశీయాత్రలోని యాదవుల దురభిప్రాయమును తాముగుర్తించిన విషయము దెల్పి తిరిగి కంచి కేగవలసినదిగా ప్రార్థించ లక్ష్మణులును సమ్మతించి యటనే యుండిపోయిరి. తరువాత గోవిందులు యాదవునితోను మిగిలిన శిష్యపరివారముతోను గూడి చీకటిన నొకచోపరుండి వేకువనలేచి వెడలిపోయిరి.

## పెరుందేవీ వరదులు లక్ష్మణులను కంచికి దోడ్తెచ్చుట

లక్ష్మణార్యులును తెల్లవారినతరి లేచి తిరుగుదారి యెరుగక తడబడుచుండ, కోయదంపతులిరువురే తెంచి తాము కంచికేగుచున్నట్లు జెప్పి తమతోగూడ లక్ష్మణార్యుల నతిదగ్గర దారిన సంధ్యాసమయమునకు ఊరివెలుపలకు తీసికొనివెడలిరి. అంత నాకోయదంపతులు 'దాహమగుచున్నది మంచినీరు సమీపమునగల శాలక్కిణరను దిగుడుబావినుంచి తెమ్మ'నికోరగా లక్ష్మణులును వెడలి తామరాకును దొప్పగా జేసి నీరు తెచ్చుసరికి కోయదంపతులు కన్పించరైరి. అంతట లక్ష్మణులు సమీపవర్తులను విచారించి కాంచీవరము జేరి, తనను దాహమడిగిన కోయదంపతులుగా గన్పించినది పెరుందేవీసహిత వరదరాజస్వామిగా గుర్తించి నాటినుండియు శాలక్కిణరునుండి తీర్థమును దెచ్చి వరదరాజుల కర్పించుచుండిరి.

## గోవిందుడు శైవుడగుట

యాదవుడును శిష్యసమూహములో లక్ష్మణులు గన్పించకపోవుటచే రాత్రికాలమున వింధ్యాటవిలో నేమృగమో తినివేసియుండునని తలచి నిర్భయుడై కాశికిజేరి గంగాస్నానమొనర్చుచుండ గోవిందభట్టు చేతికొక శివలింగము తగిలెను. దానినాతడు యాదవునకు జూప, నాతడును మిక్కిలి

ప్రీతుడై 'ఉళ్ళుం గైకొణర్న్దనాయనార్' అని పేరిడి శివాను గ్రహము నీయందు గల్గెను గాన నీవిగ్రహమును మీగ్రామ మున ప్రతిష్ఠించి పూజింపుమని జెప్ప నాతడట్లే మలల మంగల గ్రామము జేరి లింగప్రతిష్ఠయొనర్చి పూజించు చుండెను. ఆ కాలమున కాళహస్తీశ్వరు డీతని శ్రద్ధకు సంత సించి ఆలయాధికారుల నాదేశించి నాయనారులను కాళ హస్తికి రప్పించి తన సేవలో నియమించుకొనెను.

యాదవప్రకాశుడును కాశీయాత్రనుంచి కంచికేతెంచి లక్ష్మణార్యులనుజూచి యాశ్చర్యపడి చేయునదిలేక లోక నిందకువెరచి తిరిగి తనశిష్యులతో జేర్చుకొనెను.

ఒకనాడు శ్రీరంగమునుండి యిరువురు శ్రీవైష్ణవులు కంచికేతెంచి వరదరాజుల సేవించి తిరిగి శ్రీరంగమున కేగ వారలనుజూచి ఆళవన్దార్లు కంచిలోని విశేషములేమియని యడుగ, వారును యాదవప్రకాశునియొద్ద లక్ష్మణార్యులు వేదాన్తము జదువుటయును శృతివాక్యముల కాతడు దెల్పు అనుచితార్థములకు విశేషార్థముల దెల్పుటయును జెప్పగా యామునులు విని లక్ష్మణార్యులను జూచువేడ్కతో శిష్య సమేతముగ కంచికేతెంచి వరదరాజుల సేవించి. యాదవుని శిష్యులనడుమన విశాలనేత్రములతోను దీర్ఘబాహువుల తోను నొప్పు లక్ష్మణార్యులగాంచి వీరే భవిష్యదాచార్యులని యెంచి వీరినెల్లైన దర్శనస్థాపకుల నొనర్పుమని వరదరాజుల

ప్రార్థించి, యప్పటికి వారితో మాట్లాడుటకు వీలుకుదరక శిష్యులతోగూడి శ్రీరంగము తిరిగి వెడలిరి.

## బ్రహ్మరాక్షస విమోచనము

యాదవప్రకాశులును తన శిష్యులతోగూడియున్న కాలమున నాదేశపు రాజపుత్రికను బ్రహ్మరాక్షసి యావహింప, నారాజును మంత్రవేత్తలనెల్ల రావించి యత్నించినను ఫలితము లేకపోగా, యాదవప్రకాశుడను దొడ్డమంత్రవాది కలడని విని వానికై భటులను బంపెను. రాచభటులును యాదవుని జేరి రాచకుమార్తెను బ్రహ్మరాక్షసినుండి విడిపించగలందులకై రాజాజ్ఞను దెల్పగా; నాతడును 'నేనువిడిచి పొమ్మంటినని బ్రహ్మరాక్షసికి దెల్పుడని భటులకు జెప్ప వారును నట్లేయొనర్ప, జుట్టువిరబోసుకొని యొకకాలుజాచుకొని కూర్చున్న రాకుమార్తెను బట్టిన బ్రహ్మరాక్షసి యామాటవిని నిర్లక్ష్యముతో యాదవునే యూరువదలి నే పొమ్మంటినని దెల్పుడనెను. అంత నారాజభటులీ విషయమును యాదవునికి దెల్పగా, నాతడు కోపముతో పండ్లు పటపట గొరుకుచు శిష్యులతోగూడి మంత్రోచ్చారణ మొనర్చుచు హుంకరించుచు బ్రహ్మరాక్షసి యున్నకడకేతెంచెను. అదియును రెండవకాలునుగూడ జాచుకొని 'ఓరీ! యాదవప్రకాశా! నీవు జపించెడి మంత్రము నేనెఱుగనా?'

యని యీ మంత్రమును జెప్పి, 'నీవు నీ వెనుకటి జన్మనే యెఱుగవు!, నేను నీ జన్మను నా జన్మనున్ను ఎఱుగుదును, నీవా నన్ను పారద్రోలునది?' యనెను. అంతట యాదవు డును బ్రహ్మరక్షస్సుతో 'అయినచో నా వెనుకజన్మను దెల్పు'మనియడుగ, నది యిట్లు జెప్పదొడంగెను. ''నీవు వెనుకటి జన్మమున మధురాన్తకపు చెరువుగట్టునగల పుట్టలో నుడుమువై యుంటివి. శ్రీరంగమునుండి తిరుమలకు బోయెడి శ్రీవైష్ణవస్వాములు కొందరు, చెరువులో స్నాన మొనర్చి భగవదారాధన మొనర్చి ప్రసాదము స్వీకరించి యాకులపారవైచి కాలుసేతులు గడుగుకొని వెడలిరి. అంత దనుక పుట్టలోనున్న నీవు ఆహారమునకై బయటికిపోవుటకు వీలులేక వారిని వారియనుష్ఠానమును జూచుచునుండి వారు వెడలగనే యాకలిచే వారు తిని పారవైచిన యాకులలోని యెంగిలిమెతుకులను నాకి, వారు కాళ్ళుగడుగుకొనిన నీరచ్చటి గుంటలలో నిలువ నది త్రాగితివి, శ్రీవైష్ణవోత్త ముల యెంగిలి తిని పాదతీర్థమును ద్రావితివిగాన నా యుడుము జన్మముపోయి బ్రాహ్మణోత్తముడవై, యందును వేదవేదాన్తాధ్యయనపరుడవై, యందును మంత్రవేత్తవై యనేకులగు శిష్యులకు గురువువైతివి; ఇక నా వెనుకటి జన్మ మును జెప్పెద వినుము, బ్రాహ్మణుడనైయుండి యజ్ఞ మొనర్చి యందలి యజ్ఞాత మంత్రలోప క్రియాలోపములచే బ్రహ్మరక్షస్సునైతిని, కావున నీవీజన్మలో నెరిగిన మంత్ర

ములనెల్ల నేను నా వెనుకజన్మయందే యెరుగుదును గాన నీకన్న నధికుడ ననెను. అంతలకు యాదవుడు, "అగుచో నీవెట్లు పోదు"వనెను. అంతట నాబ్రహ్మరాక్షసియు 'నీ వద్ద విద్యనభ్యసించెడి రామానుజులు తనపాదములను నానెత్తిన బెట్టినచో పోదు'నన యాదవులకోర్కెపై రామానుజులు తనపాదముచు బ్రహ్మరక్షస్సు తలకు తగిలించగనే నది పోవు చుంటిననగా, పోవుచునట్లేదేని గుర్తుజూపుమని రామానుజు లన, నదియు 'యూరిబయట నొక పెద్దచెట్టుకొమ్మపై నివసిం చుచుందును, దానినిప్పుడు విరిచిపారవైచిపోదు'నని దెల్పి యట్లేయొనర్చి వెడలిపోయెను. అదిజూచి రాజును పరివార మును రామానుజులును యాదవుడును మొదలగువారెల్ల సంతసించిరి.

ఒకప్పుడు ఆళవన్దార్లు శ్రీరంగమున తిరువాయ్ మొళ్ళి వ్యాఖ్యాన సమయమున నాల్గవశతకమున పదియవ దశకమున ఐదవపాశురమగు 'ఇలిఙ్గత్తిట్టపురాణత్తీరుమ్' అనెడి పాశురమున వేదబాహ్యకుదృష్టి మతముల నిరసించి నట్లు తమ తర్వాతివారెవరా? యని విచారించి, రామాను జులయందు మనసుపోయి, యాదవునితో పొత్తుచెడి యాతడు తనవద్దకు వచ్చు మార్గమేర్పఱచవలసినదిగా వరదరాజుల శరణుజొచ్చిరి.

తరువాత యాదవప్రకాశుడును నొకనాడు 'సర్వం ఖల్విదంబ్రహ్మ' యను ఛాందోగ్యోపనిషత్తులోని(3-14-1) వాక్యమునకు ఈకన్పించునదంతయును బ్రహ్మయేగదా (బ్రహ్మమునకన్న యితరమెల్లను మిథ్య) యను నర్థము జెప్ప; రామానుజులు దానిని ఖండించి, ఈ కన్పించున దంతయును బ్రహ్మాత్మకమేకదా (చేతనాచేతనాత్మకమగు జగత్తునకంతయు ఉత్పత్తి స్థితి లయములకు బ్రహ్మమే కారణమగుటచే నివి వాని కార్యములే. వీనియందెల్ల నాతడు అంతర్యామిగ కలవాడు) యనునర్థమును దెల్పిరి.

## యాదవుని వీడి వరదునికి తీర్థకైంకర్యమొనర్చుట

మరియొకనాడు యాదవుడు 'నేహ నానాస్తి కిఞ్చన' యను బృహదారణ్యకోపనిషత్తు(6-4-19) నందలి వాక్యమునకు, ఇచ్చట బ్రహ్మముకన్న వేరగు వస్తువులేదు (అనగా నీ జగత్తంతయు బ్రహ్మయొక్క వికారమే) అను నర్థమును జెప్ప; రామానుజులును బ్రహ్మమంతర్యామిగ లేని వస్తు వొక్కటియును జగత్తున లేదు, అను నర్థమును జెప్ప; యాదవుడు మిక్కిలి కోపించి 'నేటినుండియు నీయిచ్చవచ్చిన చోటికిపొమ్ము నావద్దకురావలద'ని దెల్ప, రామానుజులును ఇంటికేగి తల్లితో నీ విషయమును దెల్ప; నామెయు 'నీకింత వరకు వచ్చినదే చాలును, నీవు పోయి తిరుకచ్చినంబి

గారి నాశ్రయించి వారు జెప్పినట్లు చేయుమ'నగా, రామానుజులును తిరుక్కచ్చినంబిగారినాశ్రయింప, వారును 'లక్ష్మణార్యా! వెనుకటివలెనే నిత్యమును శాలక్కిణరునుండి వరదరాజులకు తిరుమంజనతీర్థపు బిందెను దెచ్చి సమర్పింపుడ'నన ట్లేయొనర్చుచు నుండిరి.

అట్టితరి యొకనాడు కంచినుండి యిరువురు శ్రీవైష్ణవులు శ్రీరంగము జేరి ఆళవన్దార్లను సేవించ, వారును 'లక్ష్మణాచార్యులేమి చేయుచుండిర'ని యడుగ, యాదవప్రకాశుని విడిచి వరదరాజులకు తీర్థకైంకర్యమొనర్చుచుండిరని దెల్పిరి. అంతట యామునులు పెరియనంబిని జూచి 'మీరు కంచికేగి లక్ష్మణార్యులను నా వద్దకు దోడ్కొనిరండ'ని నియమింప నట్లేయని వారేగిరి.

## యామునుల చరమదశ

యామునులును తమ శరీరమున నస్వస్థతచే మిక్కిలి తల్లడిల్లి స్నానమొనర్చి శ్రీరంగనాథుని సేవించి తీర్థ శఠకోప ప్రసాదముల సేవించి తిరిగి మఠమునకేతెంచి పద్మాసనస్థులై శ్రీరామమిశ్రుల ధ్యానించుచు బ్రహ్మవల్లి, భృగువల్లి, పురుషసూక్తము అర్చిరాది, శూల్యవిశుమ్బ మొదలగునవి సేవించుచు సకలవాద్యములు మ్రోగుచుండ బ్రహ్మరంధ్రమునుండి తిరునాడును జేరిరి.

## యామునుల చేతి వ్రేళ్ళను తెరిపించుట

అంతట నచ్చుటి స్వాములు యామునుల కుమారులగు పిళ్ళైక్కరశునమ్బిని మున్నిడుకొని యతిసంస్కారములెల్ల జేయించి యామునుల చరమవిగ్రహమును పూరివెలుపలకు జేర్చి భూస్థాపితమొనర్చువేళకు, పెరియనంబి లక్ష్మణార్యులను కంచినుండి శ్రీరంగమునకు దోడ్కొనివచ్చువేళాయెను. లక్ష్మణార్యులును యామునుల చరమవిగ్రహమును సేవించి మూడుచేతివ్రేళ్ళు ముడుచుకొనియుండుటకు కారణమడుగ నచ్చుటిస్వాములును యాళవన్దార్లు తమ కాలక్షేప సమయముల నప్పుడప్పుడు, వ్యాసపరాశరుల విషయమున నుపకారస్మృతిగ నిరువురను వారి తిరునామములతో పిలిపించవలెననియు, నమ్మాళ్వార్ల విషయమున ప్రేమాతిశయముచే వారి తిరునామమొకరికి నేర్పించవలెననియు, వ్యాససూత్రములకు విశిష్టాద్వైతపరముగా వ్యాఖ్యయొనర్పవలెననియు ననుచుండెడివారని దెల్ప, లక్ష్మణార్యులును నామూడు కోర్కెలను తీర్తునని శపథమొనర్పగనే ముడుచుకొనిన మూడువ్రేళ్ళు, విడివడెను. ఇదిచూచి యచ్చుటి వారెల్ల నాశ్చర్యపడిరి. లక్ష్మణార్యులును, యామునులతో తమను చేర్చనందులకు శ్రీరంగని జూడకనే తిరిగి కంచికేతెంచి వరదుని సేవయందుండిరి.

## తిరుక్కచ్చినంబి శేషప్రసాదమును స్వీకరింప నెంచుట

లక్ష్మణార్యులకు నానాటికి తిరుక్కచ్చినమ్బియందు ఆదరణ పెరిగి, వారినాశ్రయించి 'యీయాత్మనుజ్జీవింప జేయుడ'ని ప్రార్థింప, నమ్బియు భగవానుని యాజ్ఞయగు వర్ణాశ్రమధర్మముల పాటించవలదా? యనిరి. మరియొకనాడు లక్ష్మణార్యులు తిరుక్కచ్చినమ్బి తళిహాప్రసాదమును గొను వేడ్కతో వారిని భోజనమునకై ఆహ్వానించిరి. లక్ష్మణార్యులును భార్యచే తళిహా జేయించి, నమ్బిగారిని పిలువనేగిరి. నమ్బియు మరియొకదారిన లక్ష్మణార్యుల యింటికే తెంచి సాపడి వెడలిపోయిరి. లక్ష్మణార్యుల భార్యయు నమ్బిగారి యెంగిలియాకును దీసి శుద్ధిజేసి స్నానమాచరించి యుండెను. లక్ష్మణార్యులు వచ్చి పరిస్థితినెరిగి విచారించి, భార్యపై క్రోపగించిరి.

## వరదునివలన షడ్వార్తలు దెలియుట

తిరుక్కచ్చినమ్బి చామరకైంకర్యమొనర్చు వేళన వరదరాజులతో మాట్లాడుచుండెడి యలవాటు గలదు. అది యెరిగి లక్ష్మణార్యులు నంబిగారితో వరదరాజులవలన కొన్నిసందియములను దీర్చుకొననెంచి విన్నవించ; నమ్బియు వరదరాజుల కీవార్తలను విన్నపించి తిరిగి యాత

యొసగిన సమాధానముల నిట్లు లక్ష్మణార్యులకు దెల్పెను. అవియేవనగా, "1) పరతత్వము నేనే; 2) జీవేశ్వర భేదము నిత్యము; 3) శరణాగతియే నన్ను పొందు సులభోపాయము; 4) శరణాగతునకు అంతిమస్మృతి యక్కఱలేదు; 5) ప్రపన్నునకు శరీరావసానమున మోక్షమే; 6) పెరియనంబి శ్రీపాదములనే ఆశ్రయింపుడు"

## పంచసంస్కారముల బడయుట

లక్ష్మణార్యులిట్లు వరదునిచే నియమింపబడి పెరియనంబిగారి నాశ్రయించుటకై శ్రీరంగమునకు బయల్దేరి దారిలోగల మధురాంతకము చెరువుగట్టునగల ఏరికాత్తపెరుమాళ్ ఆలయమువద్ద కేగిరి. అంతకుముందే యామునుల యభిప్రాయానుగుణముగ లక్ష్మణార్యులను శ్రీరంగమునకు దోడ్తెచ్చి దర్శనస్థాపకులనుగ జేయు యత్నమున పెరియనంబిగారు కంచికి బయల్దేరి దారిలోని మధురాంతకమునగల ఏరికాత్తపెరుమాళ్ళను సేవించి యచ్చట నుండిరి. ఇట్లిద్దరును నొకరినొకరు జూచుకొని సంతసించిరి. లక్ష్మణార్యులు పెరియనంబిగారికి దండమిడి హితమునుగూర్ప ప్రార్థించిరి. అందులకు నంబియు కాంచీపురమునకేగి వరదునిసన్నిధిన మంత్రోపదేశమొనర్పగల ననగా, లక్ష్మణార్యులును, శరీరము క్షణభంగురముగాన నిచ్చటనే సంస్కరింపుడని ప్రార్థింప,నంబియు

నట్లే పంచసంస్కారముల ననుగ్రహించి, యామునులనే యాచార్యులుగ భావింపుడని దెల్పిరి.

## భార్యాపరిత్యాగము—సన్యాసాశ్రమ స్వీకారము

అనంతరము లక్ష్మణార్యులు పెరియనంబిగారికి సకుటుంబముగ తమగృహమున బసయేర్పఱచి సంబారములనెల్ల సమకూర్చి వారివద్ద ద్రావిడవేద ప్రబన్ధములను, దర్శన విషయ రహస్యవిశేషములను నధ్యయనమొనర్చుచుండిరి. ఇట్లారుమాసములు జరిగెను.

ఒకనాడు లక్ష్మణార్యులకు తలంటిపోయుటకుగా వచ్చిన శ్రీవైష్ణవుడు ఆకలిగనున్నదని యడుగ, రామానుజులును తమ భార్యను జూచి యీతని కేమైన చద్దియన్నమున్న పెట్టుమనిరి. అందులకామె యేమియు లేదని సమాధానము జెప్పి, పెరటిలోనికి పనిమీద వెడలెను. లక్ష్మణార్యులును వంటియింటిలోని పాత్రలో చద్దియన్నము సమృద్ధిగ నుండుటను జూచి, భార్యను పిలిచి ఆకలిగొన్నవానికి అన్నములేదంటివేమి? యని మందలించిరి.

మరియొకనాడు లక్ష్మణార్యుల భార్యయు పెరియనంబిగారి భార్యయు నూతివద్ద నీళ్ళుతోడుకొనుచుండ, పెరియనంబిగారిభార్య తోడెడి నీటిచుక్కలు గాలివాటున రామానుజుల భార్యపైబడ యామె కోపించి కనులుకన్పడుటలేదా?

యన, నదివిని పెరియనంబిగారు రామానుజులకు జెప్పకనే తమభార్యతోడ శ్రీరంగమునకు వెడలిపోయిరి. తెల్లవారగనే అలవాటుప్రకారము లక్ష్మణార్యులు పెరియనంబిగారిని సేవించుకొనజూడ, వారులేకుండుటకు కారణము దెల్సికొని భార్యపై మిక్కిలి కోపగించి "పాపానా మాకరః స్త్రియః" (పాపమునకు స్త్రీలు మూలస్థానమైయుండిరి) అనుటను స్పష్టపఱచితివే! ఇంతకుముందు తిరుకచ్చినంబిగారి విషయమునను, శ్రీవైష్ణవుని ఆకలివిషయమునను అపచారపడియుంటివి, యిప్పుడు సహింపరానిదగు అపచారమును మూడవమారును జేసితివిగాన నీకువలసిన ధనముగొని పుట్టింటికేగుమని పంపివైచిరి. లక్ష్మణార్యులును సంసారము త్యాజ్యమని నిశ్చయించి, కంచిజేరి వరదరాజుల సన్నిధిన శాస్త్రోక్తవిధిన సన్యసించిరి. వరదరాజులును అర్చకముఖముగ వీరికి రామానుజముని యని నామమేర్పఱచి తిరుకచ్చినంబిగారి ద్వారా మఠమున ప్రవేశింపజేసిరి.

ఆపై రామానుజులును ఆశ్రమధర్మములను కొఱతలేక నడుపుచు, ఆళవన్దార్ల విశేషకటాక్షముచేతనే విరోధములు నశించి ఆనుకూల్యమేర్పడినదిగా దలచుచు, వారికోర్కెను దీర్చుటకుగా తమకు సహాయభూతులుగా నుండదగినవారెవ్వరా?యని విచారించి, యందులకు గోవిందభట్టరు తగినవారుగా దలచి, ప్రస్తుతమాతడు కాళహస్తి

యందు దేవతాన్తరపరుడై యుండుటకు చింతించి, పెరియ తిరుమలనంబిగారిద్వారా నాతని దిద్దుబాటుజేయించు తలంపుతో అనుకూలుడగు నొక శ్రీవైష్ణవుని బిలిచి, ''మీరు తిరుమలలో శ్రీవేంకటేశ్వరుని కైంకర్యముననున్న నంబిగారికీవిషయము దెల్పుడ''ని పంపిరి.

## కూరత్తాళ్వాన్, ముదలియాణ్డానులు రామానుజుల నాశ్రయించుట

ఆ తరువాత కన్దాడై ముదలియాణ్డానును, హారీతకుల శ్రేష్ఠులగు కూరత్తాళ్వానును రామానుజుల ఆశ్రమస్వీకారమును విని కంచి [illegible] వారి నాశ్రయించి పఞ్చసంస్కారాదుల లభించి కృతార్థులై వారి కైంకర్యరసము నొక కాలమందును వీడక సేవించుకొనుచు నుండిరి.

## యాదవప్రకాశుడు శిష్యుడగుట

ఆ తరువాత యాదవప్రకాశుని తల్లి వరదరాజులసేవయందును, తిరుక్కచ్చినమ్బి సహవాసమునను, రామానుజుల కాలక్షేపములను నాసక్తిగలదగుటచే శ్రీవైష్ణవ సంప్రదాయపు విలువలను గుర్తించి, తన కుమారుడును నీ సిద్ధాన్తము నవలంబించి యుజ్జీవించుటను కోరినదై, తన యభిప్రాయమును యాదవునకు దెల్పెను. యాదవుడును స్వమతాభిమానముచే శాస్త్రములకు నర్థముల జెప్పుటగాక, పారమా

ర్థికముగా జూచినచో స్వమతార్థముల నరుచి గల్గుటచేతను, రామానుజులు లక్ష్మణార్యులుగ తనవద్ద విద్య నేర్చుకొను నప్పుడు ఉపనిషద్వాక్యములకు తాను జెప్పెడి యర్థములకన్న విలక్షణమగు నర్థముల జెప్పియుండుట తన మనస్సున నాటుకొనియుండుట చేతను, వారి మాహాత్మ్యములను బ్రహ్మరాక్షసి జెప్పియుండుట చేతను, వారికి గంగాయాత్రయందు భగవానుడే ఆటవిక రూపమున నుపకరించుట చేతను, తనతల్లి మాటల చేతను, రామానుజులనాశ్రయించి సన్యసింప నెంచి, తన యభిప్రాయమును వారికి దెల్పెను. అందులకు రామానుజులు యాదవునితో మీరు శిఖాయజ్ఞోపవీతముల త్యజించియుండుటచే ప్రాయశ్చిత్తముగ భూప్రదక్షిణము జేయవలసియున్నది; అందులకు మీరు వయోవృద్ధులైయుండిరిగదా! అశక్తులగు మీకి దెట్లుకూడుననిరి. అంత యాదవుడు రామానుజులకు ప్రదక్షిణ మొనర్చి ఆచార్యప్రదక్షిణము భూప్రదక్షిణమునకు సమానమని విన్నవింప; రామానుజులు సంతసించి శాస్త్రోక్త ప్రకారముగ ప్రాయశ్చిత్తపూర్వకముగ చౌళోపనయనాదులు మొదలుకొని త్రిదణ్డకాషాయాదుల వరకు ప్రసాదించి, గోవిందజీయర్ అని తిరునామమిడి పఞ్చసంస్కారపరుల నొనర్చి, గురుపరంపరా పూర్వకముగ మంత్ర మంత్రార్థములనెల్ల ననుగ్రహించి శాస్త్రములందలి యితరేతర వచనములకు విరుద్ధార్థములు రానట్లు 'యతిధర్మసము

చ్ఛయ'మను గ్రన్థమును వ్రాయుడని నియమింప గోవిన్ద జీయరును ఆచార్యాజ్ఞానుగుణముగ నాగ్రన్థమును రచియించిరి. ఇట్లు గోవిందజీయరు ఆచార్యపరతంత్రులై కొలదికాల ముండి పరమపదించిరి.

## రామానుజులు కంచిని విడిచి శ్రీరంగము జేరుట

ఆ తరువాత రామానుజులును, కూరత్తాళ్వాను ముదలియాణ్డానులకు మీమాంసాశాస్త్రద్వయమును సద్వ్యయన మొనర్పజేయుచు కంచియందున్న కాలమున, వీరి యొక్క ఆశ్రమస్వీకారము మొదలగు చేష్టలనెల్ల వినియున్న పెరియనంబి మొదలగు ఆళవన్దారుల శిష్యులెల్లరును మిక్కిలి సంతసించి రామానుజులను శ్రీరంగమునకు రప్పించవలసి నదిగా శ్రీరంగనాథుని ప్రార్థించిరి. అంతట శ్రీరంగనాథు డును ఆళ్వార్ తిరువరంగప్పెరుమాళ్ అరైయరును పిలిపించి, 'మీరు వరదరాజులను గానముచే మెప్పించి రామానుజులను శ్రీరంగమునకు దోడ్కొని రండని విన్నవింప, అరైయరును కంచికే తెంచి, తమ బంధువగు వరన్దరుమ్ పెరుమాళరైయర్ తోఁగూడి వరదరాజుల సేవింప ఆలయమున కేగిరి. ఆ సమయమునకు వరదరాజులు సపరివారముగ 'కచ్చిక్కు వాయ్త్తాన్' అను మంటపమున ఆస్థానమై వేంచేసియుండ, తిరుకచ్చినమ్బిగారు చామరకైంకర్య మొనర్చుచుండ,

రామానుజులును వరదరాజాష్టకము ననుసంధించు చుండిరి. వరదరాజులును తిరువరఙ్గప్పెరుమాళ్ళరైయరును సాదరముగ వీక్షించి తీర్థశఠకోప ప్రసాదముల ననుగ్రహించ, అరైయరును భక్తిపురస్సరముగ ఆళ్వార్ల దివ్యశ్రీసూక్తులచే వరదరాజుల ననేకవిధముల స్తుతింప, వరదుడు మిక్కిలి ప్రీతుడై తాను ధరించిన ముత్యపుహారమును పీతాంబరమును ఛత్రచామరాది మర్యాదలను లభింపజేసి, నన్నును నా దేవేరులను దప్ప నేదైన కోరుకొను డిచ్చెదననగా, అరైయరును రామానుజులను జూపిరి. అందులకు వరదుడు 'అయ్యో! నన్నును నా భార్యలను రామానుజులను దక్క, యనుట మరచి యజ్ఞుడనైతినే' యని మిక్కిలి విచారించి, చేయునది లేక నంగీకరించిరి. తిరువరఙ్గప్పెరుమాళ్ళరైయరును రామానుజులను వెంటనిడుకొని శ్రీరంగమునకు ప్రయాణమైరి. రామానుజులును కూరత్తాళ్వానును ముదలియాణ్డానును తమ తిరువారాధనమగు పేరరుళాళరును (వరదరాజులను) గూర్చుకొని అరైయరువెంట శ్రీరంగమును జేరి ఉత్తర కావేరిలో స్నానమాడి ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించిన సమయమునకు, వీరి రాకను దెలిసికొనిన శ్రీరంగనాథుడు విష్వక్సేనులను జూచి మీరు నా సకలలాంఛనములతోను రామానుజుల నిచ్చటకు దోడ్కొనిరండవ, సేనముదలియారును జీయర్లతోను ఏకాంగులతోను శ్రీవైష్ణవ బృందముతోను ఛత్రచామరనృత్తగీతవాద్యాదులతోను రామానుజుల

నెదురొక్కన; రామానుజులును వారినెల్లరను సేవించి, వారి వెంట నడిచి ప్రదక్షిణముగ గోపురమునకు బలిపీఠము నకు నమస్కరించి, సేనాక్రమమున నృసింహుని శ్రీరంగనాయకిని సేవించి, శ్రీచంద్రపుష్కరిణిలో స్నానమాడి, ఆళ్వారాదుల సేవించి, ప్రణవవిమానమునకు నమస్కరించి, అళ్గియమణవాళన్ తిరుమంటపమున ప్రవేశించగనే, నంబెరుమాళ్ళు చేతులపై సేవగ నెదుర్కొని మూలవరుల సేవింప జేసి తీర్థశఠకోపప్రసాదముల ననుగ్రహించి సభాస్థానమున కెల్లరను రావించి అందరి యెదుటను రామానుజులకు ఉభయవిభూతినాయకత్వమొసంగి నేటినుండియు మీకును మీవారికిని ఉభయవిభూత్యైశ్వర్యమిచ్చితిని గాన నిచ్చటి కార్యములనెల్ల విచారించి నడిపించవలయునని యేర్పఱిచెను. నాటినుండియు రామానుజులకు 'ఉడైయవర్' (సొత్తు కలవారు) అనెడి తిరునామమేర్పడెను. ఉడైయవర్లును నట్లే శ్రీరంగనాథునకు నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవాది మహోత్సవములనెల్ల కొఱతలేని విధముగ నేర్పఱచిరి.

## ఎమ్బార్లను దిద్దుబాటొనర్చిన విధము

రామానుజులచే తిరుమలకు పంపబడిన శ్రీవైష్ణవులు తిరుమలనంబిగారిని సేవించి గోవిందమిశ్రుల దేవతాన్తరపర

తను చెల్ప; నమ్బిగారును శిష్యసహితముగ కాళహస్తికి జేరి సువర్ణముఖనదీతీరమునగల నొక చెట్టుమొదట నిలిచియుండ, గోవిందుడును స్నానానంతరము వీరిని జూచుచు వెడలి పోయెను. మరియు వేరొకనాడు అచ్చటనే చెట్టుక్రింద తిరుమలనంబిగారు నిల్చియుండడిరి. గోవిందుడును స్నానమాడి తీర్థబిందెతో పోవుచుండ, నంబిగారొక తాటియాకుపై "నారాయణా! నీయొక్క స్వభావసిద్ధమైనట్టియు అవధిలేనట్టియు నియంతృత్వమును వేదమర్యాద నెరిగినవా డెవ్వడంగీకరింపడు? బ్రహ్మరుద్రేంద్రాదులయు ముక్తపురుషులయు అతిశయములన్నియును నీయొక్క మహిమార్ణవమునందలి నీటి తుంపరలే సుమా" యనెడి యర్థముగల యామునాచార్యుల స్తోత్రరత్నములోని యొక శ్లోకమును వ్రాసి దారిలో పడవైచిరి. గోవిందుడు నీటిబిందె నెత్తుకొని వచ్చుచు నా తాటియాకును జూచి పైకితీసి యందలి శ్లోకమును జదివి, తిరుమలనంబిగారిని జూచి, అయ్యా ఈ శ్లోకము మీా దేవత పైచెప్పబడినది, దీనిని తీసికొనుడని యిచ్చి వెడలిపోయెను. నంబిగారుభగవదనుగ్రహ మిప్పటికీతనియం దింతయే గలదు గాబోలు ననుకొనుచు తిరిగి తిరుమలకేగిరి.

మరిరొకనాడు తిరుమలనంబిగారు వేంకటేశ్వరుని జూచి "స్వామీా నీ యాత్మవస్తువును నీదానిని జేసికొనెడి బాధ్యత నీదేసుమా"యని శరణాగతియొనర్చి చివరి

ప్రయత్నముగ కాళహస్తి జేరి సువర్ణముఖి నదీతటమున నొక చెట్టుక్రింద గూర్చొని తమ శిష్యులకు నమ్మాళ్వారుల తిరువాయ్మొళిలోని 'తిణ్ణన్వీడు' పదిపాశురములలోని యర్థము జెప్పుచు అందులోని 3వ పాశురమున "ఎమ్బెరుమానుక్కల్లాల్ పూవుమ్పూశనైయుం తకుమే" (సర్వేశునికి తప్ప (పూవులు పూజలును తగునా?)యనెడి యర్థమును జెప్ప గోవిందుడు విని చెట్టుపైనుండిదుమికి, ధరించిన రుద్రాక్షలను విభూతిరేఖలను చెరిపివైచి, తగదు-తగదనుచు తిరుమలనంబి గారి పాదములపైబడి లేవకయుండ, నంబిగారును గోవిందుల లేవనెత్తి ఆలింగనమొనర్చి వెంటబెట్టుకొని తిరుమల కేగుచుండ, నీవిషయము తెలిసిన కాళహస్తిలోని ఆలయసేవకులు పరుగునవచ్చి గోవిన్దుల మళ్ళించుకొనిపోవ యత్నింప గోవిన్దుడును వారలతో సంగము వీడి తిరుమలనంబిననుసరించెను.

తిరుమలనంబిగారును గోవిందుని తిరుమలకు దోడ్కొనిపోయి, పంచసంస్కారముల ననుగ్రహించి, తిరుప్పల్లాణ్డు మొదలుగ ఆళ్వార్ల దివ్యప్రబన్ధములనెల్ల నధ్యయనమొనర్పజేసి, స్వరూపగ్రన్థములనెల్ల కృపజేయ, గోవిందులును ఆచార్యపరైకనిష్ఠులై యుండిరి.

శ్రీరంగమున రామానుజులును పెరియనమ్బిగారి యింటికేగి నమస్కరించి, 'దేవరవారినాశ్రయించుటచే ఆళవన్దారుల నాశ్రయించలేకపోయిన దుఃఖము తీరినది, దేవర

వారి హృదయమునగల అర్థవిశేషములను దాసున కనుగ్ర హింపవలయు' నని ప్రార్థింప, నశ్లేయని పాపహరమై, పుణ్యవర్ధకమై, సంసారబంధమును ద్రెంప సమర్థమై, వేద సారతమమై, శుభకరముగ శ్లాఘింపబడిన మంత్రరత్నమన బడుద్వయార్థమును సవిశేషముగ ననుగ్రహించి, 'యింకను కొన్ని అర్థవిశేషములు, ఆళవన్దార్లచే నభిమానింపబడిన తిరుక్కోట్టియూరినమ్బిగారి పాదముల నాశ్రయించి వినుడని దెల్పిరి.

## తిరుక్కోట్టియూర్‌నంబి వలన మంత్రరాజ చరమ శ్లోకార్థముల బడయుట

ఉడైయవర్లును తిరుక్కోట్టియూరును జేరి, నంబిగారికి సాష్టాంగపడి 'దేవరవారు దాసునకు రహస్యార్థవిశేషముల నెల్ల కృపజేయ వలయున?ని ప్రార్థింప, వీరి విశ్వాసపూర్తిని తెలుసుకొనవలయునని విముఖులైరి. అంతట ఉడైయవర్లు తిరిగి శ్రీరంగమును జేరిరి. ఇట్లు 17పర్యాయములు ఉడై యవరులు తిరుక్కోట్టియూరునకు పోయి నంబిగారిని ప్రార్థిం చినను రహస్యార్థములు లభింపకైరి.

ఆ తరువాత తిరుక్కోట్యూరినంబిగారు శ్రీరంగనా థుని సేవించి, తిరిగి తమగ్రామమేగుచుండ శ్రీరఙ్గనాథుడును అర్చకముఖముగ నంబిగారినిజూచి అయ్యా! మన రామాను

జులకు రహస్యార్థముల నుపదేశింపరాదా? యన; నంబియు 'నా సంవత్సరవాసినే ప్రబ్రూయాత్' (సంవత్సరకాలము ఆచార్యసన్నిధిన నుండనివానికి జెప్పరాదు; 'ఇదన్తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన నచాశుశ్రూషవేవాచ్యం' (దీనిని శరణాగతి చేయని వానికిని, భక్తుడుకానివానికిని, శుశ్రూషజేయనివానికిని చెప్పరాదు) అనిచెప్పియుంటివి గదా యన; శ్రీరంగడు అట్లుకాదు 'శరీరము సంపద విజ్ఞానము వస్త్రములు కర్మలు ప్రాణములునైన ఆచార్యునికై ధరించియున్నవాడే శిష్యుడు; ఇట్టి లక్షణములు లేనివాడు శిష్యుడుగా నెంచబడడు' అనెడి లక్షణములన్నియు రామానుజులయందు కలవుగాన కొఱతలేదు ఉపదేశింపుడన, నంబి మౌనముతో తిరిగి వెళ్ళిపోయిరి.

ఒకనాడు తిరుకోట్టియూరినంబిగారి శిష్యులగు శ్రీవైష్ణవులొకరు శ్రీరంగనాథుని సేవించి, తిరిగివచ్చుచు ఉడైయవరుల శ్రీపాదములకు దండమిడి నిలువ, వారును తిరుమంత్రార్థము లభింపనందులకు మిక్కిలి యనుతపింప, నా యనుతాపమును నంబిగారికి విన్నవించిరి. నంబిగారును మిక్కిలి దయతో నా వైష్ణవశిష్యునిజూచి, మీరేగి రామానుజులను త్రిదణ్డము పవిత్రములమాత్రము వెంటనిడుకొని యితరు లెవ్వరును వెంటరాకుండ నొంటరిగ రమ్మనుడని కబురుపంపిరి. ఈవార్త వినిన ఉడైయవర్లును మిక్కిలి సంతసించి కూర

త్తాళ్వానును ముదలియాణ్డానును వెంటనిడుకొని తిరుక్కో-
ట్ట్యూరును జేరిరి. నంబిగారును రామానుజుల జూచి ఒంట
రిగ రమ్మనిన వీరిరువురను గూడి వచ్చిరేమి? యని యడుగ,
రామానుజులును త్రిదణ్డము పవిత్రములతో రమ్మంటిరి
గదా? వీరిలో ముదలియాణ్డాను త్రిదణ్డము, కూరత్తాళ్వాను
పవిత్రము నగుటచే విడువక తెచ్చితిననగా, నమ్బియు
నైనచో వీరికితప్ప నితరుల కీ విషయమును జెప్పవలదని నియ
మించి, ఎనిమిది యక్షరములై మూడుపదములై, జ్ఞాన భక్తి
వైరాగ్యముల గల్గించునదై ముముక్షువులకు (ముక్తిగోరు
వారలకు) సదానుసంధేయమగు పెరియతిరుమంత్రార్థమును
కృప జేసిరి, రామానుజులును కృతార్థులై, ఆ మరునాడే యా
యూరిలోని శ్రీవైష్ణవసభలో ననేకుల కీ పరమ రహస్య
మును బయల్పఱచిరి.

తిరుక్కోట్ట్యూరినమ్బిగారీ చేష్టితమును విని, ఉడైయ
వరుల రావించి, ఈ పరమ రహస్యము నితరులకు జెప్పవల
దనిగదా మీకు జెప్పితిమి, మామాట ననాదరించి మీరనే
కులుగల సభలో నీ విషయమును బయల్పఱచిరట, మాటను
నిర్లక్ష్యము నర్చిన మీకు గలుగు ఫలమేమి? యని యడుగ;
ఉడైయవర్లును, ఆచార్యుని యాజ్ఞను అతిక్రమించినవానికి
నరకమే ఫలమని దెల్పిరి. అయినచో తెలిసియు మీరిట్లేల
రొనర్చిరని నమ్బియడుగ, నందులకు ఉడైయవర్లును, నే

నొక్కఁడనేగదా నరకమును బొందువాఁడను. మీ యనుగ్రహముచే లభించిన మంత్రార్థమును వినినవారెల్లరును దేవర వారి శ్రీపాదముల నాశ్రయించి ఆత్మజ్ఞాన సంపన్నులై తరింతురుగదా యని జెప్పితిననిరి. నంబిగారును ఈ పరసమృద్ధికి మిక్కిలి సంతసించి రామానుజులను దగ్గరకు పిలిచి గాఢాలింగన మొనర్చి 'ఎంబెరుమానార్' (మన్నాధులు) (నాకన్న పరసమృద్ధిలో మీరే యధికులు) అను తిరునామమిడి మీకింకను పరమరహస్యమును జెప్పెదను రండని ఏకాంతమునకు గొనిపోయి, 'సర్వ గుహ్యతమం భూయః శృణు మే పరమం వచః। ఇష్టోసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితం' అన్ని రహస్యములకన్నను మిక్కిలి రహస్యమగు నీపరమహితమును నాకుమిక్కిలి ప్రియుడవగుటచే నీకుజెప్పుచుంటిని గాన శ్రద్ధతో వినుమని భగవానుడు అర్జునునకు జెప్పినట్లు, పరమరహస్యమగు చరమశ్లోకార్థమగు ఇతరోపాయ త్యాగపూర్వకముగ సిద్ధోపాయవైలక్షణ్యమును ప్రతిపాదించి, దీనిని భగవద్విముఖులగు నాస్తికుల చెవిని పడకుండ నాదరింపుడన ఎంబెరుమానార్లును, అట్టివారలకు దెల్పనని ప్రతిజ్ఞయొనర్చి, భగవత్ప్రవణులగు కూరత్తాళ్వానుల కొక్కరికిని దెల్పునట్లాజ్ఞయిండని ప్రార్థింప, నంబియు నీయర్థము వినదగు నర్హత గల్గియున్నను సంవత్సరము ఉపవసింపజేసి వాని విశ్వాసపూర్తిని గ్రహించి తెల్పుడని నియమింప నట్లే యని, శ్రీరంగమునకు వేంచేసిరి. కూరత్తాళ్వానును ఎమ్బె

రుమానార్లను సేవించి, తిరుక్కోట్టియూరినంబిగారి ఉపకార మును తమకు లభింపజేయుడని ప్రార్థింప, ఎమ్బెరుమానార్లును నంబిగారి ఆజ్ఞను తెల్పిరి. అంత కూరత్తాళ్వాన్లు సంవత్సర ఉపవాస ఫలము, ఆచార్యుని గృహమున నెల రోజులుండి వారికి శుశ్రూషయొనర్చిన లభించునని శాస్త్ర ముండుటచే నట్లొనర్చి వారినుండి చరమశ్లోక రహస్యార్థ మును లభించి సంతృప్తులైరి.

ముదలియాణ్డాను ఎమ్బెరుమానార్లయొక్క శ్రీపాద ములకు, నమస్కరించి దాసునకును కృపజేయవలయునని ప్రార్థింప ఉడైయవరులును కూరత్తాళ్వానుల కొక్కరికే జెప్పునట్లు నంబిగారాజ్ఞ యిచ్చిరిగాన వారినే యాశ్రయింపుమని తిరుక్కోట్టియూరునకు పంపిరి. ముదలియాణ్డాను నంబిగారిని సేవించి చరమ రహస్యార్థమును గృపజేయుడని ప్రార్థింప, విద్యామద ధనమద అభిజనమదములు మూడును నశించినచో ఎమ్బెరుమానార్లే మీకు ఉపదేశింపగలరని పంపివైచిరి. ఆణ్డాను శ్రీరంగమునకు తిరిగివచ్చి ఉడైయవరులకు తమయార్తియెల్ల దెలియునట్లు సవినయముతో నాశ్రయింప, వారును చరమశ్లోకార్థమునుపదేశించి, తమకు తిరిగి దండము పవిత్రము లభించినట్లు మిక్కిలి సంతసించిరి.

## తిరుమలైయాణ్డానువద్ద తిరువాయ్‌మొழி అర్థమును వినుట

తరువాత కొన్నినాళ్ళకు తిరుక్కోట్టియూరినమ్బి శ్రీరంగమునకు వచ్చి శ్రీరంగనాథుని సేవించి, తిరుమలైయాణ్డానును పిలిపించి, ఎమ్బెరుమానార్ల మఠమునకేగి, ఉడైయవర్లను, మీరు తిరుమలైయాణ్డాను వద్ద తిరువాయ్‌మొழிకి అర్థమును వినుడని నియమించి తిరిగి తమ గ్రామమున కేగిరి.

తిరుమలైయాణ్డాను నమ్బిగారి యాజ్ఞానుగుణముగ ఉడైయవర్లకు తిరువాయ్‌మొழி కాలక్షేపము జెప్పుచు మధ్యమధ్యన ఆళవన్దార్లు ఇచ్చట నిట్లు జెప్పిరనుచుండెడివారు. అది వినెడి ఎమ్బెరుమానార్లును మీరు చెప్పినది ప్రకరణమునకు చేరదుగాన, నిట్లు జెప్పియుందురని విలక్షణార్థమును జెప్పుచుండెడివారు. ఇట్లుండ నొకనాడు తిరుమలైయాణ్డార్లు తిరువాయ్‌మొழிలోని రెండవశతకములోని మూడవదశకమునందలి మూడవపాశురమున 'అఱియాకాలత్తుళ్ళే' అనెడిపాశురమునకు 'జ్ఞానములేనిదశలో సంబంధమును బుట్టించి, కలిగిన జ్ఞానమును చెడగొట్టగల దేహసంబంధమున వైచితివి, అనెడి దుఃఖముచే జెప్పుచున్నారనిరి. అది వినిన ఉడైయవరులు ముందు పాశురములందును తర్వాతి పాశురములందును ప్రీతితో చెప్పుచుండగా మధ్యన అప్రీ

తిగ జెప్పుట ప్రకరణమునకు సరిగాదు. కావున తెలియరాని ఆశ్చర్యచేష్టలుగలవాడు దాసుడనగు నన్ను జ్ఞానములేని దశయందే దాస్యమున స్వీకరించెను. అనుట ఉపకారస్మృతి పరముగ జెప్పదగుననిరి. ఆణ్డానడివిని 'ఇదొక విశ్వామిత్ర సృష్టిగనున్నదే? ఆళవన్దారు లిట్లు జెప్పుట వినియుండము' అని కాలక్షేపము జెప్పుట మానివై చిరి. ఈ విషయమును తిరుక్కోట్టియూరినమ్బిగారు విని శ్రీరంగమునకు వచ్చి తిరుమాలై యాణ్డాను వద్దకేగి తిరువాయ్ మొழி కాలక్షేపము జరుగుచున్నదా? యని యడుగ, ఆణ్డానును నేను ఆళవన్దారులవద్ద వినిన అర్థములుగాక, వీరు వేరేకొన్ని అర్థములను జెప్పుచుండుటచే మానివై చితిననిరి. అంతట నంబియు 'నాయర్థములేవి?' యని తెల్సుకొని, 'ఈయర్థములనే యామునార్యుల వద్ద మేము వింటిమి, ఆనాడు కాలక్షేపమునకు మీరు రాకపోవుటచే? నవి మీకు తెలియవాయెను, సాందీపునివద్ద శ్రీకృష్ణుడు వేదాధ్యయన మొనర్చినట్లేసుడీ! మీవద్ద ఎమ్బెరుమానార్లు తిరువాయ్ మొழி వినుటయును; ఆళవన్దారుల అభిప్రాయముదప్ప వీరికి వేటొకటి ప్రకాశింపదు, యామునులకు వీరు ఏకలవ్యులు సుమా! మీరు వీరికి తెలియనివి చెప్పుచుంటి మనుకొనకు'', డని చెప్పి, తిరుమాలై యాణ్డానును పెరియనమ్బిగారిని కూర్చుకొని ఎమ్బెరుమానార్ల మతము జేరగ, ఉడైయవర్లును మిక్కిలి ప్రీతితో

వారలకు సాష్టాంగప్రణామ మొనర్చిరి.

ఆ తరువాత తిరుక్కోట్టియూరినమ్బిగారును పెరియ నంబిగారును తిరుమాలైయాణ్డానును జూచి, మిగిలిన భాగమును మీరే యనువర్తించి పూర్తిజేయుడని జెప్పి వెడలిరి. ఆండానును కాలక్షేపము మధ్యమధ్యన ఎమ్బెరుమానార్లు జెప్పెడి అర్థవిశేషములను ఆళవన్దార్ల సన్నిధిన వినుచున్నట్లు భావించుచు దాసోహము సమర్పించుచుండెడివారు. ఇట్లు తిరుమాలైయాణ్డానువద్ద ఎమ్బెరుమానార్లు కాలక్షేపము పూర్తిజేసిరి.

## తిరువరఙ్గప్పెరుమాళరయర్ వద్ద చరమోపాయమును వినుట

ఒకనాడు పెరియనంబిగారు ఎమ్బెరుమానార్లను జూచి 'ఆళ్వార్ తిరువరంగప్పెరుమాళ్అరైయర్' వద్ద మరియొక విశేషార్థముగలదు. దానిని మీరు వారివద్ద వినుడని నియోగింప; ఉడైయవర్లును నాటినుండి యాఱుమాసములు అరైయర్లకు తమయందు ప్రీతిగల్గుటకుగా ప్రతిరోజును పాలనుకాచి సమర్పించుటయు, స్నానమొనర్చునప్పుడు పసుపుతోకలిపిన నలుగుపిండిని శరీరమునకు నలుగుపెట్టి స్నానముజేయించుటయు జేయుచుండిరి. ఒక

నాడు నలుగుపిండి పరిమళము రంగును తగ్గుటచే అరైయర్లకు తృప్తిగల్గకపోవుటను వారి ముఖవికారమున దెల్సుకొనిన ఉడైయవరులు దానిని పారవైచి, వెంటనే మిక్కిలి రంగుతోను పరిమళముతోను నుండునట్లు పిండిని తయారుజేసి శీఘ్రముగ అరైయర్ల శరీరమునకు పూసి స్నానము జేయించిరి. అందులకు మిక్కిలి ప్రీతులైన అరైయర్లు 'ఇటు వేంచేయుడు, ఎమ్బెరుమానారే! నా సర్వస్వము నపహరించితిరి, మీకొక చరమ పురుషార్థము నుపదేశింతు'మని దగ్గరకు పిలిచి ఆలింగనము జేసికొని, 'తేవు మత్తరియేన్ కురుకూర్నమ్బి' ఆచార్యునికన్న వేరొక దైవము నెఱుగనన్న మధురకవులవలె మీరును, ('గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరంధనం, గురురేవ పరఃకామో గురురేవ పరాయణమ్। గురురేవ పరావిద్యా గురురేవ పరాగతిః యస్మాత్తదుపదేష్టాసౌ తస్మాద్గురుతరోగురుః') ఆచార్యులే పరమాత్మ, ఆచార్యులే గొప్పధనము, ఆచార్యులే పరమప్రాప్యము (మిక్కిలి పొందదగినవారు), ఆచార్యులే బ్రహ్మవిద్య, ఆచార్యులే గొప్ప ఉపాయము; తిరుమంత్రోపదేశము చేయుటచేత వారే గొప్పవారలెల్లరకంటెను నధికులు, తెలియని విషయముల నన్నిటిని తెలియబఱచిన ఆచార్యులనే నడచుచున్న శ్రీమహావిష్ణువుగ తలచదగును, ఇందు సంశయము లేదు, అని పంచమోపాయనిష్ఠ నుపదేశించిరి.

# శిష్యాచార్య అనువర్తన విధము

పెరియనంబిగారి శ్రీపాదముల నాశ్రయించినప్పుడే స్వరూపసిద్ధిగల్గియుండగా రామానుజులు, అనేకుల శ్రీపాదముల నాశ్రయించి యుపదేశముల బొందుటకు కారణ మేమి?, వారును తామే అపేక్షించి వీరికి అర్థముల నుపదేశించుటకు కారణమేమి? యనిన; ఒకరాజు తన కుమారుని కొఱకు అనేకులగు మంత్రులవద్ద నిధులనుంచి తెలివిగల్గిన తరువాత యిండని చెప్పిపోయినట్లు, ఆళవన్దార్లును తమ శ్రీపాదముల నాశ్రయించిన వారలలో నధికులగు వారలకు నొక్కొక్క యర్థవిశేషముల నుపదేశించి, వీనిని మీరు రామానుజుల కుపదేశింపుడని యాజ్ఞాపించుటచేత వారెల్లరు నుడై యనవరుల కీయర్థవిశేషముల నుపదేశింప త్వరపడిరి; ఎమ్బెరుమానార్లును తాము ప్రత్యక్షముగ ఆళవన్దారుల నుండి పొందని లోపము తీరుటకుగా, వీరి నాశ్రయించి యీ రహస్యార్థముల నెఱిగిరి. విలక్షణులగు శిష్యులు లభించి నచో నాచార్యులైనను వారి ననువర్తించి యుపదేశింప వచ్చును; లేక విలక్షణులగు ఆచార్యులు లభించినచో శిష్యులైనను వారిననువర్తించి యుపదేశముల పొందవచ్చు ననెడి మర్యాద దీనిచే తెలియనగును. అగుటచేతనే రామానుజులకు ముందున్న ఆచార్యులెల్లరును వీరి తిరుముడి (శిరస్సు) సంబంధముచేతను, తరువాతి ఆచార్యులెల్లరును వీరి తిరువడి

(శ్రీ పాదముల) సంబంధము చేతను అతిశయము గలవారైరి. ఒక హారము మధ్యనగల మాణిక్యసంబంధముచే రెండు ప్రక్కల ప్రకాశించినట్లు వీరిసంబంధముచే పూర్వోత్త రాచార్యులెల్లరును ప్రకాశించినట్లు తలచిరి.

## తళిహా కై కిడాంబి యాచ్చానును నియమించుట

ఉడైయవరులు శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మమని తెలియబఱచి సిద్ధాన్త ప్రవర్తన మొనర్చుకాలమున, వీరియతిశ యమును సహింపలేని స్థానికులలో నొకరు, తనభార్యకిష్టము లేకున్నను నిర్బంధించి, రామానుజులకు పెట్టుభిక్షాన్నమున విషముగల్పించెను. ఆమెయు నిర్బంధముచే నా విషమిశ్రా న్నమును ఉడైయవరుల భిక్షాపాత్రలో నిడి దండము సమ ర్పించి యింటిలోనికి వెడలిపోయెను. భావజ్ఞులగు నుడైయవరు లది గ్రహించి యాయన్నము కావేరిగట్టునపారవైచి నాటికి ఉపవసించిరి. పారవైచిన యన్నము నొక శునకము తిని గిల గిలతన్నుకొని చనిపోయెను. ఈ చేష్టితమును తిరుక్కోట్యూరినంబిగారెఱిగి శ్రీరంగమున కావేరియొడ్డునకు వేంచే యుసరికి మధ్యాహ్నకాలమాయెను. తిరుక్కోట్యూరినంబి గారు వేంచేసిరని తెలిసిన రామానుజులు శిష్యసమేతులై నంబిగారికి కావేరియొడ్డునకు ఎదురేగి మండుటెండలో కాలు చున్న యిసుకనేని లెక్క జేయక సాష్టాంగ దండప్రణామ

మొనర్చిరి. నమ్బిగారును వీరిని లేవమనరైరి, వీరును లేవ రైరి. ఈ యవస్థను జూచుచున్న తిరుమలనమ్బిగారి బావ మరిది కుమారులును, రామానుజుల శిష్యులును నగు కిడాంబి యాచ్చానుసహించలేక, అయ్యో! యిదెక్కడి శిష్యాచార్య మర్యాద!, సంపెంగ మాలను మండుటెండలో పడవైచు వారుందురా? యని రామానుజులను రెండుచేతులతోను పైకిలేపి తాను క్రిందపరుండి తనపైన రామానుజులను పడ వేసికొని 'యిప్పుడు మీ యిచ్చవచ్చువరకు లేవమనకుండు డని నంబిగారితో కోపముగ మాట్లాడి మిన్నకుండెను. అంతట తిరుక్కోటియూరినంబిగారు ఇద్దరను లేవనెత్తి, రామా నుజులను జూచి నేటినుండియు మీరు ఆచ్చాన్ సమర్పించిన తళిహ ప్రసాదమునే స్వీకరించుచుండుడని నియమించి వెడ లిపోయిరి,

## యజ్ఞమూర్తిని శిష్యునిగ జేసికొనుట

తరువాత, యజ్ఞమూర్తి యనెడి మాయావాది మహా విద్వాంసుడు గంగాస్నానమొనర్చి, యచ్చటి విద్వాంసుల నెల్ల జయించి, ఆశ్రమస్వీకార మొనర్చి అనేకులగు శిష్యుల నేర్పఱచుకొని, తాను వ్రాసిన తాటియాకుల గ్రంథములను బండ్లపై వెంటనిడుకొని రామానుజుల అతిశయమును విని శ్రీరంగమునకువచ్చి రామానుజులనుజూచి, నీతో వాదించ

వచ్చితిని రమ్మని పిలిచెను. అంతట రామానుజులును, ఓడి నచో నీవేమి జేతువని యడుగ, నాతడును, మీ పాదరక్షల నెత్తిన బెట్టుకొని మీ పేరు బెట్టుకొని మీ శిష్యుడనై మీ సిద్ధాన్తమున జేరుదునని దెల్పి; మీరోడినచో? యని యడుగ రామానుజులును గ్రన్థసన్యాస మొనర్చి ఓడితిమని యంగీక రింతుమనిరి. ఇట్లిరువురును ప్రతిజ్ఞలొనర్చి పదునెనిమిది దిన ములు అవధి యేర్పఱచుకొని సభాముఖముగ వాదన మొద లిడిరి. పదియారుదినము లొకరికొకరు తీసిపోక వాదించిరి. 17వ దినమున యజ్ఞమూర్తి యుక్తులు ప్రబలము కాగా రామానుజులు మిన్నకుండుటయు సూర్యాస్తమయమగు టచే నాటికి సభ చాలించుటయు నాయెను. నాటి సభలో తన ప్రబలయుక్తులకు యజ్ఞమూర్తి మిక్కిలి గర్వించి రామా నుజులనుజూచి రేపటిదినమున నాజయమును చాటింతును సుమా! యని హెచ్చరించి వెడలెను. రామానుజులును వ్యాకులాంతఃకరణులై మఠమునకేగి, తమ తిరువారాధన యగు వరదరాజుల సన్నిధిన దీపారోపణ మొనర్చి ప్రసా దము నారగింపుజేసి మంగళాశాసన మొనర్చి 'వరదరాజా! నమ్మాళ్వార్లు మొదలుగ ఆళవన్దారుల వరకూ నింతకాలము క్రమాగతముగ ప్రతిష్ఠింపబడిన నీ సిద్ధాన్తము నిప్పుడు చెడగొట్టుకొన దలచితివా? ఇంతదనుక నీ స్వరూప రూప గుణ విభూతులు సత్యములనెడి ప్రమాణముల ప్రవర్తింప జేసి యిప్పుడొక మాయావాదిని దెచ్చి నాకాలమున నావల

ననే ప్రమాణములనెల్ల చెడగొట్టుకొనుట నీకు వినోదమై నచో నట్లేయొనర్పు'మని ప్రసాదము స్వీకరింపక ముసుగు నిడుకొని పరుండిరి. నాటిరాత్రి వరదుడు కలలో తనను గన్పింపజేసి, ఉడైయవరే! మీరు ముసుగిడి పండుకొననేల? మీకొక సమర్థుడగు మీ యంతటి శిష్యునేర్పఱచుటకై యిట్లొనర్చితిని, మీ పరమాచార్యులగు యామునమునులు వ్రాసిన ''మాయావాదఖండన''మను గ్రంథముచే జయిం చుడని జెప్పెను. ఉడైయవర్లును వేకువన లేచి నిత్యానుష్ఠా నమెల్లదీర్చుకొని ప్రసన్నగంభీరులై తర్కగోష్ఠికి వేంచేయ; యజ్ఞమూర్తియు భావజ్ఞుడగుటచే ఉడైయవరుల ఉల్లాసమును జూచి, వీరియందు భగవదనుగ్రహముగా నిశ్చయించి శీఘ్ర ముగ లేచి యెదురేగి పాదములపైబడి, ఓడితినని యంగీక రించి, వీరి పాదరక్షలను (పాంకోళ్ళను) దీసికొని తలపైనిడు కొని దాసుని యనుగ్రహింపవలయునని ప్రార్థింప, ఉడైయ వర్లును, 'ఇదేమి వాదించవలదా?' యనగా, యజ్ఞమూర్తియు 'దేవరవారియందలి భగవదనుగ్రహమును గుర్తించితిని, మీసన్నిధిన నోరుదెరుచుటకు రాకున్నది' యన; ఉడైయవ ర్లును, మీరు జెప్పిన మాయావాదసిద్ధాన్తమున బ్రహ్మము నిర్గుణమనుటచేత, నా బ్రహ్మమునకు సత్యత్వాది గుణయో గమును జెప్పుచున్న వేదవాక్యములు అప్రమాణము లగును; అవిద్యచేత తిరోహితమైన (కప్పబడిన) బ్రహ్మము

నకు గుణయోగమున్న దనుట చేత సగుణశ్రుతులకు విరోధము లేదన్నచో, నదియును కుదురదు; ఎట్లన్నచో జ్ఞానరూపమగు పరబ్రహ్మను అజ్ఞానరూపమగు అవిద్య మరుగుపఱచిన దన్నచో నా యవిద్యకు నాశనము లేమగనుక నది నిత్యమగును, అగుటచే అవిద్యయనియు, బ్రహ్మమనియు రెండు వస్తువులుండుటచే అద్వైతమనెడి మహాగజము ద్వైతమనెడి లోతగు బురదలో (ఊబిలో) మునిగినది (కూరుకుపోయినది). కావున మీ వాదన నిలువదని దెల్ప; యజ్ఞమూర్తి సమ్మతించి, తనను శిష్యునిగా స్వీకరింపుడని ప్రార్థింప; ఉడైయవర్లును, మునుపు శిఖాయజ్ఞోపవీతముల త్యజించినందులకు ప్రాయశ్చిత్తముల జేయించి తిరిగి ఉపనీతులను జేసి శిఖాయజ్ఞోపవీతముల ధరింపజేసి, యాపై పంచసంస్కారపరుల నొనర్చి, యా తరువాత త్రిదణ్డకాషాయధారుల నొనర్చి యావదాయుష్యము (బ్రతికియున్నంతకాలము) మీరిట్లే యుండుడని నియమించి వరదరాజులొనర్చిన యుపకారస్మృతిగను, తమకు జ్ఞానపుత్రులగుటచేతను, నిరువురి పేర్లును కలిసి వచ్చునట్లు 'అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్' అని తిరునామమిడి, 'దేవరాజన్' అను వ్యవహారనామమిడి నమ్బెరుమాళ్ళను సేవింపజేసి తీర్థశఠకోప ప్రసాదముల ననుగ్రహింపజేసి, తమ తిరువారాధనమగు వరదరాజులను సేవింపజేసి తీర్థప్రసాదముల ననుగ్రహించి, వీరేసుమా మిమ్ములను మా వద్దకు జేర్చినదని దెల్పి, ఆళ్వారులెల్లగు

ననుగ్రహించిన నాలాయిర దివ్యప్రబన్ధములన్నెల్ల నధ్యయన మొనర్పజేసి స్వరూపగ్రంథములన్నిటిని దెలియబఱచి ఆశ్రితులెల్లరనుజూచి వీరిని మాతో సమానముగ జూచుకొనుడని నియమించి రామానుజులు దేవరాజునకు వేరుగ మఠము నేర్పఱచి యందుండ నియమించిరి.

ఆ తరువాతి కాలమున ఆచార్యులెల్లరును వచ్చి ఉడైయవరుల నాశ్రయించుటను విని అనన్దాళ్వానును, ఎచ్చానును, తొణ్డనూర్ నమ్బియును మరుతూర్ నంబియును ఉడైయవరుల నాశ్రయింపవలెనని రాగా, వారలను ఉడైయవర్లు, అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్ శ్రీపాదముల నాశ్రయింపజేయ; అందులకు దేవరాజన్ మిక్కిలి భీతిల్లి యాశ్రితులనుజూచి 'పిచుకమెడలో తాటికాయను కట్టినట్లు ఉడైయవరులొనర్చిరి, మీరు ఎమ్బెరుమానార్ల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండు'డని వారికి దెల్పిరి.

ఇట్లుండ నొకనాడు పశ్చిమదిశనుండి కొందరు శ్రీవైష్ణవులు శ్రీరంగము వచ్చి శ్రీరంగని సేవించి, ఎమ్బెరుమానార్ల మఠమెచ్చట?యనియడుగ, నచ్చటివారు ఏయెమ్బెరుమానార్ల మఠము గావలెననియడుగ యిచ్చట యెందరు ఎమ్బెరుమానార్లు కలరని వారడుగ, నచ్చటివారు ఉడైయవరులొకరు అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లొకరు కలరని జెప్పగా, నయినచో ఉడైయవరుల మఠమును జూపు

డని వారడిగిరి. ఈ విషయము దేవరాజన్ విని అయ్యో ఆచార్యుల కెదిరితట్టు ఐతినే యని వగచి, వెంటనే తన మతమునకు నిప్పుబెట్టి వచ్చి ఉడైయవరుల నాశ్రయించిరి. అంతట ఉడైయవరులును నా వృత్తాన్తమునెల్ల విని దయతో దేవరాజమునికి, తాము రచించిన నిత్యగ్రన్థమను పేరుగల భగవదారాధనక్రమము నుపదేశించి మీరున్నంతకాలమును మామతమునందలి దేవరాజప్పెరుమాళ్ళ నిత్యకైంకర్యమున నుండుడని యాజ్ఞాపించిరి.

అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లును ఆచార్యాజ్ఞానుగుణముగ కైంకర్యమొనర్చుచు ఆచార్యులకన్న పరదైవము లేదనియు ఆచార్యులే సాక్షాత్తుగ భగవదవతారమనియు దెలుపునట్టి సకలశాస్త్రసారమును జ్ఞానసారము ప్రమేయసారము లనెడి రెండు దివ్యప్రబన్ధములుగ రచించి తమ యాశ్రితుల కీవిషయమును బోధించుచు ఆచార్యసన్నిధిన సుఖముగ నుండిరి.

## అనంతాళ్వానుల ఆచార్యనిష్ఠ

ఒకనాడు ఉడైయవరులు తిరువాయ్మొళి కాలక్షేప మొనర్చుచు యెడబాపులేక కాలమంతయు తిరువేంగడము డైయానునకు కైంకర్యము జేయవలెననెడి శ్రీవేంకటేశుని వైభవమురాగా, తిరుమలకుపోయి నిత్యము స్వామికి పుష్ప

కైంకర్యమొనర్చు భాగ్యవంతులెవరో? యన; అనంతా ళ్వాన్లు లేచి దాసునికీ కైంకర్యమును లభింపజేయుడని ప్రార్థింప నుడైయవర్లు నట్లేయని యంగీకరించిరి. అంతట అనంతాళ్వాన్లు తిరుమల కేగి యొక పెద్ద పూదోట నేర్ప రచి దానికి రామానుజబృందావనమని పేరిడి శ్రీనివాసు నకు నిత్యము పుష్పతులశీమాలికల సమర్పించుచుండిరి,

అనంతాళ్వాన్లు పుష్పమంటపమున నొకనాడు మాలలు కట్టుచుండగా వేంకటేశుడు అర్చకముఖముగ అనం తాళ్వానే యని పిలిపించెను. అనంతాళ్వాన్లును 'అడియేన్' (దాసుడను)అని పలికిరి. ఇట్లు మూడు పర్యాయములు స్వామి పిలిచినను మూడు పర్యాయములును అనంతాళ్వా న్లును పలికిరేగాని పూలమాల కట్టుచు లేచి వెళ్ళరైరి. కొంతసేపైన తర్వాత పుష్పమాలను దీసికొని స్వామికి సమ ర్పింపుటకు వెళ్ళగా అనంతాళ్వానే మిమ్ము మూడు పర్యా యములు పిలిచితినిగదా యని స్వామియనగా, మూడు పర్యాయములును పలికితినిగదాయని అనంతాళ్వాన్లు సమా ధానమిచ్చిరి. పిలిచినవెంటనే రాక యిపుడేల వచ్చితిరనగా, పుష్పమాల కట్టుట పూర్తియైనది, దానిని నీకు సమర్పించు టకు వచ్చితిననిరి. మాలను సమర్పించుటవలన మీకేమి ప్రయోజనమని స్వామియడిగెను. అలంకారప్రియుడవుగాన నీవు సంతసింతువని అనంతాళ్వాన్లు జెప్పిరి. అందులకు స్వామి

'నేను ప్రీతుడనై మీకు కావలసిన మోక్షము నిత్తునని యే గదా మీయభిప్రాయము; పిలువగనే వచ్చినచో ప్రీతుడన గుదునా? లేక రాకున్న ప్రీతుడనగుదునా?' యనెను. అదివిన్న అనంతార్యాన్లు వెంటనే యిట్లనిరి, 'స్వామీ మా ఆచార్యులగు రామానుజులు, నీకు ప్రీతికరముగ పుష్ప మాలా సమర్పణ మొనర్పుమని యాజ్ఞాపించిరి, అందులకు తగినట్లుగనే పుష్పవనమును నిర్మించి నిత్యమును నీకు మాలలు రచించి సమర్పించుచుంటిని, నీవు పిలువగనే వచ్చి యున్నచో పుష్పములు వాడిపోయెడివి, వాడిన పుష్పము లను మాలకట్టి నీకు సమర్పింపవలసి యుండెడిది. వాడిన పూమాలను నీకు సమర్పించుటచే నీ ముఖము వికసించెడిది కాదు, దానిచే మా ఆచార్యుని యాజ్ఞను నెరవేర్చుట కూడెడిది కాదు; ఇక మోక్షమందువా? అది నీచేతిలో లేదు కదా? ''పాపిష్ఠః క్షత్రబన్ధుశ్చ। పుణ్డరీకశ్చ పుణ్యకృత్।
ఆచార్యవత్తయా ముక్తౌ। తస్మాదాచార్యవాన్ భవేత్॥''
పాపాత్ముడగు క్షత్రబన్ధువును, పుణ్యాత్ముడగు పుణ్డరీకు డును ఆచార్యుల నాశ్రయించి వారివారి పాపపుణ్యము లతో సంబంధములేక ఆచార్యుని యనుగ్రహముచేతనే మోక్షమును బొందిరని శాస్త్రప్రసిద్ధముగాన మోక్షము ఆచార్యాధీనమై యుండుటచేత నందులకై నిన్నాశ్రయింప బనిలేదు, ఆచార్యప్రీతికై వారి యాజ్ఞానుగుణముగ నీకు మాలాసమర్పణ మొనర్చుచుంటి నంతియే'' యని సమా

ధానము జెప్పిరి. వేంకటేశుడును వీరి ఆచార్యనిష్ఠకు మిక్కిలి సంతసించి తీర్థ శఠకోప ప్రసాదములనిప్పించి ప్రీతుడాయెను.

## పరిత్తుక్కొల్లినాయ్చ్చియార్ వైభవము

తిరుమలలో అనంతాళ్వాన్లు శ్రీవేంకటేశ్వరుని పుష్పకైంకర్యము మిక్కిలి ప్రీతితో చేయుచుండిరని వినిన రామానుజులు ప్రత్యక్షముగ సేవింప తిరుమల కేగనెంచి శ్రీరంగనాథుని యాజ్ఞను బడసి శ్రీరంగమునుండి తమ శిష్యబృందముతో ప్రయాణమై మార్గమధ్యమున అష్టసహస్రమను గ్రామమును జేరిరి. ఆ గ్రామమున కార్పాసారామ వరదాచార్యులు యజ్ఞేశులను నిద్దరు బ్రాహ్మణోత్తములు రామానుజులకు శిష్యులై యుండిరి. వారిలో వరదాచార్యులు బహుబీదవారు, యజ్ఞేశులు మిక్కిలి సంపన్నులునై యుండిరి. తమ పరివారమునకెల్ల నాతిథ్యమీయగల సమర్థులు యజ్ఞేశులగుటచే రామానుజులు తమవద్దనున్న శిష్యుల నిరువురను తమరాక తెలుపుటకై యజ్ఞేశులవద్దకు పంపిరి. వారిరువురును యజ్ఞేశులకీ వృత్తాంతమును దెలియబఱచిరి. ఆతడును, సపరివారులగు తన ఆచార్యులకై వస్తుసామగ్రిని సంపాదించు యోజనలోనుండి వచ్చినవారి నాదరించకుండెను. ఆశిష్యులిద్దరును నిరాశచేమరలివచ్చి యావృత్తాంతమును రామానుజుల కెఱింగించిరి.

రామానుజులును యజ్ఞేశునియందలి మనస్సును మరలించుకొని శిష్యసమేతముగ దరిద్రులగు వరదార్యుల యింటి కేగి వరదార్యులెచ్చట నుండిరని పిలిచిరి. ఆసమయమునకు వరదార్యులు భిక్షాటనమునకై గ్రామాంతర మేగియుండిరి. వరదార్యుల భార్యయగు కార్పాసారామలక్ష్మి (పరిత్తి క్కొల్లినాచ్చియార్) యతిరాజుల కంఠధ్వనిని గుర్తుపట్టిన దయ్యు, జీర్ణవస్త్రమును ధరించుటచే మాట్లాడతగదని మిన్నకుండియు పలుకకున్నచో, ననాదరించినట్లగుటచే మరలి పోవుదురేమో యనెడి భీతిచే చప్పట్లు చరిచెను. పండితులగు రామానుజులును నామె యభిప్రాయమును గుర్తించి, తమ తలకు చుట్టుకొనిన వస్త్రమును ఇంటిలోనికి విసరివైచిరి. కార్పాసలక్ష్మియు నా వస్త్రమును ధరించి తలుపుతీసి వచ్చి యాచార్యులకు నమస్కరించి అర్ఘ్యపాద్యాదుల నర్పించి విశ్రమింపజేసి, యిట్లు విచారించెను.

'మేము జేసిన పూర్వపుణ్యవిశేషమేమియో యెఱుగము, సాక్షాత్తుగ విష్ణ్వంశసంభూతులును యతులును ఆచార్యులునగువారు మా బీదతనమేని జూడక వెదకుకొనుచు మా యింటి కేతెంచిరి. శరీరమును ప్రాణములను ధనమును నివాసమును వస్త్రములను కర్మలను గుణములను ప్రాణములను ఆచార్యకైంకర్యమునకై ధరించియున్నవారే శిష్యులనియు, నట్లుగానివారు శిష్యులుగారనియు, నట్టివారికి

మోక్షప్రాప్తి లేదనియు, శాస్త్రములందు జెప్పబడియున్నది. శిష్యసమేతముగ వచ్చినవారికి నాతిథ్యమిచ్చుటకన్న నుత్కృష్టధర్మములేదు, నాభర్త భైక్ష్యమున కేగియుండెను. యాతడెప్పటికి వచ్చునో? తెలియదు, వచ్చినను బిక్షాటనముచే వచ్చెడి స్వల్పద్రవ్యము వీరికేమగును? ఆచార్య ప్రీతికై చేసెడి చెడ్డపనియైనను మంచియేయగునని శాస్త్రములు ఘోషించుచున్నవి, పూర్వము తిరుమంగైయాళ్వార్లు తదీయారాధనకై దొంగతనమాచరించినను, భగవానుడు ప్రీతుడై మోక్షమిచ్చెనని ప్రసిద్ధిగలదు. మానవులు సంసారచక్రమున తమ కర్మానుగుణముగ పుట్టుచు చచ్చుచు తిరుగుచుండ ఆచార్యులు జ్ఞానోపదేశముచే ముక్తినిచ్చుచున్నారు, భగవానుని, యాతని పరమపదమును లభింపజేయు నాచార్యుని ఋణముదీర్చుకొనవలెనన్న, మరి వొక భగవంతుడుండి యాతనికి మరివొక విభూతిద్వయమునున్నచో ప్రతిక్రియగ సమర్పించి వారి ఋణము దీర్చుకొనగల్గుట యగును, కాని భగవానుడొకడే యగుటచేతను ఉభయవిభూతులును వేరుగా లేకపోవుటచేతను ఆచార్యఋణము తీర్చగల్గుట లేనేలేదు. ఐనను శక్తికి తగినట్లు వారికిష్టమగు కైంకర్యమొనర్చి వారికి ముఖప్రీతిని గల్గించుటకన్న ఉత్తమపురుషార్థము వేరొకటిలేదు, భగవంతునికొఱకును ఆచార్యునికొఱకును చేసిన పాపకార్యమైనను, పుణ్యమేయగును. అట్లు కానివిధముగ జేసిన పుణ్య

కార్యమైనను పాపకార్యమేయగును, ఆచార్యముఖోల్లాసమే సకలఫలప్రదము, అట్లుకాని కర్మలెల్ల నిష్ఫలములు, కావున శరీరము నమ్మిన నయినను సపరివారులగు నాచార్యులను ఆదరింపవలెను, ఈ గ్రామమున ధనవంతుడగు వైశ్యుడొకడు నా సౌందర్య యౌవనముల నపేక్షించుచుండెను గదా! ఆతనికీ మలపూరిత శరీరము నర్పించైనను ధనమునుదెచ్చి పూజ్యులగు నాచార్యులను భాగవతులను నారాధింతున'ని నిశ్చయించి, రామానుజులను జూచి 'మీరిచ్చటనే వేంచేసియుండుడు, శీఘ్రముగ మీకు వలయు సంభారముల గూర్తున'ని జెప్పి, చిరునగవు మోముతో నా వైశ్యుని యింటికేగి మా యాచార్యులు శిష్యసమేతముగ విచ్చేసిరి, వారికి వలయు సకలపదార్థములను శీఘ్రముగ సమకూర్చుము, నేటిరాత్రికి నీ యభీష్టము దీర్తునని జెప్పెను.

అందుల కాతడు, ఆశ్చర్యము, ఆనందము నొకేమారు గలుగ నిట్లాలోచించెను. "ఏమిది ఆశ్చర్యముగ నున్నదే! కలయా లేక నిజమా? వెనుక నెప్పుడేని పలుకరించినను మాట్లాడెడిది కాదు, తలయెత్తియేని జూచెడిదిగాదు, అనేకమార్లు ఆమె యింటికి నూతనవస్త్రములు ఆభరణములు బంపినను త్రిప్పిపంపివైచెడిది, నేడు నా అదృష్టవశముచే ద్వారములన్నియును దాటి పడకగదివరకునువచ్చి తన యానుకూల్యమును దెల్పుచున్నది, యిక నాలసింప

రాద''ని వెంటనే నౌకరులను బిలిచి బండ్లకొలది పదార్థము లనెల్ల యామె వెంటబంపెను.

కార్పాసారామలక్ష్మియు నా పదార్థములనెల్ల దోడ్తెచ్చి రామానుజులకు సమర్పింప, వారును నామె యొక్క ప్రజ్ఞను, సత్స్వభావమును, భక్తిని, జ్ఞానమును, వినయమును జూచి, యామెనే శుచిగను రుచిగను భగవదారాధనమునకు వంటజేయుమని యాజ్ఞాపించి, కొందరు శిష్యుల నున్ను నియోగించి తాము స్నానమాచరించి ద్వాదశోర్ధ్వపుండ్రముల ధరించి భగవదారాధనానంతర మెల్లరతోగూడి ప్రసాదస్వీకార మొనర్చి సుఖాసనాసీనులై యాశ్రితులకు మహార్థముల వ్యాఖ్యానించుచుండిరి

వరదార్యుడును నింటికేతెంచి తన భార్యవలన జరిగిన దెల్ల నెరిగి, పరమానందముతో భార్యనుజూచి, నీవు బాలికవైనను నీ బుద్ధి చాల గొప్పది, నీవు నాకు భార్యవగుట నా జన్మాంతర సుకృతవిశేషమే, నేటి నీ చేష్టచే మా పితృపితామహులెల్లరును తరించిరనుటలో సందియములేదని మెచ్చుకొని, భార్యతోగూడి ఆచార్యుల పాదప్రక్షాళన మొనర్చి శ్రీపాదతీర్థమును గ్రోలి వారారగించిన పదార్థమును వారియాజ్ఞతో స్వీకరించి సంతసించెను. రామానుజులును నా దంపతుల మనసులొకటిగ నుండుటకు మిక్కిలి సంతసించి శిష్యులతోగూడి యా దంపతులచే పూజింపబడుచు నచ్చటనే యుండిరి.

## ఆచార్య తీర్థ, ప్రసాద వైభవము

కార్పాసారామలక్ష్మియు చీకటి పడగనే ఆచార్య శేషప్రసాదమును గొని భర్తను వెంటనిడుకొని వైశ్యునింటికేగి వాకిటనే భర్తనుండ ప్రార్థించి, తాను లోన కేగి యా వైశ్యునకు తీర్థప్రసాదముల నిచ్చెను. ఆచార్య పాదోదక తళిహప్రసాదముల స్వీకరించుటచే నా దుష్టబుద్ధియగు వైశ్యునకు గొప్పవివేకము గలిగి, యామెకు ప్రదక్షిణ నమస్కారము లొనర్చి చేతులు జోడించి ఓమహాపతివ్రతా! నీవు నాకు తల్లివి, నీభర్త నాకు తండ్రి, యిందు సందేహము లేదు, నా యజ్ఞానమును దుర్బుద్ధిని పోగొట్టిన మీారే, మీా ఆచార్యుల పాదపద్మముల నాశ్రయింపజేసి గాపాడుడని ప్రార్థింప, నామెయు నాతనిని తనభర్తను సేవింపజేయ నాదంపతులు ఈతనిని దీసికొనిపోయి ఆచార్యుల నాశ్రయింపజేయ రామానుజులును దయతో వానికి పంచసంస్కారముల గృపజేసి శిష్యునిగా జేసికొనిరి.

## యజ్ఞేశుని పశ్చాత్తాపము

ఆచ్చాన్ అనెడి ద్రవిడ నామముగల యజ్ఞేశుడును తన ఆచార్యులగు రామానుజులు శిష్యసమేతముగ వరదార్యునింట భగవద్గుణానుభవ మొనర్చుచు వేంచేసియుండిరని దెలిసి వారు తన యింటికి రాకపోదురా? యనెడి భావముతో

గృహమెల్ల నలంకరింపజేసి బంధువులనెల్ల రప్పించుకొని ఆచార్యుని రాకకై యెదురుజూచుచుండెను. ఎంతదనుకను రామానుజులు రాకుండుటచే యజ్ఞేశుడే వరదార్యుల యింటికేతెంచి వారిని సేవించి మిక్కిలి దుఃఖించుచు వారి పాదములపై బడెను. రామానుజులు యజ్ఞేశుని లేవనెత్తి నాయనా! నీకొక హితవాక్యమును జెప్పెదను వినుము. పంచసంస్కారముల చేయించుకొనుటయు శ్రీమహాభాగవతార్చనయు నాచార్యాధీనవృత్తియు అర్థపంచకజ్ఞానము నెఱుగుటయు, తదీయానువర్తనమును వైష్ణవప్రవృత్తికి పరమధర్మములు. అందును భాగవత తదీయారాధనమునందు నిష్ఠగలిగియుండుము, దంభార్థము ధర్మముల నాచరింపకుము, సాత్వికదానచే భగవదర్పితమగునని దెల్పిరి.

## విఠలదేవరాయల ఆశ్రయణము

అచ్చటనుండి కంచికేగి వరదుని సేవించి కాంచీపూర్ణులచే సాగనంపబడి వేంకటాచలము జేరి, కొండనెక్కు మార్గమున క్రిందగనున్న దివ్యసూరితీర్థమనియు ఆళ్వార్లతీర్థమనియు ప్రసిద్ధినొందిన కపిలతీర్థమున పదుగురాళ్వార్లకు భక్తితో నమస్కరించి యచ్చటనున్న కాలమున నా దేశమునేలు రాజగు విఠలదేవరాయలు రామానుజుల వైభవమును విని వచ్చి వారిని సేవించి వారిచే పంచసంస్కారపరుడై ఆచార్యకైంకర్యముగ యతిరాజులకు చాల

ధనమును సమర్పింప వారును నా ద్రవ్యముతో నాశ్రితు లగు ముప్పదిమంది శ్రీవైష్ణవుల కిండ్లు గట్టించి 'ఇళమంఙియ'మనెడి పేరుగల నగ్రహార మేర్పఱచి వారికిచ్చిరి.

## శ్రీనివాసుని సందర్శనము

అంతట శ్రీనివాసునికి పుష్పకైంకర్యమొనర్చుచున్న అనంతాళ్వాన్లు, కొందరు వైష్ణవులతో కలిసి యతిరాజులను సేవించి కొండపైకి వచ్చి వేంకటేశునకు మంగళాశాసనము నర్పవలసినదిగా ప్రార్థింప; యతిరాజులును ఆదిశేషుడే శైల రూపమును ధరించియుండుటచే శేషుని త్రొక్కగూడదని పదుగురాళ్వార్లును కొండనెక్కక క్రిందనేయుండి స్వామిని సేవించిరిగాన వారున్న ప్రదేశమునకు ఆళ్వార్లతీర్థమని పేరు గల్గినది, కావున ఆళ్వార్లు చేయని పనిని మేమును చేయ గూడదు గనుక కొండనెక్కమనిరి. అదివినిన అనంతాళ్వాన్లు అయ్యో! మీరిట్లు జేసినచో మీయాశ్రితులెల్లరును నిట్లేజేయుదురు గాన వేంకటేశునకు భాగవత మంగళాశాసనము లేకపోవునని ప్రార్థింప, రామానుజులు సమ్మతించి పాదములతో త్రొక్కక మోకాళ్ళకు దిండ్లు గట్టుకొని మోకాళ్ళతో నడచుచు కొండనెక్క మొదలిడిరి. అందుచే నేటికిని ఆ ప్రాంతమునకు మోకాళ్ళపర్వతమను ప్రసిద్ధి యేర్పడినది.

ఇట్లు రామానుజులు కొండపైకి వచ్చుచుండిరని తెలిసిన శ్రీశైలపూర్ణులు (పెరియతిరుమలనంబిగారు) వేంకటేశుని తీర్థప్రసాదములను పళ్ళెరములో నుంచుకొని తెచ్చి మార్గమధ్యమున యతిరాజులకీయ వారపి భక్తితో స్వీకరించి, అయ్యో! వీనిని మీరేల తెచ్చిరి? ఏబాలునితోనైన పంపరాదా? యన, నంబిగారును తిరుమలలోని నాల్గువీధులందు వెదకినను, నాకన్న బాలుడగువా డెచ్చటను కనిపించలేదని చెప్పగా, వారి నైచ్యానుసన్ధానమునకు రామానుజులు మిక్కిలి అచ్చెరువందిరి. రామానుజులట్లు ప్రసాదస్వీకార మొనర్చి పారవైచిన మామిడిటెంక మహావృక్షమై నేటికిని కాలిబాటన కొండనెక్కువారికి దర్శనమిచ్చుననియు, ప్రపన్నులామార్గమున పయనించువా రిప్పటికిని రామానుజుల విగ్రహమును సేవించి వారి భుక్తశేషముగా నాచెట్టున ఆకునేని నోటవైచుకొందురనియు ప్రసిద్ధి.

రామానుజులును, పర్వతవాసులగు నితరవైష్ణవులును యతులును అర్చకులును సత్యాదరముతో నెదురురాగా వారలతోగూడి తిరుమలను జేరి నాల్గు వీధులకును ప్రదక్షిణించి యచ్చటి గోపుర విమాన మంటప ప్రాసాదముల జూచి అచ్చెరువొంది అనంతార్య నిర్మితమగు బృందావనమును జూచి సంతృప్తులై, స్వామి పుష్కరిణీతీర్థమును స్వీకరించి కులశేఖర సోపానము దాటి బలి పీఠమునకు నమ

స్కరించి యామున పుష్పమంటపమునకు ప్రదక్షిణించి, వంటయింటిని యాగశాలను శ్రీమణిమంటపమును సేవించి, విష్వక్సేనాదులకు వందనమిడి ఆనందనిలయ విమానమును జూచి సంతసించి, ఆనందబాష్పములతో లోనకు ప్రవేశించి దేవాధిదేవుడగు శ్రీవేంకటేశ్వరునకు నమస్కరించి భక్తితో తీర్థ శఠకోప ప్రసాదముల గొని, యిచ్చటనుండు జనులును పశు పక్షి మృగ తరు లతా గుల్మములెల్ల నిత్య సూరులుగ దలచి వారలతో సమముగ తామచట నుండతగ మను భావనచే కొండ దిగిపోవలెననుకొనిరి. అంతట శ్రీశైల పూర్ణులు వచ్చి యతీశ్వరా! దివ్యదేశమున మూడురోజు లైన నుండవలెనుగదా యన, నట్లె యని, నాల్గవనాడు వేంక టేశుని సన్నిధిన పెరియాళ్వార్ల దివ్యప్రబన్ధమగు తిరుప్ప ల్లాణ్డు పన్నెండు పాశురములను విన్నవింప, వేంకటాచల పతియు మిక్కిలి ప్రీతుడై, యతిరాజా! నీకును నీవారికిని నిత్యవిభూతి లీలావిభూతులు రెండును నిచ్చితినని దక్షిణ మున (శ్రీరంగమున) జెప్పితిమిగదా! అది ముమ్మాటికిని సత్యమే, యన యతిశ్రేష్ఠులును ధన్యుడనైతినని స్వామి యంగీకారమును బడసి కొండదిగి క్రిందదగు తిరుపతిని జేరి, శ్రీశైలపూర్ణుల యింటనుండి సంవత్సరకాలము శ్రీరామా యణార్థముల నెల్ల, వారివలన కాలక్షేపమొనర్చుచు నుండిరి.

# గోవిందభట్టరు ఆచార్యనిష్ఠ

గోవిందభట్టరు, శ్రీశైలపూర్ణులకు సకలవిధ కైంకర్యములనొనర్చుచున్న కాలమున, నొకనాడు ఆచార్యులకై ప్రక్కనేర్పఱచి దానిపై తాను పరుండి దొర్లి లేచెను. దీనిని యెవ్వరుమానార్లు జూచి యిదేమి దుర్గుణమని శ్రీశైలపూర్ణులకు దెల్పిరి. నంబియు, గోవిందుని బిలిచి 'నీవు నాకొఱకేర్పఱచిన ప్రక్కపై దొర్లితివని వింటిని, అట్లు చేయవచ్చునా? దీనికేమి ఫలము?' అని యడిగిరి. గోవిందుడును, నాకు నరకమే ఫలమనిదెల్పెను. అంతట నంబియు తెలిసియు నిట్లేల జేసితివనియడుగ, గోవిందుడును దేవరవారికి ప్రక్కపై ఒత్తుకొనక సుఖముగ నిద్రపట్టిన నంతేచాలును, దాసునకు నరకమైనను ఫరవాలేదని సమాధానము జెప్పెను. అది వినిన ఉడైయవర్లును గోవిందుని యొక్క ఆచార్యప్రతిపత్తికి సంతసించిరి.

మరియొకనాడు నంబిగారియొక్క నందనవనమును చూచుచు ఉడైయవర్లు వచ్చుచుండగా, నొకచోట గోవిందుడు పామునోట చేయినిడి, మరల స్నానమాచరించి కైంకర్యమునకు పోవుచుండగా, నదిజూచి రామానుజులు, గోవిందా! యేమి జేసితివి? యని యడుగగ; గోవిందుడును నొకసర్పము కప్పకై నాల్కజాచగా పొదలోనిముల్లు దాని

నాలుకకు గ్రుచ్చుకొని బాధపడుచుండుటను జూచి, ముల్లునుదీసి స్నానమాచరించితినని చెప్పెను. ఉడైయవర్లును గోవిందుని జూచి యీ పాము కఱచియున్నచో నేమిజేసి యుందువని యడుగ; గోవిందు డందులకు, ద్వయమంత్రమే బలమైనదగుచో పుష్కరిణిలో స్నానమాడి వేంకటేశ్వరుని కైంకర్యమొనర్తును; పామువిషమే బలమైనచో విరజలో స్నానమాడి పరమపదమున కైంకర్యమొనర్తునని జెప్పెను. అది వినిన రామానుజులును గోవిందుని మంత్రవిశ్వాస పూర్తికి భూతదయకు మిక్కిలి సంతసించిరి.

అనంతరము రామానుజులును శ్రీరామాయణమును పూర్తిజేసికొని తిరుమలనంబిగారికి దండమిడి, శ్రీరంగమున కేగ నాజ్ఞయిండని ప్రార్థింప, నంబిగారును మీరింతదూరము వచ్చి దాసునివద్ద శ్రీరామాయణము వినినందుల కేదేని కోరుకొనుడని యన; రామానుజులును నయినచో గోవిన్దుని నా కిండని కోరిరి. నమ్బి గోవిందుని పిలిచి 'గోవిందా! నేటి నుండియు నెమ్బెరుమానార్లను నావలెనే సేవించుకొనుమని' యుదకధారాపూర్వకముగా నొసగిరి. (దీనిచే శిష్యుడు ఆచార్యునకు క్రయవిక్రయార్హుడని తెలియదగును. అనగా, అమ్మిన అమ్ముడు పోవుటయు, కొనిన కొనబడుటయేగాని శిష్యునకు స్వతంత్రత లేదని యర్థము.)

ఉడైయవరులును గోవిందుని గూర్చుకొని, నంబి

గారికి దండమిడి, తిరుపతినుండి ప్రయాణమై ఘటికాచల మేగి యచ్చట (చోళంగిపురమున) నున్న నృసింహుని సేవించి, తిరుపుట్కుళి (తిరువళ్ళూరు)న గృధ్రపుష్కరిణిలో స్నానమాడి విజయరాఘవుని సేవించి, కంచికేతెంచి తిరువెఃకా మొదలగు పదునెనిమిది దివ్యదేశములను సేవించి, తిరుకచ్చినంబిగారి సన్నిధిని జేరిరి.

గోవిందమిశ్రులు తమ ఆచార్యులగు శ్రీశైలపూర్ణులను విడిచి వచ్చినది మొదలు రోజురోజునకు కృశింప నారంభించిరి. అది చూచిన రామానుజులు, ఇరువురు వైష్ణవులను తోడిచ్చి గోవిందులను తిరుమలనంబిగారి వద్దకు పంపిరి. గోవిందుడును తిరుపతికేగి నంబిగారి వాకిట దండము సమర్పించి నిలువగా నచ్చటివారు జూచి తిరుమలనంబిగారికి విషయముదెల్పగా, వారును 'ఆ చపలచిత్తుని పొమ్మనుడు' అనిరి. అది వినిన నంబిగారి భార్య, 'ఇంతదూరము శ్రమపడి వచ్చిన గోవిందుల నాదరించి శ్రీపాదతీర్థమిచ్చి తళిహ ప్రసాదము ననుగ్రహింపరాదా' యన; నంబిగారును 'అమ్ముడుపోయిన పశువునకు గడ్డివేయువారుందురా?' యని కఠినముగ పలుక గోవిందుడును నిరాశుడై తనతోవచ్చిన వైష్ణవులతోగూడి తిరిగి కంచికేతెంచి రామానుజుల సేవింప, రామానుజులు గోవిందుని అత్యాదరముతో దగ్గరకు దీసికొని యాదరించి కంచినుండి శిష్యసమేతముగ శ్రీరంగము

జేరి శ్రీరంగనాథుని సేవించి తీర్థ శఠకోప ప్రసాదముల స్వీకరించి తమ మఠమునకు వేంచేసిరి.

గోవిందునకు, నిత్యము రామానుజుల గోష్ఠియందలి యనుభవమును, వారి రూపమును సేవించుటయును వారి సల్లాపములం దాసక్తియు, వారికైంకర్యమే నిద్రాలస్యములు లేక జరుగుచుండగా, నొకనాడు ఉడైయవరులు స్వాములతో గోష్ఠిగ వేంచేసియుండగా స్వాములెల్లరును గోవిందునియొక్క జ్ఞాన భక్తి వైరాగ్యములను ఆచార్య నిష్ఠను ప్రశంసించుచుండిరి. అది వినిన గోవిందుడును 'అవున వున'ని వారలకంటెను తనను తానే మిక్కిలి కొనియాడు కొనుచుండ నది జూచిన రామానుజులు, గోవిందా! అందరును నిన్ను కీర్తించుచుండగా నీవు నైచ్యానుసంధానము చేసికొనవలెగాని నిన్ను నీవే పొగడుకొనుచుంటివేమి? యిది స్వరూపమునకు తగునా? యని యడిగిరి. అందులకు గోవిందుడు రామానుజుల జూచి, అయ్యో! క్షుద్ర దేవత నాశ్రయించి చెడిపోయెడి నన్ను దిద్దుబాటొనర్చ జేసి పెద్దలముందు నిలుచునట్లు జేసిన దేవరవారి ప్రశంసయే వారలు చేయునదిగాన నందుకు నా సమ్మతిని దెల్పితినంతియే యన, నది వినిన ఎమ్బెరుమానార్లు, గోవిందుని ప్రశంసించి కౌగలించుకొనిరి.

ఒకనాడు గోవిందు డొకవేశ్య వాకిట, కాలకృత్యములనున్ను విడిచి నిల్చియుండగా, నొక శ్రీవైష్ణవుడది జూచి

రామానుజులకు దెల్పెను. అంతట రామానుజులు గోవిందులను బిలిపించి, 'నీ వచ్చుట నెందులకు నిల్చితివ'ని యడిగిరి. గోవిందుడును, వేశ్యగృహమున దేవరవారి తాలాట్టును (జోలపాటయు) గుణగణములును నృత్తగీత వాద్యములతో చెవులకింపుకాగా వినుచు నుంటినని సమాధానము జెప్పెను. రామానుజులును, నిరంతరము తన రూప గుణములనే యనుసంధించుచు తన్మయులైన గోవిందుని నిష్ఠకు మిక్కిలి సంతసించిరి.

## గోవిందుని వైరాగ్యము, సన్యాసస్వీకారము

గోవిందుడు, చీకటియు నొంటరితనము నెఱుగక నిరంతరము రామానుజులనే త్రికరణములచేతను ననుభవించుచు ప్రొద్దుజరుపుకొనుచుండగా, నొకనాడు గోవిందుని తల్లివచ్చి "గోవిందా! నీ భార్య ఋతుమతియాయె"నని దెల్ప, గోవిందుడు విని యూరకుండెను. అంతట నామె యా విషయమును యతిరాజులకు దెల్పెను. రామానుజులు గోవిందుల బిలిచి 'గోవిందా! నీభార్య రజస్వలయైనదట, నీవు మామగారింటికేగి చీకటిన నేకాంతమున శుభకార్యము నిర్వర్తించుకొని రమ్మ'ని యాజ్ఞాపించి పంపిరి. గోవిందుడు ఆచార్యాజ్ఞానుగుణముగ నత్తవారింటికేగి, యుపోసనాదుల నిర్వర్తించి నాటిరాత్రియందు భార్యతోగదిలోనికి పంపబడి, తెల్లవారువరకును నామెకు జ్ఞాన భక్తి వైరాగ్యములను

గూర్చి యుపదేశించుచు కాలక్షేపమొనర్చెను. గోవిందుని భార్యయు వీరికి భార్యనై తినింతియేజాలునని తల్లికి దెల్పెను. నాల్గవనాటి యుదయముననే గోవిందుడు స్నానాద్యనుష్ఠానముల నొనర్చుకొని శ్రీరంగమున నాచార్యసన్నిధి కేతెంచెను.

గోవిందుని మామగారు ఈ విషయము రామానుజులకు దెల్పగా, వారు గోవిందుని బిల్చి యిట్లేల జేసితివని యడిగిరి. అందులకు గోవిందుడు 'స్వామీ దేవరవారు యేకాంతమున చీకటియందు భార్యతోగూడుమనిగదా? యాజ్ఞాపించిరి. తెల్లవార్లును దేవరవారి దివ్యమంగళవిగ్రహామే నా కనుల యెదుట ప్రకాశించుచుండ చీకటియు నేకాంతమును నెచ్చటివి? కావున నట్లొనర్చితి'నని జెప్పెను. అందులకు వారు గోవిందా! నీకింతటి విషయాన్తర విరక్తి యున్నచో "అనాశ్రమీ నసన్తిష్ఠేత్" (బ్రహ్మచర్య గార్హస్థ వానప్రస్థ సన్యాసములను నాల్గు ఆశ్రమములలో నేదోయొకదానియందుండవలెనేగాని యే యాశ్రమము లేకుండ నుండరాదు) అను శాస్త్రవచనము నీవెరుగుదువు గదా! యనిరి. అందులకు గోవిన్దుడు దాసునకు సన్యాసాశ్రమము ప్రసాదింపవలయునని విన్నవింప, ఉడైయవరులు వానికి త్రిదణ్డకాషాయాదుల ననుగ్రహించి తమ పేరులోని మొదటి చివరి అక్షరములను కలిపి "ఎంబార్" అను పేరిడి యనుగ్రహించిరి.

## శ్రీభాష్యాది గ్రంథముల రచించుట

అంతట రామానుజులు, యామునాచార్యులవారి చరమ దశయందు వాగ్దానమొనర్చిన విధముగ బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానము వ్రాయదలచిరి. అది వ్రాయవలెనన్న వ్యాసులవారి శిష్యులగు బోధాయనులు వారి ఆచార్యులు ఉపదేశించునప్పుడు వ్రాసికొనిన వివరణమగు "బోధాయన వృత్తి" యనబడు గ్రన్థము జూడవలసి వచ్చెను. ఆగ్రన్థము కాశ్మీరు దేశమునగల సరస్వతీ పుస్తక భాండారమున వ్రాత ప్రతిగ కలదు. దానిని జూచుటకై రామానుజులు, తమ కత్యంత ప్రియశిష్యులును సమర్థులునగు కూరత్తాళ్వాన్, ముదలియాండాన్, అరుళాళ ప్పెరుమాళెమ్బెరుమానార్ మొదలగు శిష్యులతోఁగూడి కాశ్మీర్ దేశమునగల శారదా పీఠమునకు జేరి యా గ్రన్థమును పరికింప నది యిరువదివేల సూత్రవృత్తులు గలదియై యుండెను. రామానుజులు దానిని వెంట దీసికొనిపోవ నెంచిరిగాని యచ్చటి యధికారులు, వ్రాసుకొనుటకుగాని తీసుకొనిపోవుటకుగాని యంగీకరింపక యిచ్చటనే జూచుకొనుడని చెప్పిరి. అందుచే చేయునదిలేక రామానుజులు శిష్యసమేతముగ తిరుగుప్రయాణమైరి. మార్గమధ్యమున రామానుజులు గ్రన్థము దెచ్చుకొనుటకు వీలుపడనందులకు చింతించుచుండుటను జూచిన కూరత్తాళ్వానులు, స్వామీ! గ్రన్థము మనతోనే యున్నది, విచా

రింపకుడనెను. అందుల కాశ్చర్యపడిన యుడైయవరులు అదెట్లు? అనిరి. అందులకు ఆళ్వాన్, గ్రంథమంతయు నొకమారు పరిశీలించితిని, ఏ పేజీలో నేమున్నదో చెప్పగలననిరి. ఆళ్వానులయొక్క సూక్ష్మగ్రాహిత్వమునకు రామానుజులు మిక్కిలి సంతసించి శ్రీరంగమునకు జేరిరి.

ఆతరువాత నొకమంచి ముహూర్త దినమున శ్రీరంగనాధుని యాజ్ఞబడసి రామానుజులు శ్రీ భాష్యమును ప్రారంభించి, కూరేశులను జూచి నేజెప్పునదంతయు మీరు వ్రాయుచుండుడు, ఎచ్చటనేని బోధాయనవృత్తి విరుద్ధముగ నున్నచో వ్రాయక మిన్నకుండుడని దెల్పిరి.

ఒకనాటి గ్రన్థరచనమునందు రామానుజులు జీవాత్మ స్వరూపము దెల్పుచు, 'దాస్యముతో కూడిన జ్ఞానమా?, జ్ఞానముతోగూడిన దాస్యమా? ప్రధానము'ను విషయమున, దాస్యముతోగూడిన జ్ఞానమేయని జ్ఞానమునకు ప్రాధాన్యము వచ్చునట్లు దెల్పిరి. అది వినిన ఆళ్వాన్ వ్రాయక మిన్నకుండిరి. నాటికి రచనము ఆగిపోయెను. ఆ మరునాడు రామానుజులు జ్ఞానముతోగూడిన దాస్యమే జీవాత్మకు స్వరూపానురూపమని, దాస్యమునకు (అనుష్ఠానమునకు) ప్రాధాన్యము వచ్చునట్లుజెప్ప, కూరత్తాళ్వాన్ సంతసించి వెంటనే వ్రాసిరి.

ఇట్లు, రామానుజులు, ఆళ్వాన్ల సహకారముతో

శ్రీభాష్య, వేదాన్తదీప, వేదాన్తసార, వేదార్థసంగ్రహ, గీతాభాష్యములను రచించి లోకమునకు భగవత్తత్వమును స్పష్టమొనర్చిరి.

## దిగ్విజయ యాత్ర

అనంతరము ప్రధానులగు శిష్యులెల్లరును రామానుజులను సేవించి, స్వామీ! దేవరవారు భగవత్స్వరూపమును సుస్పష్టముగ గ్రంథరూపముగ ననుగ్రహించిరి. ఇకపై దేశమంతటను తిరిగి దిగ్విజయమొనర్చుచు నచ్చటచ్చటి దివ్యదేశములందలి సర్వేశ్వరునికి మంగళాశాసనమును గృపజేయుడని ప్రార్థింప, ఉడైయవరులును వారలతోఁగూడి శ్రీరంగని సేవించి వాని యాజ్ఞనుగొని బయల్వెడలి, తిరుకుడన్ద (కుంభకోణము) మొదలగు చోళమండలములోని దివ్యదేశముల సేవించి, అచ్చటచ్చటి విద్వాంసులను జయించుచు, దక్షిణమునకు ప్రయాణించి, పాండ్యమండలమునందలి పండితులను జయించి, తిరుమాలిరుంశోలై జేరి సుందరబాహుస్వామికి 108 గంగాళముల అక్కారడిశిలి(పాయసాన్నము) ఆరగింపుజేతునని ఆండాళ్ మ్రొక్కుకొని యుండుటచే నామెకోర్కె దీర్చి, యటనుండి శ్రీవిల్లిపుత్తూరును జేరి వటపత్రశాయిని సేవించి, ఆండాళ్ళువద్దకు రాగా నామె విగ్రహమునుండి 'కోయిల్ అణ్ణా' యని పిలిచి తీర్థప్రసాదముల

నిప్పించి యాదరించెను. (కోయిల్ అణ్ణా! యనగా శ్రీరంగ మున నుండు అన్నయ్యా!యని యర్థము. ఆడుబిడ్డ కోర్కెను దీర్చువారు పుట్టింటివారగుటచే తన కోర్కెను దీర్చిరిగాన ఆండాళ్ళు రామానుజులను అన్నా! యని సంబోధించెను. నాటినుండియు రామానుజులకు గోదాగ్రజులని ప్రసిద్ధి యేర్పడెను). రామానుజు లంతట దర్భశయనము జేరి సేతుద ర్శనమొనర్చి, యటనుండి తిరునగరికివచ్చి నమ్మాళ్వార్లను సేవించి 'కణ్ణినుణ్ శిఱుత్తాంబు' దివ్యప్రబన్ధము ననుసంధించి యాళ్వార్లయనుగ్రహమును బడసి, యచ్చటి ఆదినాథుని సేవించి, కురుకాపురిని రాజవీథిన వచ్చుచు; దారికడ్డముగ నిల్చొనిన పదిసంవత్సరముల బాలికను జూచి ఉడైయవరులు తిరుప్పుళింగుడి యిచ్చట కెంతదూరమని యడుగ; నామెయు నీకు తిరువాయ్ మొళ్ళి రాదా? యన; వచ్చినచో వూరిదూర మెట్లు తెలియుననన; నామెయు కూతవేటుదూరమనియందు లేదా?యన; నమ్మాళ్వార్లయనుగ్రహముచే నావూరిలోని చిన్నపిల్లలకును దివ్యప్రబన్ధము సులభమగుటకు రామా నుజు లాపిల్లనెత్తుకొని యామె తల్లితండ్రులవద్దకేగి, తమచే నభిమానపుత్రులుగా నాదరింపబడిన తిరుక్కురుగైప్పిరాన్ పిళ్లానున కాబాలికను వివాహమొనర్పుడన, వారును మిక్కిలి సంతసించి యట్లొనర్చిరి. అంతట రామానుజులు తిరునగరికి చుట్టుప్రక్కలగల నవ తిరుపతుల సేవించి, అచ్చటగల వేదమునంగీకరించని, అంగీకరించియు నపార్థముల జెప్పెడియు

మతాంతరులనెల్లరను జయించి, యచ్చటినుండి తిరుక్కుఱు ఙ్గుడికేగి స్వామిని సేవించిరి.

## తిరుక్కుఱుఙ్గుడినంబిని వైష్ణవనంబిగ జేయుట

తిరుక్కుఱుంగుడినంబియు రామానుజుల నాదరించి తీర్థప్రసాదముల నిప్పించి, యర్చకముఖముగ "మేము రామకృష్ణాద్యవతారము లెన్నియో యెత్తి, ఒక్కజీవునైనను దిద్దుబాటొనర్పలేకపోతిమి, మీరింతమందినెట్లు దిద్దుబాటొనర్చి మీవెంట త్రిప్పుకొనుచుండిరి? మీవద్ద నేదియో గొప్పమందో మంత్రమో కలదని తలచుచుంటిమి, అదేదియో మాకును తెలియబఱచుడ"ని యడిగెను. అందులకు ఉడైయవర్లును, స్వామీ, మీరు వినునట్టి క్రమమున వినినచో, మేమును చెప్పునట్టి క్రమమున జెప్పగలమనిరి. అంతట తిరుక్కుఱుంగుడినంబియగు సర్వేశ్వరుడును తన సింహాసనమునుండి దిగి క్రిందనొక రత్నకంబళముపై నిలిచి, రామానుజులకు దివ్యసింహాసనమొకటి యేర్పఱచగా, రామానుజులును సింహాసనముపై తమ ఆచార్యులగు పెరియ నంబిగారు కూర్చొనినయట్లు భావించి దానికి దండము సమర్పించి తాము భూమిపై నిల్చొని, 'నంబి' చెవిలో ద్వయ మంత్రము నుపదేశించి, యిది మంత్రములలోనెల్ల శ్రేష్ఠమై మంత్రరత్నమను పేరుగల్గి మోక్షమునీయగలదని దెల్పిరి. అందులకు 'నంబి' రామానుజులకు దాసులమైతిమని

మిక్కిలి సంతసించెను. రామానుజులును నచ్చటి భగవానునకు 'వైష్ణవనంబి' యను దాస్యనామమునుంచ; నంబియు వీరికి బ్రహ్మరథమేర్పఱచి ఆదరించెను. రామానుజులును, స్వామికి నమస్కరించి, "అపచారాన్ ఇమాన్ సర్వాన్ క్షమస్వ" (ఈఅపచారములనెల్ల క్షమింపవలయును) అని ప్రార్థించి, యచ్చటినుంచి బయల్దేరి తిరువణ్ పరిశారము తిరువాట్టారు మొదలగు దివ్యదేశముల సేవించి, తిరువనంతపురమును జేరి, అనంత పద్మనాభుని, మూడువాకిళ్ళన పాదాదికేశాంతముగ సేవించి, యచ్చటి ప్రతివాదులను జయించి, అచ్చట శ్రీరామానుజమతము నేర్పఱచి, మళయాళదివ్యతిరుపతులనెల్ల సేవించి పడమటి సముద్రతీరముగుండ ఉత్తరదేశమునకేగి, ఉత్తరమధుర సాలగ్రామము వైకుంఠము ద్వారక అయోధ్య బదరికాశ్రమము నైమిశారణ్యము పుష్కరము శ్రేపల్లె గోవర్ధనగిరి బృన్దావనము మొదలగు తిరుపతులనెల్ల సేవించుచు నచ్చటచ్చటి కుదృష్టి విద్వాంసులనెల్ల జయించి; భట్టిమంటపమును జేరి సరస్వతీ భాణ్డారమున కేగిరి.

## శ్రీభాష్యకారులను బిరుదు గల్గుట

అచ్చట సరస్వతి స్వయముగ తలుపులను దెఱచి ద్వారమున కడ్డముగ చేతులనిడి నిల్చొని కనులవెంట నీరు

గార్చుచు నుండెను. రామానుజు లామెను జూచి యెందులకు దుఃఖించుచుంటివి? అడ్డుతొలగి దారి నిమ్మని కోరిరి. అంత నామె 'కప్యాసం పుండరీక మేవమక్షిణీ' శ్రుతికి అర్థము జెప్పినచో దారి యిత్తునననెను. అంతట రామానుజులు, కం అనగా జలము; పిబతి అనగా త్రాగువాడు; 'కం పిబతి ఇతి కపిః' నీటిని తన కిరణములతో త్రాగువాడు గాన కపి యను నామము సూర్యునకు కలదు; అట్టి సూర్యునిచే వికసింప జేయబడిన పద్మమును కప్యాసం పుండరీకమందురు; అట్టి పద్మముతో సమమగు కనులుగలవాడు భగవానుడని యా శ్రుతికి అర్థము; అని జెప్పిరి.

అందులకు సరస్వతి మిక్కిలి సంతసించి, కనులు తుడుచుకొని తన చేతిని చాచి రామానుజులు వ్రాసిన శ్రీభాష్య గ్రన్థమును తీసికొని శిరస్సున ధరించి యిది శుద్ధమైనదని యంగీకరించి భాష్యకారా! యని సంబోధించి హయగ్రీవ విగ్రహమొకటి యిచ్చెను. రామానుజులావిగ్రహమును తమ తిరువారాధనలో నుంచుకొనిరి. రామానుజులు సరస్వతినిజూచి నీవింతకుముందేల దుఃఖించుచుంటివి? ఇపుడు నన్నింతగ నాదరించుటకు కారణమేమి? యని యడుగ; నామెయు నిట్లు సమాధానము జెప్పెను. 'వెనుక శంకరుడిచ్చటకు వచ్చినప్పు డాతని నీ శ్రుతికి అర్థమడిగితిని, అందుల కాతడు కపి యనగా వానరమనియు ఆసమనగా పృష్ఠమ

నియు వానరపృష్ఠమువలె యెఱ్ఱనైన పద్మమువంటి నేత్రములు గలవాడు భగవానుడనెడి యర్థమును జెప్పెను, నాటి నుండియు అనంతకల్యాణగుణుడును దివ్యమంగళ విగ్రహుడునగు భగవానుని నేత్రసౌందర్యమున కిట్టి నీచమైన పోలిక జెప్పెనే యని దుఃఖించుచుంటిని, యా దుఃఖము నేటితో తీరినది, గావున బ్రహ్మసూత్రములకు సరియగు నర్థమును జెప్పినది మీరే యగుటచే భాష్యకారులనెడి బిరుదము మీకే తగున'ని దెల్పి యంతర్థానమాయెను. నాటినుండియు రామానుజులకు శ్రీభాష్యకారులనియు, శారదాశోకనాశకులనియు ప్రసిద్ధనామములేర్పడెను.

## కృత్తికా నిరసనము

ఇంతటి యాదరణ రామానుజులకు గల్గుటను సహింపని యసూయాపరులగు మతాంతరులు వచ్చి వీరితో వాదించి ఓడిపోయిరి. ఇది వినిన ఆ దేశపురాజు వచ్చి వీరినాశ్రయించి శిష్యుడాయెను. ఇది సహించలేని ఓడిపోయిన పండితులు ఆభిచార హోమము జేసి కృత్తికను పంపగా నా దుష్టశక్తి వచ్చి రామానుజులజూచి వారి తేజస్సునకు భయపడి వెనుదిరిగిపోయి ప్రయోగించిన పణ్డితులపైననే పడెను. దానితో నా పండితులెల్లరును పిచ్చిపట్టినవారై బట్టలు విప్పుకొని తమలోతామే తిట్టుకొనుచు కొట్టుకొనుచు తిరుగదొడగిరి. అది తెలిసిన రాజువచ్చి రామానుజులను ప్రార్థింపగా

భాష్యకారులు వారికి స్వస్థతగలుగునట్లొనర్చిరి. ఆ పండితు లెల్లరును భాష్యకారుల నాశ్రయించి శిష్యులైరి.

## శ్రీజగన్నాథుని నిరంకుశత్వము

ఉడైయవరులు అచ్చటినుండి వారణాసి జేరి గంగా స్నానమొనర్చి యటనుండి శ్రీపురుషోత్తమక్షేత్రమున కేగి శ్రీజగన్నాథుని సేవించిరి. అచ్చట జగన్నాథుడు పండారీల నబడు నొకజాతివారిచే నర్చింపబడుచుండెను. అది చూచిన రామానుజులు జగన్నాథుని పాంచరాత్రాగమ ప్రకారము శాస్త్రీయముగ నర్చింపజేయనెంచి పండారీలను ఆలయమును విడిచి పొమ్మని సంప్రోక్షణాదులకు ముహూర్తమేర్పఱచిరి. తెల్లవారిన ముహూర్తమనగా నాటిరాత్రి అర్చకులందరును జగన్నాథున కెదురుగ నిల్చి, 'స్వామీ యెంతకాలముగనో నిన్నారాధించుచుంటిమి, నేటికి రామానుజులను నొకసన్యాసి వచ్చి ఆలయమును విడిచి పొమ్మని మమ్ము శాసించెను. ఆతనికీ దేశపురాజుగూడ లోబడియుండెను, మేము నిన్ను విడిచి పోజాలము, ఎట్లైన నీవే మా యీ యాపదనుండి కాపాడవలయును లేకున్నచో మేమందరము నీయెదుటనే తలలు పగులగొట్టుకొని చనిపోదుమ'ని కొండరాళ్ళపై తలలు పెట్టుకొని చనిపోవుటకు సిద్ధమైరి. భక్తత్రాణపరాయణు డగు జగన్నాథుడు వారి మొరలువిని వారిని రక్షింపనెంచెను.

రామానుజులును శిష్యసమేతముగ తెల్లవారగనే
ణాదులకు కావలసిన సంభారములనెల్ల సమకూర్చు
త్రి ప్రొద్దుపోవుటచే నిద్రించిరి. ఆ రాత్రి స్వప్న
గన్నాథుడు తనను రామానుజులకు గన్పింపజేసి,
మీకు ఉభయవిభూతి నాయకత్వ మిచ్చినమాట
మైనను నిచ్చటి యర్చకులు నన్ను విడిచిన బ్రతు
దుమని శరణాగతి యొనర్చిరి, కావున వారిచేతనే
పబడుటకు సమ్మతించితిని. కావున మీరీ క్షేత్రము
నిని నా స్వతంత్రతకు విడువుడు, శ్రీకూర్మమున
రులచే నర్చింపబడుచున్న నన్నుద్ధరింపుడని దెల్పి
నమై; నిరంకుశుడగు నా శ్రీజగన్నాథుడు ఆరాత్రికి
ద్రించెడి రామానుజులను శ్రీకూర్మమునకు తర

రామానుజులును తెల్లనారి లేచి చూచుకొను సరికి
రుమాత్రమే పరుండియుండిరి. తమ పరివారము
దణ్ణాదులుగాని కన్పించలేదు, రాత్రి స్వప్నము నిజ
నా? యనితలచుచుండ; నొక బ్రహ్మచారిబాలకుడు
, మీకీప్రాంతము క్రొత్తగాన శిష్యునిగా నన్ను
నుడు, మీకు కావలసిన సదుపాయములనెల్ల నొనర్పె
దెల్పి; ఆలయమునకు ముందున్న శ్వేతకుండమున
నాచరింపజేసి యూర్ధ్వపుండ్రములు ధరించుటకు గావ
శ్వేతమృత్తికయు శ్రీమార్గమును దగ్గరలోనున్న

భూమిని దివ్వి తెచ్చియిచ్చి యారగింపునకు వలయు క్షీర ఫలాదులు సమకూర్చెను. ఇట్లు నాలుగురోజులు గడిచెను.

శ్రీజగన్నాథమున నున్న రామానుజుల యాశ్రితు లెల్లరును ఆచార్యునిగానక తల్లడిల్లుచుండ జగన్నాథుడు వారల స్వప్నమున గన్పించి మీ గురుడు శ్రీకూర్మమున నుండెనుగాన నచ్చటకేగుడని దెల్ప, వారును ఆచార్యునెడ బాపుజేసిన యీమాయావితో మనకేమిపని? యని శ్రీకూర్మమును జేరిరి.

రామానుజులు తనపరివారమునెల్ల జూచి మిక్కిలి సంతసించి వారు దెచ్చిన త్రిదణ్డాదులను ధరించి నాల్గు రోజులనుండి తన ననుసరించిన బ్రహ్మచారికై వెదుక నాతడు కన్పించలేదు, శ్రీకూర్మనాథుడే తనకిట్లు శిష్యుడుగ నుపకరించెను గాబోలునని స్వామి ఆశ్రితపరాధీనతను పొగిడిరి.

## శ్రీకూర్మ సముద్ధరణము

అంతట రామానుజులాలయమును వైష్ణవమొనర్ప దలచి యచ్చటి అర్చకులను పిలువనంపెను. లింగాకారముగనున్న విగ్రహమును తలంపుచే శైవులు దాని నారాధించుచుండిరి. రామానుజులు వారలందరను రావించి; తొల్లి ఋషికుల్యకడ ఋషులు హరిని ఆదికూర్మాకృతితో దర్శన

మిమ్మనికోరగా నాతడిట్లు శుద్ధసత్వ కూర్మాకృతిలో నీ శ్వేత శైలముపై శ్వేతకుండముగల క్షేత్రమున సాలగ్రామమాలి కధరించి శ్రీకూర్మరూపియైయుండెనే గాని శివలింగము కాదు గాన దీనిని విడిచి పొండనిరి. అందులకు వారు, మేము శివ లింగమని తలచి చాలకాలమునుండి పూజించుచుంటిమి, మీ రన్నదే నిజమగుచో ఆలయము వెనుకభాగమున నిలిచి లోపలనున్న స్వామిని పిలువుడు, మీ వైపున కాతడు తిరి గెనా! మీరన్నట్లే ఆలయమును విడిచిపోదుము, లేకున్నచో మీరే విడిచిపోవలసియుండుననిరి. అంతట రామానుజులు ఆలయము వెనుకభాగమున నిలిచి 'భక్తవత్సల! నీవే పరత త్వమైనచో నాదికూర్మమైనచో శ్రియఃపతివైనచో శ్రీజగ న్నాథమున జెప్పిన మాట నిజమగుచో ఆలయము వెనుక భాగముననున్న నావైపునకు తిరుగుమని ప్రార్థింప; నందరు జూచుచుండ నత్యాశ్చర్యముగ నా కూర్మమూర్తి పడమటి దిక్కునకు తిరిగెను. అదిచూచిన శైవులు వారుమాటలేక గుడిని విడిచిపోయిరి.

రామానుజులు ఆదివ్యక్షేత్రమున పాంచరాత్రాగమ క్రమమున సంప్రోక్షణాదుల జరిపి జయచిహ్నముగ ఆల యము వెనుకభాగమున నొకజయస్తంభము నాటించిరి. నాటి నుండి నేటికిని ఆలయమున ప్రవేశింపగనే స్వామి పృష్ఠభా గమేదర్శనమగును. ఆలయము ముందుభాగమున ధ్వజస్తం

భము, వెనుకభాగమున జయస్తంభము గనసగును. ఇట్లు రామానుజులు కూర్మనాథునికి వైభవము నేర్పఱచిరి.

## సింహాచలయాత్ర

శ్రీకూర్మమునుండి బయల్దేరి సపరివారముగ శ్రీరామతీర్థ పద్మనాభముల సేవించుచు సింహాగిరి (సింహాచలము) జేరిరి. మరునాటి యుదయముననే నిత్యవిధుల నొనర్చి యచ్చటి జనార్దనుని సేవించి; ప్రహ్లాదరక్షణమునకై దుముకుటచేత పడమరభాగము పల్లమై తూర్పుభాగము ఎత్తుగనుండి సింహాకృతిగ గన్పించుటచే సింహాగిరియను పేరుగల యా కొండనెక్కి కోవెలజేరి ప్రదక్షిణించి శ్రీభండారమున గలలక్ష్మిని సేవించి ధ్వజస్తంభముకడనున్న గరుడునికి దండమిడి లోనకేగి శ్రీపురూరవునిచే నిర్మింపబడిన మందిరాంతరాళమునగల శ్రీవరాహనృసింహుని సేవించి తీర్థప్రసాదము లుజ్జీవించి తిరిగివచ్చుచు నాస్థానమంటపమున కృష్ణమాచార్యులనెడు రాజసుని జూచిరి.

## తాండవకృష్ణమాచార్యులను శిష్యులనుగా గొనుట

కృష్ణమాచార్యులు విష్ణుభక్తులును గాయకులును నై ప్రతిరోజు రాత్రియందు స్వామినిగూర్చి గానము జేయుచుండెడివారు. స్వామియు వీరిగానమునకు ముగ్ధుడై పాటకు తగినట్లు నాట్యము జేయుచుండెడివాడు. కృష్ణమాచార్యులును

భగవదనుగ్రహము తనయందింతగ నుండుటకు గర్వించుచుం డెడివారు. రామానుజులు వీరినెట్లైన దిద్దుబాటొనర్పదలచి దగ్గర కేగి అయ్యా! మీకు భగవానుడు దర్శనమిచ్చుచుం డునుగదా; నేటిరాత్రి వానితో ఎంబెరుమానారనెడి యతి వచ్చియున్నాడు; ఆతనికి మోక్షముగలదా? యని యడిగి తెల్పుడు అనిరి. కృష్ణమాచార్యుడును తనయంతటి భక్తుడు లేడనెడి యహంభావముతో నున్నవాడగుటచే నట్లేయనెను.

ఆ రాత్రి కృష్ణమాచార్యుడు అలవాటుచొప్పున పాడుటయు హరి యాడుటయు నైనవెనుక, రామానుజుల విషయము నడుగ; హరియు వారికిని వారిచ్చినవారికిని మోక్షము ధ్రువమనెను.

ఆ మరునాడు రామానుజులు శిష్యసహితులై శ్రీవ రాహనృసింహుని సేవించి ఆలయమునకు ఈశాన్యమూలన కొంతదనుక నాశ్రితులతో భగవద్గుణానుభవ మొనర్చి; కృష్ణ మాచార్యుల గని 'భగవానుడేమనెనని యడుగ, నాతడు మీకును మీరిచ్చినవారికిని మోక్షముగలదనె'నని చెప్పెను. అంతట రామానుజులు అయినచో మీకు మోక్షము గల దేమో! యడిగి తెల్పుడనిరి; భగవానుడే ప్రత్యక్షమగు చుండ నాకు మోక్షముండుటలో నసుమానమేమి? యని కృష్ణార్యుడనెను; ఐనను నాతృప్తికై మీకు మోక్షమున్నదో?

లేదో? తెల్సుకొని జెప్పుమని రామానుజులు కోరిరి. కృష్ణార్యుడంగీకరించెను,

నాటిరాత్రి కృష్ణార్యుడు భగవానునితో నాకు మోక్షము గలదా? యనగా; హరి మిన్నకుండెను. అంతట కృష్ణార్యుడు మరల రెట్టించి యడుగ; ముక్తి నా యధీనమని వేదజాలమెల్ల జెప్పుచున్నను, నా యధికారమును నా దక్షిణపు టిల్లగు శ్రీరంగమున రామానుజుల కిచ్చితిని; దాన మిచ్చిమరల నేనెట్లు గొందును? కాన నీ ముక్తివిషయము రామానుజుల యధీనము నందున్నది గాన నీవే యాతని నడిగి తెల్సుకొనుమని హరి సమాధానము జెప్పెను. అందులకు కృష్ణార్యుడును చిన్ననాటినుండియు నిన్నే నమ్మియున్న భక్తుడనగు నన్ను; ఒక సన్యాసికై వంచించుట తగునా? పశువుల కాపరికే యుక్తాయుక్తభావన కలుగనేరదుగదా! కలిగినచో తప్పులేనట్టి సీతాసాధ్విని అగ్నిప్రవేశమునర్ప జూడవుగదా?; ఇంతవరకు నీయందుగల భక్తిభావన మంట గలిసినది; మాయసన్యాసి నీ కేదియో మచ్చుజల్లెనని వాపోయెను. అందులకు హరియు; నేనేమి జేతును? నీ గర్వమే నిన్నింత జేసెను; ఆకారత్రితయము, అర్థపంచకబోధ, పంచసంస్కారపరులై ఆచార్యాభిమానము నొందిన వారికే ముక్తిగలుగును గాని తక్కినవారికెల్ల నది లభింపదు; నీవు పాడితివి, నేనాడితిని; కావున ముక్తికై నీవేగి రామానుజుల నాశ్రయింపుమని చెప్పెను.

అంతట కృష్ణార్యుడు పశ్చాత్తప్తుడై సింహాద్రి దిగి వచ్చి రామానుజుల నివాసమున జేగి కావలివారితో కృష్ణమాచార్యులనగు నేను వచ్చితినని లోన దెల్పుడని పంప; వారేగి తెల్పిరి; రామానుజులును 'నేను' చచ్చిన వెనుక రమ్మని కబురంపిరి. అంతట కృష్ణార్యుడు తిరిగి నృసింహుని జేరి యీ విషయము దెల్పెను. అందులకు హరి కృష్ణార్యుని జూచి; ఆచార్యశబ్దము రామానుజులకే చెల్లునుగాన నేననెడి యహంకారమును వీడి కృష్ణదాసుడు వచ్చెనని జెప్పుకొనిన రామానుజులు తప్పక యాదరించగలరని దెల్ప; నటులనే కృష్ణార్యుడు రామానుజుల నాశ్రయించెను.

ఉడైయవరులును కృష్ణసూరిని దిద్దుబాటొనర్చి స్వరూపోచిత సకలకైంకర్యములను వరాహనృసింహునికి జేయుచు సింహాద్రియందే యుండునట్లానతిచ్చి తాము శిష్యసహితముగ స్వామివద్ద యాజ్ఞబడసి సింహగిరిని విడిచి ప్రయాణమై ఆంధ్రనాథాది దివ్యక్షేత్రపతులెల్ల గన్పింప నందటికిని మంగళాశాసనమొనర్చి; గౌతమిని కృష్ణవేణిని (గోదావరి, కృష్ణలను) దాటి అహోబలక్షేత్రమున పంచనారసింహులను సేవించి సోమవరపు కనుమను దాటి; తిరుపతి జేరిరి.

## వేంకటేశునకు శంఖచక్ర ప్రదానము

మరునాటి ఉదయముననే ఆతామడల వెడలు,

ముప్పదియామడల పొడవుగలిగి వేంకటాద్రి వృషభాద్రి నారాయణాద్రి సింహాద్రి శేషాద్రి అంజనాద్రి తీర్థాద్రి యను పేర్లలో నేడుకొండలుగ ప్రసిద్ధిజెంది; శిఖరమును దర్శించువారల సకల పాతకముల బోద్రోలి ముక్తినిచ్చునట్టిదై; కలియుగ వైకుంఠమనబడుచు; కపిల పంచాయుధ సప్తర్షి గోగర్భ వైకుంఠ కులిశ గరుడ సుదర్శన శఠకోప ఆకాశగంగ పాపనాశన సనక సనందన స్కంద విష్వక్సేన వామన తుంబురు మొదలగు పేర్లతో ఆరుకోట్ల తీర్థములు గలదై; బ్రహ్మాది దేవతలు ఋషిసంఘములును ఆదిశేషుడు విష్వక్సేనులు గరుడుడు మొదలగు నిత్యులకును నిత్యనివాసమై; పన్నిద్దరాళ్వార్లచే పాడబడినట్టిదై; జంతువులు సైతము పరస్పర వైరములేక సంచరించునట్టిదగు తిరుమల కొండపైకి శిష్యసమేతముగ రామానుజులు జేరిరి. అంతట వారు నాల్గువీధులను దిరిగివచ్చి పుష్కరిణియందు స్నానమాడి ద్వాదశోర్ధ్వపుండ్రముల ధరించి వరాహస్వామిని సేవించి తీర్థప్రసాదముల గొని ప్రదక్షిణించి, మున్నొకసారి తురుష్కులబాధలకై శ్రీరంగడువచ్చి 12 సంవత్సరములు తలదాచుకొన్నట్టి శ్రీరంగమంటపమును సేవించి; ఆలయమున ప్రవేశించి గరుడస్తంభమువద్దగల బలిపీఠమునకు దండమిడి; గోశాగార ధాన్యాగార తైల ఆజ్య రసద్రవ్యములగు నాభగృహములను జూచుచు; ద్వారపాలకులకు నమస్క-

రించి లోనకేగి మూలవరుల సేవింప నాతడు శంఖచక్రములు లేక శైవులచే నర్చింపబడుచుండెను. అంతట రామానుజులు సన్నిధి స్వాములను ప్రశ్నింప వారిట్లు జెప్పిరి.

ఒకప్పుడు తొండమాన్ చక్రవర్తి శత్రురాజుల భీతిచే శరకోపతీర్థ సమీపపు రహస్య సొరంగపు మార్గమున వేంకటేశ్వరుని సేవించి శరణాగతి యొనర్ప; ఆశ్రిత పరతంత్రుడగు స్వామి, తన శ్రీహస్తములనున్న శంఖచక్రములను రాజునకిచ్చెను. అంత తొండమాన్ చక్రవర్తి ఆ ఆయుధములగొని శత్రుసంహార మొనర్చి సుఖించెను. నాటి నుండియు నేటివరకును ఇచ్చిన ఆయుధములను తిరిగి తీసికొనకపోవుటచే స్వామి తన చిహ్నములు లేకుండెను. సహజమగు నసాధారణ చిహ్నములు లేకపోవుటచేతను నాగాభరణములు జడలు ధరించియుండుటచేతను వీరభద్రుడని తలచి శాక్తేయులు కొందరు ఆశ్రయించి స్వామినారాధించుచుండిరనిరి. ఇట్లు తెలియగనే యతిశేఖరులు తామసారాధకులను బిలిపించి వారలతో నిట్లనిరి; మీ విగ్రహచిహ్నములగు త్రిశూల డమరుకములను, మా దైవత చిహ్నములగు శంఖచక్రములను లోననొకపీఠముపై విగ్రహమూర్తి దగ్గరగ నుంచుదము. తెల్లవారు సరికి యే యాయుధములను స్వామి ధరించునో వారు మూర్తి నారాధించుటయు కానివారు విడిచిపోవుటయు జరుగవలెననెడి నియమము నేర్పఱచగా

నట్లేయని వారంగీకరించిరి. అనుకొనినయట్లే రెండువిధము లగు ఆయుధములను ఆలయములోపల నుంచి తలుపులు మూసి తాళములు వేసి తెల్లవారువరకు నొకరిపై నొకరు కావలిగా ఆలయముచుట్టును తిరుగుచుండిరి.

తెల్లవారగనే తాళములదీసి చూచుసరికి స్వామి శంఖ చక్రముల ధరించియుండెను. అంతట శాక్తేయులెల్లరును కొండను విడిచి వెళ్ళిపోయిరి.

యతిశేఖరులు భగవానునకు సంప్రోక్షణాదుల నొనర్ప జేసి సశాస్త్రీయముగ సకలవిధోత్సవముల జరుగునట్లేర్పఱచి అలర్మేల్ మంగతో కల్యాణమొనర్చిరి. తిరుమలేశునకు శంఖ చక్రములిచ్చుట, పద్మావతిని వివాహమొనర్చుటలచే నాటి నుండియు రామానుజులు ఆచార్యులు, మామగారునైరి. ఆచార్యులగుటచే ఉన్నతాసనమున గూర్చుండి ఉడైయవర్లు వేంకటేశ్వరున కుపదేశమొనర్చుచు ఉపదేశముద్రతో ఉండుటయు; శిష్యుడగు వేంకటేశ్వరుడు క్రిందుగ నిల్చొని వినుచుండుటయు గాననగును.

## తిల్లగోవిందరాజుల ప్రతిష్ఠించుట

ఉడైయవరులు తిరుమలనుండి క్రిందికేతెంచి తిరుపతి లోని గోవిందుని ఆలయమునకేగ నది పూజాదులులేక పాడు

బడియుండెను. యతిరాజు లచ్చటి వారిని కారణమడుగ, రాయవేలూరునకు రాజగు మ్లేచ్ఛుడు అసలు విగ్రహమును కోటయగడ్తకు వంతెనరాయిగా వేసికొనగా ప్రస్తుతపు ఆలయములోని విగ్రహమునకు బడబానలమువలె బానకడుపగుటచే నెంత పదార్థము నారగింపుజేసినను చాలకపోవుటచే జనులుదీనికి ప్రసాదముల నర్పింపకుండిరి. అందుచే నిట్లాయె నని దెల్పిరి. రామానుజు లంతట నసలు విగ్రహము నెట్లు తెప్పించుటయా? యని యోజించుచుండ; నాగ్రామ నివాసినియు సకలకళాశాస్త్రసరసురాలును యతిరాజుల సంబంధవతియునగు తిల్లయను పేరుగల నొక వేశ్య తన నీ కార్యమున నియోగింప ప్రార్థించి, యాచార్యానుమతిని బడసి; రాయవేలూరునకు పోయి; తన సరసకళాప్రజ్ఞచే నారాజును మెప్పించెను. ఆమ్లేచ్ఛరాజీమె నాట్యగాన సరళికి మిక్కిలి సంతసించి; యేమికావలెనో కోరుకొమ్మనగా; నీమెయు గోవిందుని విగ్రహము నడుగ; నాతడామెతో నా విగ్రహమును బండ్లపై తిరుపతికి పంప; నామె దానిని ఉడైయనర్లకు సమర్పించెను. యతిరాజు లా విగ్రహమును సశాస్త్రీయముగ ప్రతిష్ఠింపజేసి; వేశ్యయొసర్చిన యుపకృతి యెల్లరకును దెలియునట్లు తిల్లగోవిందరాజులని స్వామికి తిరునామమిడి, సకలోత్సవముల నేర్పఱచి సర్వకైంకర్యము లొనరింపతగు శ్రీవైష్ణవ సన్యాసులిద్దర నియమించి, తిల్లగోవిందుని యాజ్ఞను బడసి, తిరుపతిని వీడి కాంచీపురము జేరి వరదుని

ప్రస్తుతించి; తిరువల్లిక్కేణి తిరునీర్మలై దివ్యదేశముల సేవించి మధురాంతకమున ఏరికాత్తపెరుమాళ్ళను సేవించి పెరియనంబి తమకు ద్వయమనుగ్రహించిన స్థలమునకు దండమిడి, తొండమండలము నందలి మాయావాదుల నెల్ల రను జయించి; తిరువహీంద్రపురము నందలి తెయ్వనాయక స్వామికి నమస్కరించి; వీరనారాయణపురము జేరి మన్నా రురాజగోపాలుని సేవించి, నాథమునులు యోగమొనర్చిన స్థలమునకు నమస్కరించి యచ్చటనుండి ప్రయాణమై శ్రీరంగము జేరి అమలనాదిపిరాన్ దివ్యప్రబంధము ననుసం ధించి శ్రీరంగనాథునికి నమస్కరించి నిలిచిరి. శ్రీరంగనా థుడు రామానుజులతో మీకేమియూ కొఱత లేదుకదా? యనగా; 'నిరంతరము నిన్నే దలచుచు నంతటను జయము లభించివచ్చిన మాకేమికొఱత' యని సమాధానమిడి తీర్థ శఠకోప ప్రసాదముల బడసి యతిశేఖరులు తమ మఠమున కేగి యాశ్రితుల కెల్లరకు రహస్యార్థముల గృపజేయుచు సుఖముగ నుండిరి.

## కూరత్తాళ్వాన్ చరిత్ర

రామానుజుల నాశ్రయించిన వారలలో ప్రధానులు కూరత్తాళ్వాన్. వీరు కాంచీపురమునకు పడమటిదిక్కున క్రోశమాత్రమున శ్రీకూరమను నగ్రహారమున సంపన్న కుటుంబమున నవతరించిరి. వీరు సకలశాస్త్రవిశారదులై

ధర్మనిరతులై గృహస్థులై యుండిరి. వీరు సూర్యోదయము మొదలు రాత్రి రెండవఝాము వరకును బీద సాధులెల్లరకును అన్నదానము సత్యాదరముతో జేయుచుండెడివారు. ఇట్లు నాటినాటికి వైరాగ్యమధికమై; సకల సంపదలను దానమొనర్చి; భార్యతోగూడి శ్రీరంగమునకు ప్రయాణమైరి. మార్గమధ్యమున కూరత్తాళ్వార్ల భార్యయగు నాండాళ్ళమ్మగారు భర్తనుజూచి, యీ దారిన భయములేదుగదా! యనెను. అందులకు కూరేశులు వెంట ధనమున్నచోగదా భయముండుట; నీతో నేదైన వెంట తెచ్చుచుంటివా? యని యడిగిరి. అందులకామె, రాత్రిపూట పరుండునపుడు మీరు పాలారగించెడి బంగరుగిన్నెనుమాత్రము ఒడిలోనిడుకొని తెచ్చుచుంటినని సమాధానము జెప్పెను. కూరేశులు తక్షణమే యాపాత్రను తీసికొని యొకపొదలోనికి విసరివైచి యిక భయమేమియు లేదుగదా యనిరి. ఇట్లు వీరిరువురును కట్టుగుడ్డలతో శ్రీరంగము జేరి శ్రీరంగనాథుని సేవించి, ఉడైయవరుల నాశ్రయించి ఆచార్యపదైకనిష్ఠులై యుండిరి, ఉడైయవర్లు వీరికొక కుటీరమేర్పఱచి యందుండ నియమించిరి. కూరేశులును శ్రోత్రియుల యిండ్లలో భిక్షదెచ్చుకొనుచు కాలము గడుపుచుండిరి.

ఒకనాటి వర్షాకాలమున పగల్లు విపరీతముగు వర్షమగుటచే కూరేశులు భిక్షాటనకేగక; అకాలమగుటచే

స్నానాద్యనుష్ఠానముల నొనర్చుకొని భగవదారాధన మొనర్చి తీర్థమును గ్రోలి ప్రబంధానుసంధానమే ధారకముగ పరుండిరి. శ్రీరంగనాథుని యాలయమున నాటిరాత్రి పవళింపు సేవలో నారగింపునకై మ్రోగించెడి గంటను వినిన ఆండాళ్ళమ్మగారు, రంగనాథా! నీ భక్తునకు ప్రొద్దుటినుండియు ఉపవాసమాయెను, నీవు మాత్రము కులుకుచు (అరవణై) పాయసాన్నము నారగించుచుంటివా? యని మనసున తలచుకొనెను.

భక్తవత్సలుడగు శ్రీరంగనాథుడు ఆలయాధికారి యగు ఉత్తమనంబి స్వప్నమున తన్ను గాన్పించి; దివిటీలతోను ఛత్రిచామర వాద్యములతోను వెంటనే నా ప్రసాదమును బంగరుపళ్ళెరముతో నెత్తినిడుకొనిపోయి కూరేశుల కొసంగుడని దెల్పి యంతర్ధానమాయెను.

ఉత్తమనంబియు ససంభ్రమముగ లేచి స్వామి యాజ్ఞానుగుణముగ నొనర్ప; కూరేశులదిజూచి అచ్చెరు వొంది భార్యనుజూచి నీవేమైన మనసున దలచితివా? యన; నామెయు ఆలయమున నారగింపుగంటను విని రంగనాథా! నీ భక్తునకుపవాసమా? యనుకొంటినింతియే యనెను. అందులకు కూరేశులు, స్వతంత్రించి నీవిట్లుతలచుటచే నీవప్రసాదప్పు రెండు ముద్దలను నీవే స్వీకరింపుమన నామెయు భర్తయాజ్ఞమేరకు స్వీకరించెను.

# శ్రీపరాశర వ్యాసభట్టరుల యవతారము

ఇట్లు శ్రీరంగనాథుని యనుగ్రహముచే స్వీకరించిన రెండు ప్రసాదపు ముద్దలకుగా నాండాళ్ళమ్మగారు గర్భవతియై శాలివాహనశకము తొమ్మిదివందల యెనుబదిమూడవ సంవత్సరమున (అనగా కలియందు 4163సం) గడచిన శుభకృత్ సంవత్సర వైశాఖమాసమున పూర్ణిమాతిథి యందు అనూరాధానక్షత్రమున నిరువురు కుమారుల గనిరి. కూరేశులు ఆ బిడ్డలకు నామకరణాది యుజ్జీవనాంశములకు శ్రీరామానుజులు శ్రీరంగనాథులే నిర్వాహకులని యెన్నుకుండిరి. జాతాశౌచము గడచిన పండ్రెండవ దినమున ఎమ్బెరుమానార్లు ఆళ్వాన్ల గృహమునకేగి వెంటనచ్చిన ఎంబార్లను జూచి పిల్లలిద్దరను దీసికొనిరండన గోవిందులును బిడ్డలిద్దరను తనవక్షమున గొత్తుకొని దృష్టిదోషము రాకుండ ద్వయానుసంధానముతో దీసికొనిరాగా; యతిశేఖరులు బిడ్డలనుజూచి సంతసించి గోవిందా! వీరివద్ద ద్వయము పరిమళించుచున్న దేమి? యన; గోవిందుడును ద్వయముతో మంగళాశాసనమొనర్చుచు దెచ్చితి ననెను. అంతట ఉడైయవర్లు అట్లయినచో నీవే వీరి యుజ్జీవనమున సమర్థుడవుగమ్మని; బిడ్డలిరువురకును పరాశర, వ్యాసభట్టరులని పేర్లనిడి, గోవిందునిచే వారికి పాలముద్రల నేర్పుఱుపజేసి, వారలు పెద్దవారైన కాలమున గోవిందులచేతనే విద్యాబుద్ధుల గఱపించిరి.

ఆ తరువాత గోవిందమిశ్రుల తమ్ముడగు శిటియ గోవిందప్పెరుమాళ్ అనువానికి కుమారులు గల్గగా; ఉడైయవరులా బాలునకు 'శ్రీపరాంకుశనమ్బి' యని పేరిడిరి.

ఇట్లు రామానుజులు ఆళవన్దారుల చరమశరీరపు మూడుశ్రేళ్ళను తెరిపించుటకై చేసిన మూడుప్రతిజ్ఞలగు బ్రహ్మసూత్రములకు భాష్యమువ్రాయుట; పరాశర వ్యాస పరాంకుశ; తిరునామముల నేర్పఱచి పిలిపించుట యనెడి ఆళవన్దారుల మూడు కోర్కెలను దీర్చినవారైరి.

అత్తాన్ బిడ్డల నిరువురను శ్రీరంగనాధుని ఆలయమున విడిచిరి. శ్రీరంగని యాజ్ఞానుగుణముగ నర్చకులాబిడ్డల నిరువురను స్వామి సన్నిధిన ఊయలతొట్టిలో పరుండబెట్టి యాతడారగించగా మిగిలిన పాలతోను ప్రసాదములతోను పెంచుచువచ్చిరి. బిడ్డలు ప్రాకాడు దశలో నొకనాడు అర్చకులు స్వామి యారగింపునకై ప్రసాదమునుంచి తెర వేసిరి. ఆసమయమునకు బిడ్డలిద్దరును ప్రాకుచువచ్చి స్వామి యారగింపునకుముందే గిన్నెలలో చేతులనిడి తీసికొని తినదొడగిరి. అదిచూచిన యర్చకులు కోపించి పిల్లలనిద్దరను లాగి బయటపడవైచి మరల ప్రసాదమును జేయించి ఆరగింపొనర్చ, నాటిరాత్రి శ్రీరంగడు ఆలయాధికారి స్వప్నమున గాన్పించి నా బిడ్డలను

అర్చకులు శిక్షించిరిగాన రాత్రి నే నారగించలేదని చెప్పెను. నాటినుండియు అధికారి యాజ్ఞానుగుణముగ నర్చకులు బాలకులను భక్తి శ్రద్ధలతో పెంచుచువచ్చిరి. శ్రీరంగనాథుడు పరాశరభట్టరును పుత్రస్వీకార మొనర్చెను.

## శ్రీపరాశరభట్టరు వైభవము

పెద్దబిడ్డడగు పరాశరభట్టరు ఐదవసంవత్సరపు వయస్సున నొకనాడు కూరేశులు తిరువాయ్మొళిలోని నెడుమాఱ్కడిమైయను దశకము ననుసంధించుచుండ 'శిఱుమా మనిశర్' అను పదమును విని ఆళ్వాన్ సన్నిధికేగి అయ్యా! 'చిన్నవారగు పెద్దవార'ని చదివితిరి, చిన్న-పెద్ద యని రెండు విరుద్ధధర్మములు లొకేవస్తువునం దెట్లుండునని యడుగ; ఆళ్వానదివిని శ్రీరంగని యనుగ్రహముచే నీ బిడ్డనికింతటి విమర్శనాత్మకదృష్టి గలిగినదని సంతసించి బిడ్డని జూచి, నాయనా నీకు ఉపనయనము గాలేదుగనుక శాస్త్రీయముగ జెప్పవీలుపడదు, ఐనను చెప్పెదను వినుము; 'అణోరణీయాన్ మహతోమహీయాన్' అని భగవానుని యందు అణువుకంటెను సూక్ష్మమైనవాడు మిక్కిలిగొప్ప వస్తువుకంటెను గొప్పవాడని తక్కువ-యెక్కువలు రెండును నొకేచోటనున్నట్లు; శరీరముచేత చిన్ననై జ్ఞానముచేత పెద్దవారగు శిఱియాచ్చాన్ అరుళాళప్పెరుమా ళెమ్బెరుమానార్

వంటివారు శిఱుమామనిశర్ సుమా యని జెప్ప బిడ్డడు సంతసించి ఆటలకై వెడలిపోయెను.

## భట్టరు సర్వజ్ఞభట్టు నోడించుట

మరియొకనాడు భట్టరు స్నేహితులతో వీధిలోని యిసుకలో నాడుకొనుచుండగా సర్వజ్ఞభట్టరను నొకఅద్వైత పండితుడు శిష్యసమేతముగ బిరుదుల నూదించుకొనుచు పల్లకిలో వచ్చుచుండెను. అది చూచిన భట్టరు, ఊరిలో ఉడైయవరులు, ఆళ్వాన్, అరుళాళపెరుమాళెమ్బెరుమానార్, ఎమ్బార్, మొదలగు నెందరో జ్ఞానవృద్ధులున్నచోట నీతడు బిరుదులూదించుకొనుచు వచ్చుచున్నాడే! యీతని గర్వమడచవలెనని తలచి, దోసెడు ఇసుకను దీసికొని యెదు రుగబోయి, అయ్యా నీవు సర్వజ్ఞభట్టరువుగదా! యిది యెంతయో జెప్పుమని జూప; అందులోని యిసుకరేణువు లెన్నియుండెనో చెప్పమనుచుండెగాబోలునని తలచి చెప్ప జాలక మిన్నకుండెను. ఇది చెప్పలేనిచో పోనిమ్ము. ఇదియైన జెప్పగలవా? యని ఒకచేతితో యిసుకను జూపెను. అందు లకు నాతడు నిరుత్తరుడాయెను, అంత భట్టరు కోపముతో ఓరీ! ఇది దోసెడనియు, నిది చేరెడనియు చెప్పజాలని వాడివి సర్వజ్ఞభట్టరని బిరుదులూదించుచు ఎమ్బెరుమానార్ల వంటి పెద్దలున్నచోటకు వచ్చితివే? పొమ్మని చీదరించెను.

సర్వజ్ఞభట్టరు సిగ్గుపడి, పల్లకీదిగి బిడ్డనెత్తుకొని ఆళ్వాన్‌కుమారునిగ నెఱిగి ఆశ్చర్యముతో వారిగృహము నకు దీసికొనిపోగనే పొన్నాచ్చి (హేమాంబ) యనునామె యెదురుగవచ్చి బిడ్డనెత్తుకొని ద్వయానుసంధానమొనర్చుచు దృష్టిదోషము రానట్లు ఉత్తరీయముగప్పి లోనకు దీసికొని పోయి తల్లియగు నాండాళ్ళమ్మగారికీయ నామెయు రక్ష బెట్టెను.

## భట్టరునకు వేదశాస్త్రాధ్యయనము

భట్టరునకు ఏడవయేట ఉపనయనమొనర్చి వేదాధ్య యన మొనర్పజేయుచుండ, నొకనాడు అధ్యయనమున కేగక బిడ్డడాడుకొనుచుండుట జూచిన ఆళ్వాన్ఆండాళ్‌లు, నాయనా తోటివారెల్లరు జదువుకొనుచుండ నీవాడుకొను చుంటివేమి?యని అడిగిరి. అందులకు భట్టరు, నిన్న చెప్పినదే మరలచెప్పుచుండగా వచ్చినదే మరల చదువుట యెందుల కని ఆడుకొనుచుంటిననిజెప్పెను. అయినచో నిన్నటిపాఠ మేది? యనగనే చెప్పినదిచెప్పినట్లు ఒప్పజెప్పెను. అందు లకు వారచ్చెరువొందిరి.

తరువాత ఆళ్వాన్ ఎమ్బారు లిద్దరును భట్టరునకు అర్థశిక్షణ తత్వశిక్షణల నొనర్చిరి,

## భట్టరు శ్రీరజనాథదంపతులతల్లితండ్రులుగ భావించుట

శ్రీరంగనాథు డొకప్పుడు తెరలోనుండగా భట్టరు సేవింపనేగి తెరవేసియుండుటచే వెనుదిరిగిరి. అదిజూచిన శ్రీరంగడు భట్టరును పిలిపించి యిప్పుడు మమ్మెట్లుగా తలచితివని యడుగ; నాతడు మిమ్ము శ్రీరంగనాథునిగ శ్రీరంగనాయకిగ దలచితినన; నైనచో మును పెట్లుదలచియుంటివని యడుగ; ఆ ప్పావునుగ నాంఛాళ్ళుగ (తండ్రిగ తల్లిగ) తలచి యుంటిననెను. అందులకు శ్రీరంగనాథుడు మమ్ములను మునుపటివలెనే తల్లిదండ్రులుగ దలచియుండుము; లేకున్నచో నాపై నొట్టు సుమా!యని నిర్బంధించెను.

## భట్టరు వివాహము

కూరేశులు, భట్టరునకు వివాహోచిత వయసురాగా, ఉడైయవరులవద్దకేగి 'పిల్లవానికివివాహమొనర్చుట యెట్లు? నా సంబంధులెల్లరును ప్రాకృతులైయుండిరని విన్నవింప; ఉడైయవర్లును పెరియనంబి సంబంధులలో నొకరికుమార్తెను వివాహమొనర్పతగునన; కూరేశులు భార్యతోగూడి బృహచ్చరణ వైష్ణవునింటికేగి యడుగ నాతడు భట్టరు యొక్క ఆభిజాత్యమున కిష్టపడియు క్రొత్తసంబంధమగుటచే శంకించుచుండెను. కూరేశులు శ్రీరంగని సేవించి బిడ్డలుపెద్దవారైరి, వివాహమొనర్పవలదా? యన; శ్రీరంగనాథుడందు

లకు మీరా? సమర్థులు? మా బిడ్డలకు తగినట్లు మేమే చేతు మని జెప్పి; బృహచ్చరణుల స్వప్నమునకన్పించి మీ బిడ్డల భట్టరునకిండని దెల్పి; నాతడును మేల్కాంచి స్వప్నవృత్తాంతమునెల్ల భార్యకు బంధువులకు జెప్పి శ్రీరంగమునకు వచ్చి తనకుమార్తెలగు అక్కచ్చియు మన్నియు ననెడి యిరువురు కన్యల నుదకధారాపూర్వకముగ పరాశరభట్టరునకిచ్చి వివాహ మొనర్చెను.

## ముతలియాణ్డాన్ వైభవము

ఉడైయవరులు సన్యసించునప్పుడు శరీరసంబంధులను విడువవలదా? యన; మేనల్లుడగు ముదలియాణ్డాన్ (దాశరథు) లను దప్ప మిగిలినవారి విడుతుననిరి. అందుల కచటి పెద్దలు మీరిట్లనదగునా? యన; దాశరథులు నాకు త్రిదణ్డస్థానీయులు; త్రిదణ్డమును విడిచినగదా దాశరథులను విడుచుట యని సమాధానము జెప్పిరి. దానిచే రామానుజులకు ముదలియాణ్డాన్లయం దెంతటి ప్రీతిమో తెలియనగును. రామానుజులు కావేరియందవగాహింప నేగునపుడు ముతలియాణ్డాన్ భుజముపై చేయివైచుకొని వెళ్ళెడివారు.

పెరియనంబిగారి కుమార్తెయగు అత్తుళాయమ్మ అత్తవారింట సుఖించుకాలమున, నొకనాడు కావేరియందు స్నానమున కేగదలచి అత్తగారిని తోడు రమ్మనెను;

ఆమెయు మీ పుట్టింటినుంచి దెచ్చుకొనిన సేవకురాలిని దీసి కొనిపొమ్మని గడుసుగ మాట్లాడెను. అత్తుళాయమ్మ యీ మాటను తండ్రికి దెలియబఱచెను. పెరియనంబిగారీవా ర్తను మీ యన్నయగు రామానుజుల కెఱిగింపుమనిరి. అది వినిన ఉడైయవరులు గురుపుత్రి నూరడించి, తమకు త్రిదం డస్థానీయుడగు దాశరథిని జూచి, నీవీమెతో వెడలి సకల విధసపర్యల నొనర్పుమన; ముదలియాణ్డాన్ అట్లే యొనర్చు చుండెను.

ఒకనాడు అత్తుళాయమ్మ యత్తవారింటి వీధియరు గుపై నిద్దరు శ్రీవైష్ణవులు శాస్త్రచర్చయొనర్చుచు నిశ్చ యించలేకయుండ నదివినిన దాశరథి వారి సంశయము దీర్ప; వారలెరిగి నమస్కరించి పోయిరి.

ఇది వినిన అత్తుళాయమ్మ మామగారు, దాశరథికి నమస్కరించి మీబోటి పెద్దలు మాయింట ఊడిగమొనర్చు చుండతగునా? మా కోడలునకు గావలసిన సహకారము లెల్ల మేమే చేసుకొందుముగాన, మీరు మీ యాచార్యులవద్ద కేగుడని ప్రార్థింప; నాతడు మా యాచార్యుని యాజ్ఞలేక వెడలననెను. అత్తుళాయమ్మ మామగారు తన వియ్యంకు డగు పెరియనంబిగారిని సేవించి, దాశరథిని పిలిపించుకొను డన; పెరియనంబిగారు రామానుజుల నాశ్రయింపుడనిరి. అంతట నాతడు రామానుజుల పాదములపైబడి మిక్కిలి

దీనముగ మాస్వరూపమును నిలుపుడని ప్రార్థింప; రామాను జులును అత్తుళాయమ్మను బిలిపించి యామె యంగీకార ముతో దాశరధిని తిరిగితమవద్దకు రప్పించుకొనిరి.

## మారనూర్నంబి చరమదశ

(జన్మచే నీచుడైనను జ్ఞానాధికుడాదరణీయుడే)

మారనూరున నంతిమ కులమున బుట్టిన జ్ఞానపూర్ణు లగు మారనూర్నంబియని ప్రసిద్ధిగలవారు సేవకావృత్తిచే జీవించుచు యజమాని పొలమునకు కాపలాకాయుచు, ఆకటి వేళకు బంధువులాహారము తేకపోవుటచే దగ్గర చెఱువులోని మాడుదోసిళ్ళ బురదనీటిని ద్రాగివచ్చుటను జూచిన యామును లిదేమి? యని యడుగ; ఆకటివేళకు అప్రయత్న ముగ లభించిన దానితో సంతృప్తినిపొంది, మీబోటి గురు వుల నాశ్రయించినవాడే కృతకృత్యుడని నంబి బదులీయ; వాని వైరాగ్యమునకు సంతసించిన యామునాచార్యులతనిని శిష్యునిగ జేర్చుకొనిరి. ఒకప్పుడు యామునులు రాచపుం డుచే బాధపడుచుండ, మారనూర్నంబిగారది జూచి సహిం పలేక, ఆచార్యుని ప్రారబ్ధమును తామనుభవించియైన వారికి ఉపశమనము గల్గజేయు తలంపుతో యామునుల ప్రార్థించి, నిర్బంధించి యావ్రణమును తమపైకిదెచ్చుకొని బాధను సంత సముతో ననుభవించుచుండిరి. ఇది జూచిన పెరియనమ్బి గారు రాత్రియందు చీకటిన శ్రీరంగనాథుని తీర్థప్రసాద

ములను గొనివచ్చి వ్రణముపైనిడి కట్టుగట్టెడివారు. ఆప్ర సాదమును దినియుండుటచే వ్రణకీటకములు వారి శరీరమును బాధించెడివిగావు, దానిచే వారికి ఉపశమన మేర్పడెడిది. అందులకు మారనేర్నంబిగారు అయ్యో! నా ప్రారబ్ధము దుఃఖానుభవముచే నశించుచుండ నెవరో గిట్టనివారు ఉపశమ నము గల్గించుచుండిరే! యని ప్రారబ్ధానుభవము మిగిలిపోవు చున్నదని చింతించెడివారు. ఇంతటి వైరాగ్యభావముగల మారనేర్నంబిగారు యామునాచార్యుల నాశ్రయించిన ప్రధానులలోని వారగు పెరియనంబిగారిని (మహాపూర్ణులను) యజ్ఞప్రసాదము కుక్కకు పడవేయకుడని (ఆచార్యునిచే నంగీకరింపబడిన యాత్మను దేహబంధువులకొప్పజెప్పకుడు) ప్రార్థించియుండుటచే; పెరియనమ్బిగారు మారనేర్నమ్బి గారి చరమదశలో బ్రహ్మమేధసంస్కార మొనర్చిరి. అది తెలిసిన రామానుజులు పెరియనమ్బిగారిని సేవించి, 'స్వామీ లోకమును దిద్దుబాటొనర్ప నేనొకప్రక్కనుంచి వర్ణాశ్రమధర్మములను ప్రవర్తింపజేయుచురాగా; మీరొక ప్రక్కనుంచి చెడగొట్టుచు నచ్చుచున్నారే? పెద్దలేది జేసిన పిన్నలును నదియే యనుసరింతురుగదా! అగ్రకులజులగు మీరు తక్కువకులమున బుట్టిన మారనేర్నమ్బికి చరమ సంస్కార మొనర్పతగునా? యనియడుగ; పెరియనమ్బియు యతిరాజులనుజూచి జీయరే! ఇక్ష్వాకువంశమున నవతరించి సామాన్యధర్మమును బయల్పఱచిన శ్రీరామచంద్రునికన్న

నేగొప్పవాడనా? జటాయువుకన్న నీతడు తక్కువవాడా?! సామాన్యధర్మనిష్ఠుడగు ధర్మరాజునకన్న నేనధికుడనా! విదురునికన్న నీతడు తక్కువవాడా?! భాగవతవైభవమును ప్రకాశింపజేసిన శ్రీమన్నమ్మాళ్వార్లనుగ్రహించిన తిరువాయ్ మొళ్రిలోని నెడుమాఱ్కడిమై పయిలుంశుడరొళి యనెడి పాశురార్థమెల్ల సముద్రఘోషయేనా?; ఎంతటి ఛండాలురైనను విష్ణుభక్తికలిగి ఆచార్యులయనుగ్రహమునకు పాత్రులగుచో వారే నా స్వాములని నమ్మాళ్వారులనిరిగదా యనిదెల్ప యతిరాజులు మిక్కిలి సంతసించిరి.

## మూగవానికి ముక్తినిచ్చుట

ఉడైయవరు లొకనాడు కూరత్తాళ్వాన్ మొదలగు ప్రధానులెల్లరకును శ్రీభాష్యాది గ్రంధకాలక్షేపము జెప్పుచుండ, నొకమూగవాడు ప్రక్కగనిలువబడి తనగతియేమి? యన్నట్లు బిక్కమొగముతో గన్పింప; నాతని యార్తిని జూచి రామానుజులాతని చేయిబుచ్చుకొని లోనకు దీసికొని పోయి తలుపుమూసి తనపాదములనుజూపి యివియే రక్షకమని నమ్మియుండుమని సంజ్ఞచే తెల్పగా; తలుపునగల రంధ్రముగుండా లోన జరుగునది జూచిన కూరేశులు అయ్యో! శాస్త్రములనెల్ల జదివి నష్టపోతినే? మూగను అజ్ఞుడను నగుచో నాకును నీ రహస్యము జెప్పియుండెడివారేగదా యని విచారించిరి.

## ఆచార్యులే మోక్షోపాయము

తిరుక్కోట్టియూరినంబిగారు తమగృహమున ధ్యాన మున నుండగా, నొకమారు రామానుజులు సేవించి, మీ ధ్యానమేది? జపించుమంత్రమేది? యన; ఆచార్యవిగ్రహమే సదాధ్యేయము, వారితిరునామమే సదాజప్యమని దెల్పిరి.

## ధనుర్దాసుని చరిత్ర

శ్రీరంగ సమీపమున నిచుళాపురమను నామాంతరముగల తిరువరైయూరున మల్లయుద్ధవిశారదుడగు ధనుర్దాసుడను పేరుగలవాడొకడుండెను. అతని భార్యపొన్నాచ్చిలేక హేమాంబయను పేరుగలది, నేత్రసౌందర్యము మిక్కుటముగా గలదియై యుండెను. వారిరువురును నొకమారు శ్రీరంగనాథునకు జరుగుచున్న పవిత్రోత్సవమును జూచు వేడుకతో శ్రీరంగమున కేగిరి. వారచ్చట కావేరిలో స్నానమాడి ఆలయమునకు పోవుచుండ సూర్యోదయ సమయమగుటచే బాలసూర్యుని లేతకిరణములామె ముఖముపై బడెను. అదిచూచిన ధనుర్దాసుడు తన భార్య నేత్రసౌందర్యమున కెచట వాడు గల్గునో యనెడి భీతిచే సూర్యునికాంతి కడ్డముగ తన ఉత్తరీయము నడ్డుపట్టి వెనుకకు నడుగులిడుచుండెను. అదే సమయమునకు కావేరికి స్నానార్థమై వచ్చిన రామానుజు లిదిజూచి ఆశ్చర్యపడి, ధనుర్దాసును పిలిచి,

యేమి చేయుచుంటివని యడిగిరి. అందులకాతడు, స్వామీ నా భార్య కనుల యందము కందిపోకుండ సూర్యకిరణములు సోకని విధముగ ఉత్తరీయము నడ్డుపట్టి నడచుచుంటినని సమాధానమిచ్చెను. అందుకు యతిరాజు ఇంతకంటె మిక్కిలి యందమగు కనుల జూపెదను రమ్మని వెంటనిడుకొని శ్రీరంగనాథుని విశాలనేత్రములను జూప, నాతడు అపరిమితానందమునొంది భార్యతోగూడి రామానుజుల నాశ్రయించి సకలవిధ హితములను బడసి నత్యంతవిశ్వాసపాత్రుడై యుండెను. రామానుజు లీదంపతులకు తనయందు గలిగిన విశ్వాసపూర్తి కెంతగనో సంతసించిరి. రామానుజులు కావేరియందు స్నానమాచరించి తిరిగివచ్చుచు ముదలియాండాన్ల భుజముపై తడిబట్ట నడ్డగనుంచుకొని చేయివేసుకొని నడచుచు మార్గమధ్యమున సాముగరిడీల నొనర్చి ఒంటిచెమటతో తిరిగివచ్చెడి ధనుర్దాసునిచూచి దగ్గరకుపిలిచి వాని భుజముపై రెండవచేయివైచుకొని మఠమును జేరి భగవదారాధనాదుల-నొనర్చెడివారు.

ఇది జూచిన సన్నిధి వైష్ణవులెల్లరును గుసగుసలు చెప్పుకొనెడివారు. ఒకనాడు వారు రామానుజులనుజూచి స్వామీ! యీ ధనుర్దాసుడు మిక్కిలి యల్పుడు, సూద్రుడు, వేదాన్తము నధ్యయన మొనర్పలేదు. ఇట్టివానిని మీరింతగ నాదరింపవచ్చునా? యన; రామానుజులు చిరునవ్వుతో విని యూరకుండిరి.

ఆ నాటిరాత్రి రామానుజు లొక వైష్ణవుని బిలిచి ఆరవైచియున్న వైష్ణవుల ఉత్తరీయములలో నొక గోచీగుడ్డ మాత్రము పీలికల చించుకొనిరమ్మని యాజ్ఞ యిడ నాతడట్లే చేసెను. మరునాటి యుదయముననే స్నానములాచరించి ఆరవైచిన బట్టలుకట్టుకొన వచ్చిన వైష్ణవులు తమ యుత్తరీయములు చించియుండుటజూచి యొకరితోనొకరు కలహించుచు నీవే చేసితివన నీవేయీపని చేసితివని దుర్భాషలాడ దొడగిరి. అది వినిన రామానుజులు వారల సర్దుబాటొనర్చి యా రాత్రికి ఇరువురు వైష్ణవస్వాములను బిలిచి, ధనుర్దాసుని యింటి కేగి నిద్రించెడి యాతని భార్య ఒంటిమీదగల నగల నామెకు తెలియనట్లు దోచుకొనిరండని యాజ్ఞాపింప, నా వైష్ణవు లిద్దరును, ధనుర్దాసు నింటి కేగి హేమాంబ ఒంటిపై ఎడమప్రక్కనగల నగలెల్ల ఒలుచుకొనిరి. ఇంతలో నామెకు మెలుకువగలిగి, పడకటింటగల సన్నని దీపపుకాంతిలో వచ్చినవారలు వైష్ణవులుగా గుర్తించి కుడిప్రక్కకు దొర్లి పరుండెను. ఆ వైష్ణవులామెకు మెలుకువ వచ్చుటచే తమను గుర్తించునేమోయని భయపడి, కుడిప్రక్కనగల నగలను దోచుకొనకయే వెడలి, తెచ్చినవానిని రామానుజుల కిచ్చిరి.

ఉదయముననే నిద్రలేచిన ధనుర్దాసుడు, భార్య ఒంటిపై యెడమప్రక్కన గల నగలు లేకపోవుటనుజూచి,

ఒకప్రక్కనే నగల ధరించితివేమి? యని యడిగెను. అందుల కామె, రాత్రి యిద్దరు వైష్ణవులు వచ్చి యొకప్రక్కన నగలను దీసికొనిరి, రెండవప్రక్కనగల నగలగూడ దీసికొనుటకు వీలుగ దొర్లితిని, నాకు మెలుకువగల్గి తమను జూతునేమో యను భయమున వారు రెండవప్రక్క నగల తీసికొనక వెడలిపోయిరని దెల్పెను. ధనుర్దాసుడు భార్యపై కోపగించి, నీతో నాకు పొత్తులేదని జెప్పి యతిరాజుల వద్దకేగెను. హేమాంబయు నాతని వెనుకనే యతిరాజుల మఠమునకు జేరెను. ఉడైయవరులు వీరిద్దరిని జూచి విషయమేమని వైష్ణవులందరి యెదుట నడిగిరి. అందులకు హేమాంబిక యతిరాజులతో స్వామీ! రాత్రి నిద్రించునపు డిద్దరు వైష్ణవులు వచ్చి నా యెడమప్రక్కనగల నగల దీసుకొనగా, మెలుకువగలిగి చూచితిని; వారు వైష్ణవులగుటచే వారలకెంతటి యవుసరముగల్గి భగవద్భాగవత ఆచార్యకైంకర్యమునర్ప వచ్చియుండిరోయని రెండవప్రక్క నగలగూడ దీసికొని పోవుటకు వీలుగా కుడిప్రక్కకు దొర్లితిని; కాని నేను లేచెదనేమోయని భయపడి వారు పారిపోయిరి; యిందేమైన నా తప్పుగలదా? యనెను. అంతట ధనుర్దాసుడు స్వామీ యీామె వచ్చినవారు వైష్ణవులని తెలిసియు వారికి కావలసినట్లు వారే దొర్లించి రెండవప్రక్క నగల దీసికొని పోదురని, కదలక పరుండవలసియుండగా. స్వతంత్రించి తానే దొర్లుటచేతగదా స్వాములకు రెండవప్రక్కనగలు తీసికొని

పోవుటకు వీలుపడలేదు; ఇంతటి స్వతంత్రురాలతో నాకేమి పని యనెను.

ఇట్లు వీరిద్దరు జెప్పిన సమాధానముల కచ్చటనున్న వైష్ణవులెల్లరు నాశ్చర్యపడిరి. అప్పుడు ఎమ్బెరుమానార్లు వైష్ణవులజూచి, స్వాములారా! చూచితిరా! మీరు మీమీ యుత్తరీయములలో చిన్నపీలికగుడ్డ నెవరో చింపుకొనగా; ఇచ్చట వైష్ణవులేగదా యున్నవారందరును, వారలలో నెవరికో యవుసరమొచ్చియుండునని యాలోచనలేక, నోటి కొచ్చినట్లెల్ల మాట్లాడితిరి, మీరందరు బాగా చదువుకొన్న వారు, సంపన్నులు, గొప్పకులమున బుట్టినవారునైయుం డియు నిట్లు ప్రవర్తించిరి, ఈ ధనుర్దాసు దంపతులు తక్కువ కులమునబుట్టి చదువులేక సామాన్యకుటుంబీకులైయుం డియు భగవద్భాగవతాచార్య నిష్ఠులైయుండిరి. ఇట్టి వీరి యందు మీరు అసూయతో ప్రవర్తించుట తగదని మంద లించి, ధనుర్దాసుదంపతులకు వారి నగలనెల్ల వారికిప్పించి బుజ్జగించి పంపిరి.

మరియొకనాడు వైష్ణవులు కొందరు రామానుజుల వద్దకేగి యీయాత్మకాచార్యులెందరని యడుగ, ధనుర్దా సుని భార్యనడిగిన మీకీ విషయము తెలియునని బల్కిరి. వారేగి యామెనడుగ నామెయు, కొప్పువిప్పి, విదిల్చి,

మరలముడివేసికొని సూర్యునికేసిజూచి నమస్కరించి యింటి లోనికేగి వాకిలిమూసి దాసికేమి తెలియును? ఆచార్యులనే యడుగుడనెను. వారలు తిరిగివచ్చి రామానుజులతో నామె చేసినవిధమును జెల్ప; వారును, కొప్పువిప్పి దులుపుటచే కొప్పులోని వెంట్రుకలవలె నఖిలవైష్ణవులు నాచార్యులే యనియు; ముడివేయుటచే నందరిపూర్తియు నొకనియందే కలదనియు; సూర్యునిజూచి నమస్కరించుటచే నాపూర్తి రామానుజదివాకరః యని నాయందేకలదనియు; లోనకేగి తలుపుమూయుటచే నింతకన్న జెప్పదగినది లేదనియు దెల్పె ననిరి. అది వినిన వైష్ణవులెల్లరును రామానుజులకన్న పర దైవము లేదని నమ్మి ఆశ్రయించియుండిరి.

## భాగవతాపచార క్రౌర్యము

శ్రీరంగనాధుని యుత్సవకాలమున నొకనాడు శ్రీరంగమున కూరేశులు ఇంటిముంగిలి నూడ్చి నీరుజల్లు చుండిరి. అదే సమయమున కొక శ్రీవైష్ణవుడు దారినపోవు చుండెను. కూరేశులు జల్లెడి నీరు గాలితాకున నావైష్ణవు నిపై బడ, తెల్లని తనవస్త్రములు చెడుటను జూచిన వైష్ణ వుడు కోపముతో కూరేశులను దూషించి వెడలెను. కూరేశు లును భాగవతాపచారము గల్గినదే యని మిక్కిలి చింతించిరి.

అంతట కొన్నాళ్ళకు ఆవైష్ణవుడు చనిపోగా నాతనిని

యమభటులు దీసికొనిపోయి యమధర్మరాజు యెదుట నుంచిరి. యముడాతనిని జూచి శ్రీవైష్ణవులను శిక్షింప నాకధికారము లేదు; తెలియక నా దూతలు మిమ్ముపట్టి తెచ్చిరి. క్షమింపుడని ప్రార్థించి పంపివైచెను. ఆవైష్ణవుడు భూమికి తిరిగివచ్చువేళకు ఆతని శరీరము దగ్ధమగుటచే నాతడు సమీపమున పడియున్న పావురపు శరీరమున ప్రవేశించి పూర్వస్మృతిగలిగి నీరు, మేతయు, మాని, శ్రీరంగనాథుని ఆలయ గోపురమున నొక గూటిలో నివసించుచుండెను.

ఇట్లుండ నొకనాటి యుత్సవమున శ్రీరంగని సేవించుటకై ఉడైయవరులును కూరేశులును ఆలయమున కేగుచుండగా; నా పావురము కూరేశుని పాదములపైబడి కదలకుండెను. అదిచూచిన కూరేశులిదేమని యచ్చెరువొందుచుండ; మీరు ముమ్మారు క్షమించితిననినచో నది లేచునని రామానుజులనిరి. అంతట కూరేశులట్లే క్షమించితినని ముమ్మారనగనే నాపక్షిరూపమును విడిచి దివ్యతేజముతోగూడి యందలి జీవుడు దివ్యవిమానమున నాకాశమున నిల్చి; కూరేశులజూచి యిట్లు జెప్పెను. 'కూరేశా! మీయెడ నపచారపడి నరకమును జేరి యమునిముందు నిలువ; నాతడు నన్ను జూచి పరమభాగవతునియెడల నపచారపడిన నిన్ను హరి సహింపడు; హరిభక్తుల దండించుటకు మాకధికారము లేదు; కావున తిరిగివెళ్ళి యెచ్చట నపచారపడితివో నచ్చ

టనే శరణుజొచ్చుమని పంపెను. భూలోకమునకు వచ్చుసరికి నా శరీరము దగ్ధమగుటచే నీపక్షిశరీరమున మిమ్ము శరణొనర్చుటకై యెదురుచూచుచుంటిని; నేటికి మీరు లభించిరి; సర్వజ్ఞుడగు నీ యతిరాజులచే మీవలన నా యపచారము క్షమింపబడినది; గాన నీ పక్షిశరీరమును వీడి యుత్తమగతి కేగుచుంటిన'ని జెప్పి వెడలిపోయెను.

అచ్చటివారెల్లరు నీ చేష్టితమును చూచియు వినియు మిక్కిలి ఆశ్చర్యపడి యతిరాజుల సర్వజ్ఞత్వమును కొనియాడిరి.

## అత్తుళాయమ్మ వైభవము

శ్రీరంగమునందలి శ్రీవైష్ణవస్వాములందరును నొకటిగజేరి పెరియనమ్బిగారు మారనూరినంబిగారికి చరమకైంకర్యము జేసినందులకుగా వెలివేసి, యెవ్వారిండ్లకుగాని ఆలయమునకుగాని వెళ్ళుటకు వీలులేదని నిర్బంధపెట్టిరి. మహాపూర్ణులను మరొకపేరుగల పెరియనంబిగారును నిది యంతయు హరిలీలగా దలచి సంతసించుచు స్వగృహముననే భగవద్గుణానుభవమొనర్చుచు నుండిరి.

అంతట నొక్కనాడు శ్రీరంగనాథుడుత్సవమున నూరేగుచు రాగా, పెరియనంబిగారి కుమార్తెయగు నత్తుళాయమ్మ అడ్డముగ నిల్చొని, యందరు వినునట్లు స్వామిని

జూచుచు 'కస్తూరిరంగా! మానాయనగారు నీ దివ్యశాసనరూపమగు విశేషధర్మమును పాటించగా, నీ వైష్ణవులెల్లరు మాతండ్రిని వెలిబెట్టినను, నీ వుపేక్షించుట తగదు గాన మాతండ్రి వెలిదీర్చిగాని నీ వాక్కలియడుగేని కదలుటకు వీలులేదు, లక్ష్మిపైనొట్టుసుమా' యనెను. అత్తుళాయమ్మ ఆనమేరకు కస్తూరిరంగడు కదలకయుండి, అర్చకముఖముగ నావేసించి పెరియనంబిగారిని బ్రహ్మరథమర్యాదతో తోడ్కొనిరండని యచ్చటిస్వాముల నాజ్ఞాపింప, వారట్లొనర్చిరి. నాటినుండియు స్వాములెల్లరును పెరియనంబిగారియందత్యంత భక్తిశ్రద్ధలతో మెలగదొడగిరి.

## శ్రీవైష్ణవ లక్షణము

శ్రీరంగమున నొకనాడు యతిరాజులు మఠమున నుండగా; నొక వైష్ణవుడు వచ్చి, యతీంద్రునితో వైష్ణవుడెట్లుండవలెనని యడుగ; యతిపతియు, తిరుమలలోనున్న శ్రీశైలపూర్ణుల నడుగుమన, నాతడేగి వారినడిగెను. తిరుమల నంబిగారేమియు జెప్పక నచ్చటనే కొంతకాల ముండుమన నాత డచ్చట నుండెను.

శ్రీశైలపూర్ణులా వైష్ణవున కొకనాడు బ్రహ్మచారుల పంక్తిలో భోజనమిడిరి. చిన్నతనమేమియు లేక నాతడు భుజించెను. రెండవనాడు అధ్యాపకుల గోష్ఠిలో భోజన

మిడిన, నట్లేయారగించెను; మూడవనాడు బ్రహ్మవేత్తల పంక్తిలో భోజనము పెట్టించిన నచ్చటనే యారగించెను.

మరునాటి ఉదయమున నంబిగారు భగవదారాధనాది నిత్యవిధులెల్ల దీర్చుకొని, యాతనిజూచి, ఓయీ వైష్ణవుడు గుఱ్ఱము, కొంగ, కోడి, నీవలె నుండవలెనని దెల్పిరి. అంతట నాతడు శ్రీరంగమునకేగి యతిరాజుల కీ విషయము దెల్పి తనకేమియు తెలియలేదని ప్రార్థింప ఉడైయవరు లాతనికిట్లు దెల్పిరి.

గుఱ్ఱము తాను జూచెడి దారినే తలచుచు నటేపరుగెత్తుచుండుటచే త్రికరణములచే నొకేలక్ష్యమును గలిగి యుండును. అట్లే వైష్ణవుడును తాను జేరదలచు లక్ష్యమును బొందుటకై త్రికరణశుద్ధి గల్గియుండవలెను.

కొంగ నీటియొడ్డున నిల్చి చిన్నచేపలెన్ని తనదగ్గరకు వచ్చినను వాని నపేక్షింపక తనకు తగిన పెద్దచేపకై నిరీక్షించుచుండును. అట్లే వైష్ణవుడును తానున్నచోట క్షుద్రపురుషార్థములెన్ని యందుబాటులోనున్నను వానిని లక్ష్యపెట్టక పరమపురుషార్థమగు మోక్షమునందే చూపు గలిగి యుండవలెను.

కోడి, చెత్తగలచోటజేరి తనకాళ్ళతో చిమ్మి యందులోని సారమగు తనయాహారమునే గొనును. అట్లే వైష్ణవు

డును, క్షుద్రపురుషార్థములను దెలుపు అసారములును అల్పసారములును సారములు సారతరములునునగు శాస్త్రములవిడిచి సారతమమగు శాస్త్రము నాశ్రయించవలెను.

దురభిమానముతో చెడక, విద్యార్థుల అధ్యాపకుల బ్రహ్మవేత్తలనడుమ నెచ్చట భోజనమిడినను భగవద్గుణానుభవమొనర్చుచు భగవత్ప్రసాద ప్రతిపత్తితో నీవలె నారగించవలెను.

కావున శ్రీశైలపూర్ణులు వైష్ణవలక్షణముల నిట్లు జెల్పిరనిరి.

## జలజంతు మోక్షప్రదానము

ఒకనాడు లక్ష్మణయోగీంద్రు లొక పుష్కరిణిలో స్నానమాడి, కాలకృత్యములు సల్పుకొనుచుండగా, నాశ్రితులు జూచి వారికి నమస్కరించి; స్వామీ! యీసరస్సులోని సకల జంతువులకు గరుణతో మోక్షమీయరాదా! యని ప్రార్థింప; నమ్మహాత్ములును సుప్రసన్నులై కరకమలములు మోడ్చి హరిని దలంచ; సరసునందలి జంతువులెల్ల తమ కాయములనెల్ల వీడి దివ్యదేహములతో దివ్యవిమానములతో నాకసమున నిల్చి సంయమీంద్రులకు ప్రమొక్కి సూర్యమండలము భేదించుకొని ప్రకృతినిదాటి పరమపదమొందెను.

## యతీంద్రుల సర్వజ్ఞత

ముదలియాండాను ప్రియపుత్రుడగు కందాడయాం డాన్ అనునాతడు శ్రీపెరుంబూదూరున భగవద్రామానుజ అర్చావిగ్రహ ప్రతిష్ఠజేయించుచు బంగరుకుంచచే కనుల తుడిపించు సమయమున; శ్రీరంగమున కాలక్షేపగోష్ఠియం దున్న లక్ష్మణార్యులు తమ కన్నుల చేతులతో మూసికొనిరి. అచ్చటి స్వాములిదేమి?యని యడుగ నుడైయవరులు అది కందాడయాండాను కృత్యమని దెల్పిరి. తరువాత కొన్నినా ళ్ళకు భూతపురినుండి కొందరు స్వాములురాగా వారివలన నచ్చటి వృత్తాంతముల నెఱిగి కాలక్షేపగోష్ఠివారు దేశికేం ద్రుల సర్వజ్ఞతకు కొనియాడిరి.

## గోష్ఠీపూర్ణుల పత్ని వైభవము

తిరుమలలో జరుగు శ్రీవేంకటేశుని బ్రహ్మోత్సవ ముజూడ కొందరు శ్రీవైష్ణవులు ప్రయాణమై వెడలుచు, మార్గమధ్యమునగల గోష్ఠీపూర్ణుల యింటికే తెంచిరి. ఆ సమ యమునకు తిరుకోట్టియూరినంబిగా రింటియందు లేరైరి. వేరుధాన్యమింటియందు లేకపోవుటచే నంబిగారి భార్య విత్తనధాన్యమును దంపించి వైష్ణవతదీయారాధనము సల్పెను. ఆ స్వాములందరును సాపడి తమదారిన వెడలిరి. కొంతసేపటికి గోష్ఠీపూర్ణులింటికే తెంచి విత్తనపుధాన్యము

కన్పించక పోవుటచే నేమాయెనని యడుగ; వారిదేవి యా ధాన్యమును పరమపదమున వి త్తితినని సమాధానమీయ నంబిగారు విషయము తెల్సుకొని భార్యయొక్క భాగవత నిష్ఠకు మిక్కిలి సంతసించిరి.

## శ్రీరంగామృతకవీంద్రుని చరిత్రము

శ్రీరంగమున, శ్రీరంగామృతకవీంద్రుడను నొక బ్రాహ్మణోత్తముడు గలడు. ఆతడు మిక్కిలి మేధావియు సుకవియు మిశ్రమభక్తుడును మదత్రయముగలవాడునై యుండెను. ఆతనికి సకలశాస్త్రములందును సమర్థులగుననేకులు శిష్యులుండిరి. వారెల్లరును నిత్యము నాతనియింటి యందు గోష్ఠిగజేరి శాస్త్రచర్చలొనర్చుచు, కొందరు వేణు మృదంగ వీణానుగుణముగ మనోహరముగ సంగీతము పాడుచుండ, మరికొందరు నాట్యములు సల్పుచుండ, శ్రీరంగామృతకవీంద్రుడు ఊయలనూగుచు కర్పూరతాంబూలము నములుచు శృంగారప్రీతుడై భోగానుభవమునర్చుచుండెడి వాడు.

ఇట్లుండ, నొకనాడు ఉడైయవరులు కూరేశులతో గూడి వీధివెంట నాతని యింటిముందునుండి వెడలుచు లోన నుండి వినబడు వాద్యయుక్తమగు శ్రావ్యమగు సంగీతమున కటువైపు జూచిరి. సింహద్వారము తెఱచియుండుటచే

నూయలలో నూగుచున్న కవీంద్రుడు గానవచ్చెను. యతిరాజులు కూరేశులజూచి యెట్లైన నీ రసికుని సాత్వికుని జేసి మన దాసు నొనర్పుమని యానతీయ; కూరేశులాతని నారుమాసములలో ననుకూలు నొనర్పగలనని విన్నవించెను.

నాటినుండియు ప్రతిరోజును కూరేశులాతనియింటి కేగి విద్వద్గోష్ఠిలో నొకప్రక్కన గూర్చొనుచుండెను. ఇట్లారుమాసముల కొకటిరెండురోజులు తక్కువగ కాలము జరిగినను కవీంద్రుడు వీరిని గమనింపక గానలోలుడై యుండ, కూరనాథు లీతనికి తనశక్తిని బయల్పఱుపనెంచి నాటిగోష్ఠిలోని పండితులెల్లరిని వారివారిశాస్త్రములయందలి విశేషార్థములగూర్చి ప్రశ్నింప, నిరుత్తరులై దాసోహమొనర్చిరి. ఇది గమనించిన కవీంద్రు డూయలదిగి యఖిలశాస్త్రముల బరీక్షించి సర్వజ్ఞుడని గుర్తించి, కూరేశున కొక యున్నతాసన మిడి గూర్చుండ ప్రార్థించి తన సంశయముల నిట్లడుగ దొడగెను.

కవీంద్రుడు:- విభూతి రుద్రాక్ష తిర్యక్పుండ్రముల మీరేల నాదరింపరు?

కూరేశులు:- భస్మాదులు శైవ పాశుపతాంగములుగాని కర్మాంగములుగావు.

శ్లో॥ రుద్రాక్షం రుద్రనిర్మాల్యం, లీలయాపినధారయేత్,
యఃకామాద్ధారయేత్కశ్చి, ద్ద్విజశ్చాన్ద్రాయణంచరేత్.

విలాసమునకైనను రుద్రాక్ష రుద్రనిర్మాల్యాదులు విప్రుడు ధరింపనర్హములుగావు. కోరికతో నేబ్రాహ్మణుడైన ధరించెనేని యతడు చాంద్రాయణరూప ప్రాయశ్చిత్తార్హుడగునని ముద్గలస్మృతియందును

శ్లో॥ త్రిపుండ్రధారిణంవిప్రం, యచ్ఛ్రాద్ధేభోజయిష్యతి,
నష్టంభవతితచ్ఛ్రాద్ధం, దాతాచనరకం వ్రజేత్.

త్రిపుండ్రధారియైన బ్రాహ్మణుని శ్రాద్ధకర్మయందు నియమించినచో నాశ్రాద్ధకర్మ నిరర్థకమగుటయేగాక కర్త నరకమున బడునని హారీతస్మృతియందును చెప్పబడియుండుటచేత మేమాదరింపము.

క- తప్తచక్రాంకన ఊర్ధ్వపుండ్రధారణమునకు ప్రమాణమేమి?

కూ-నీవు పండితుడవేగావున, వారాహ అధర్వణ మహోపనిషదాది హారీత వ్యాస పరాశరాది శృతిస్మృతులు చూడుము.

క- శ్రీశఠకోపాది దివ్యసూరుల జననక్రమము, వారి ప్రబన్ధములకు వేదప్రామాణ్యము నెట్లు?

కూ-మార్కండేయ, బ్రహ్మాండ, బ్రహ్మకైవర్త, వృద్ధపాద్మ, నారదీయ, స్కాందోక్త, వైష్ణవసంహితా శ్రీమహాభాగవతాదుల జూడుము.

క- సర్వదేవతలకన్న నధికుడని శాస్త్రప్రసిద్ధుడైన శివుని మీ రనాదరింతు రేమి?

కూ- వేదమున 'ఏకోహ వై నారాయణ ఆసీత్; దివ్యో దేవ ఏకో నారాయణః, శుద్ధో దేవ ఏకో నారాయణః నద్వితీయోస్తి కశ్చిత్; తత్త్వం నారాయణః పరః' మొదలుగ మహాత్ము బాల నారాయణ తైత్తిరీయాద్యుపనిషత్పరాశర పారా శర్యాది భారతీశతంబులచే జగజ్జన్మాదికారణమును పరతత్త్వమును పరమ పావనుడును నారాయణుడేగాని యితరుడుగాడని చెప్పబడియుండుటచేత, పరమసాత్త్వి కులగు మోక్షేచ్ఛగలవార లన్యదేవతల నారాధింపరు.

క- అయినచో మీరు గాయత్రినేల ఉపాసింతురు?

కూ- గాయత్రీమంత్రము సూర్యమండల అంతర్వర్తియగు నారాయణైకపరమని సర్వవేదాన్తప్రసిద్ధము.

క- శ్రీరామభద్రప్రతిష్ఠాపిత హరుడు అధికుడు కాదా?

కూ- ఈ విషయము వాల్మీకిరామాయణమున లేదు.

క- రావణబ్రహ్మహత్యానిర్హరణార్థము శ్రీరాముడు లింగ ప్రతిష్ఠయొనర్చెనుగదా?

కూ- రాక్షసునిజంపుట దోషావహముగాదు. అంతియెగాక 'ఆతతాయినమాయాన్తం హన్యాదేవావిచారయన్, ఆత తాయివధేదోషో హన్తుర్భవతికశ్చన' యని మనుస్మృతి

యందు ఆతతాయి యనబడు పరదారాపహరణాదు లొనర్చిన దశకంఠుని వధించుట విధిచోదితమేగాని నిషిద్ధముగాదు. గురువైనను సర్వసాధనములతోగూడి యుద్ధరంగమున నెదుర్కొన్నచో చంపుట పాపము గాదని పంచమవేదమగు మహాభారతప్రసిద్ధమైయుండ యుద్ధమునందెదిర్చిన రావణునివధించుట పాతకమెట్లగును. పాపాత్ముల పాపములనెల్ల నామస్మరణమాత్రముననే పారద్రోలగల రామచంద్రునికి పాపముగలదనిన పాపాత్ముని పాపమునకు హద్దుగలదా

క- వాల్మీకిప్రోక్తముగాకున్నను శ్రీరామభద్ర శివలింగప్రతిష్ఠ ప్రసిద్ధమేగదా?

కూ- సార్వభౌముడగు రాజు దేశపరిపాలనార్థముగ నొక చోట నొకయధికారిని ప్రతిష్ఠించినట్లు, శ్రీరామచంద్రుడు తాను నిర్మించిన సేతువును రక్షించుటకై దాని సమీపమున తనభక్తుడగు శివుని ప్రతిష్ఠింప నతడు తన భార్యతోగూడి శ్రీరామతారకమంత్రజపైక పరాయణుడై వాని శ్రీపాదతీర్థముచే నిత్యస్నానపానము లొనర్చుచు నానందించుచుండుటచే పురాణాంతరముల జెప్పబడిన 'శివలిఙ్గప్రతిష్ఠాతా' యనెడి మాట వ్యర్థముగాదు.

ఈ విధముగ శ్రీరంగామృతకవీంద్రుడు తన సంశయములనెల్ల కూరేశులవలన నెఱిఁగి, యానందముతో భక్తి

పూర్వక ప్రదక్షిణప్రణామము లొనర్చి శిష్యునిగా గైకొ మ్మని ప్రార్థింప, నమ్మహాత్ము డాతనిని యతిపతివద్దకు దోడ్కొనిపోయి వారిపాదములపై బడవేయ, యతిశేఖరు లును కూరనాథులజూచి యీతనిని మీరే సంపాదించితిరి గాన, వీనికి మీరే సకలహితముల సలుపుడని యాదేశింప, గురునాజ్ఞచే కూరేశులు కవీంద్రులకు పంచసంస్కారాది సకలహిత ప్రదానంబొనర్చి శ్రీవైష్ణవ శ్రేష్ఠునొనర్చి ఎమ్బె రుమానారులనే యాచార్యులుగా భావింపుమని జెల్ప నాత డును ఆచార్యాభిమత కైంకర్యము లాచరించుచు శ్రీరంగ మున సుఖముగ నుండెను.

ఇట్లున్న కాలమున శ్రీరంగామృతకవీంద్రులు తిరువ రంగత్తముదనార నెడి ద్రావిడనామాంతరమున బ్రసిద్ధులై ఆచార్యమనఃప్రీతికరముగ ప్రతిపాశురమునను ఆచార్య నామమునుజేర్చి 108 పాశురములుగల 'ఇరామానుశనూత్తన్దాది' యను దివ్యప్రబన్ధమును రచించి కూరేశునకుజూప వారలతని దోడ్కొని శ్రీరంగనాథుని సన్నిధిన ఉడైయవరు లున్న తరిని సేవింపజేయ అముదనారాగ్రంథమును వినిపింప యతిరాజులు మిక్కిలిసంతసించి శ్రీరంగనాథుని శఠకోప ప్రసాదమాల్యచందనాదుల బహుమానింపజేసిరి.

అంతట ఉడైయవరులు అముదనారుతోగూడి తిరువ రంగప్పెరుమాళరయరు గృహమునకేగి 'ఇరామానుశనూ

త్తన్నాది' దివ్యప్రబన్ధమును నాలాయిరప్రబన్ధములలో జేర్పించిరి. నాటినుండియు నా దివ్యప్రబన్ధము ప్రపన్నజనుల కత్యంతాదరణీయమై ప్రపన్నగాయత్రియను పేరున ప్రసిద్ధమైయున్నది.

## ఆచార్యనిష్ఠ

ఉడైయవరు లొకమారు తన యాశ్రితులెల్లరను తగిన కైంకర్యముల నియోగింప, నొకవైష్ణవుడు తనకేమియు నాజ్ఞాపించకపోవుటకు మిక్కిలి విచారించెను. అది యెఱిగిన యతీంద్రులాతనికి నిత్యమును నీ పాదతీర్థము మాకిమ్మనిరి.

అప్పటినుండి యాతడుదయముననే నిత్యవిధులదీర్చుకొని వచ్చి యెమ్బెరుమానార్ల వాకిలిప్రక్కనే నిలిచియుండెడివాడు. రామానుజులు భగవదారాధనము పూర్తిజేసికొని వచ్చి యావైష్ణవుని పాదప్రక్షాళన మొనర్చి శ్రీపాదతీర్థమును బుచ్చుకొనెడివారు. ఇట్లు జరుగుచుండ మఠమునన్న వైష్ణవులీ యబ్బురమునకు గుసగుసలుపోదొడగిరి. అది విని రామానుజులొకనాడు వైష్ణవుని శ్రీపాదతీర్థము గొనక భగవదారాధనానంతరము కార్యాంతరమున వెడలిపోయిరి. నాటిపగలెల్లగడచి రాత్రియైనను నా వైష్ణవుడు కదలక నచ్చటనే చేతులుజోడించుకొని నిల్చియుండెను. మఠమునందలి స్వాములెల్లరును స్నానపానభోజనాదులకు బిలి

చినను నీతడు నా కైంకర్యపూర్తిగా లేదని దెల్పి కదలక యట్లే యుండెను. మరునాటి యుదయమున ఉడైయవర్లు మామూలుగ భగవదారాధనపూర్తి జేసికొని వచ్చి యావైష్ణవుని శ్రీపాదతీర్థముగొనిరి. అంతట నా వైష్ణవుడు నాటికి తన కైంకర్యపూర్తియైనదని సంతసముతో వెడలి భోజనాదుల నొనర్చెను.

ఇదిజూచిన వైష్ణవులెల్లరును సిగ్గుపడి; చేయదగిన పనియనియు చేయదగనిపనియనియు విమర్శించక ఆచార్యుని యాజ్ఞను పాటించుటయే పరతంత్రుడై యాచార్యాభిమానమున నొదిగియుండదగిన శిష్యునికి కర్తవ్యమని యెఱిగి యా వైష్ణవుని ఆచార్యనిష్ఠకు ఆశ్చర్యపడిరి. ఉడైయవరులు తమ యనుష్ఠానముచే నాశ్రితులనిట్లు దిద్దుబాటొనర్చి సంతసించిరి.

## ప్రపన్న శ్రేయోమార్గము

ఒకనాడు శ్రీరంగమున ఆశ్రితులుకొందరు ఎమ్బెరుమానార్లను సమీపించి! ప్రపన్నునకు ఆత్మోజ్జీవనమున సులభోపాయమేది? యని యడిగిరి.

ఉడైయవర్లు:— నిత్యము శ్రీభాష్యమును జదువుటయు నితరులకు జెప్పుటయు జేయుడు.

ఆశ్రితులు:- శ్రీభాష్యమనిన తర్క, వ్యాకరణాది సకలశాస్త్రములందును సమగ్రమగు జ్ఞానమున్ననేగాని చదువసాధ్యపడదే? కావున నింకను సులభోపాయమును జెప్పుడు.

ఉ:- అయినచో ద్రావిడవేదవేదాన్తముల జదివి యితరులకు దెల్పుడు.

ఆ:- అయ్యో! అదియు నాల్గువేలపాశురములతో విశేషార్థములుగలిగి చాలాకాలము శ్రమించవలసి యున్నదే?

ఉ:- అగుచో సర్వేశ్వరుడు స్వయముగ నవతరించిన 108 దివ్యదేశములయందును కైంకర్యము జేయుచుండుడు.

ఆ:- స్వామీ! యిదియు శక్తియుక్తులతో గూడుకొనినదే? యెల్లరకును సాధ్యముగాదే?

ఉ:- అట్లైన యదుశైలము (మేల్కోట)న నిత్యనివాసమేర్పఱచుకొనుడు.

ఆ:- సకలమును విడిచి యచ్చటనే యుండుట యెల్లరకును నెట్లు సాధ్యము?

ఉ:- అదియుకాకున్న అర్థయుక్తముగ నిరంతరము ద్వయమంత్రము ననుసంధింపుడు.

ఆ:- ప్రకృతిలోనుండుటచే నిత్యావసరములగూర్చిన తలంపు లేక ద్వయమును అర్థముతో చింతించుచుండుటెట్లు?

ఉ:- ఇక చిట్టచివరిగా నత్యంత సులభోపాయమును దెల్పుచుంటిని, పైవేమియు జేయలేకున్నచో, అర్థపంచకజ్ఞాన సంపన్నులై, పంచసంస్కారపరులై, ఆకారత్రయపూర్తి గలిగి, పరమసాత్వికులగు పరమభాగవతోత్తములనబడు నొక శ్రీవైష్ణవస్వామిని నిరంతరము సేవించుచు వాని యభిమానమున చోటునేర్పఱచుకొని జీవించుడు. అనగా వారు, 'వీడు 'నావాడని' యభిమానించునట్లు ఒదిగి యుండుడు.

ఇట్లు దెలిపి, భాష్యకారులు మఠములోనకేగి తలుపు మూసివైచిరి.

దీనిచే ప్రపన్నునకు శ్రేయోమార్గమున భాగవతాభిమాన వసతియే సులభోపాయమని సుస్పష్టము.

## తిరుప్పావై (దివ్యప్రబన్ధ) తన్మయత

శ్రీరామానుజులకు తిరుప్పావై జీయరను ప్రసిద్ధ నామముగలదు. వీరు ఊర్ధ్వపుండ్రధారణమొనర్చునప్పుడు గాని, భిక్షాటనమొనర్చునప్పుడుగాని నిరంతరము ఆండాళ్ అనుగ్రహించిన తిరుప్పావై దివ్యప్రబన్ధము నర్థముతో ననుసంధించుచుండెడివారు.

ఒకనాటి భిక్షాటనమున పెరియనంబిగారి యింటి ముందునిలువగనే లోననుండి మహాపూర్ణుల కుమార్తె అత్తుళాయమ్మగారు తలుపు తెఱచు సరికి రామానుజులు క్రిందపడి పోయిరి. వెంటనే అత్తుళాయమ్మ లోనకు పరుగిడి తండ్రిగారి కీవిషయము దెల్ప; నంబిగారు వచ్చిచూచి, అమ్మాయీ 'ఉన్దుమతకళిత్తన్' పాశురార్థము నడుచుచున్నదా?యనిరి.

అనగా, తిరుప్పావై దివ్యప్రబన్ధమునందలి ముప్పది పాశురములలో పదునెనిమిదవదగు 'ఉన్దు' పాశురమున నంద గోపునియొక్క మేనకోడలగు నప్పిన్నపిరాట్టిని వచ్చి తలుపు తెరువుమని గోపికలు కోరుసందర్భమును అర్థముతో ననుసంధించుటచే నప్పిన్నయే వచ్చి తలుపు తెరచినట్లు (భావనా పరికర్షాతిశయమున) భావించి యామె యనుగ్రహామునకు తన్మయులైరి.

## కొంగుపిరాట్టి

ఒకనాడు రామానుజులు భిక్షాటనమున వీధివెంట నడచుచుండ నొకమేడపైనుంచి దిగివచ్చిన స్త్రీయొకతె దారి కడ్డముగ నిలిచి, కస్తూరిరంగనికన్న మిన్నగా సకలజనులు మీవెంట దిరుగుచుండుటకు కారణము, మాయయో మంత్రమో మందో మచ్చుపొడి యేదేనిగలదో? దెల్పుమ నెను. అంతట యతిపతి యామెనుజూచి మాయలు మందులు

మచ్చువాళ్ళన్నియు మా పేరుజెప్పిననే మాయమగును; సారతమమగు మంత్రరత్నమొకటి మావద్దనుండుటచే జను లెల్లరును వారివారి యిష్టముల బొందుటకై మా వెంటబడుదు రింతియే యనెను.

అంతనా సాధ్వి యా మంత్రము తనకిమ్మని ప్రార్థింప నాయతిపతి యట్లొనర్చెను. అర్చామూర్తిగ వారిపాదుక లగోరి యామె తన పమిటచెంగుపై నద్దించుకొనెను.

నాటినుండియు నామెకు కొంగుపిరాట్టియని ప్రసిద్ధి గలైను.

## అర్చకుడు విషమిశ్ర తీర్థమిచ్చుట

ఉడైయవరుల వైభవము నోర్వలేని ఆలయార్చకు డొకడు శ్రీరంగనాథుని తీర్థమున విషము గలిపి, రామాను జులకీయ యత్నించి సాహసములేక వెనుకకుబోవ; నది తెలి సిన రామానుజులు భగవత్తీర్థమున గలిసిన విషమేమియు జేయదుగాన నిమ్మని యడిగి త్రాగి నిశ్చింతగ నుండిరి. ఈ చేష్ట నెరిగిన యాశ్రితులెల్లరు నచ్చెరువందిరి.

## ఆరాయిరప్పడి యవతరణము

ఒక్కనాడు శ్రీరంగమున యతీంద్రులు వీధియందా శ్రితులతో గూడి వెడలుచుండ, ద్రవిడబాలకులు కొందరు

గుంపుగ నావముండ, నందొక్క ప్రగల్భముగాఁడైడి బాల
కుపు తోటిబాలురఁజూచి, నమ్మాళ్వార్ల దివ్యప్రబంధమగు
తిరువాయ్ మొళ్ళికి నర్థము జెప్పెద వినుఁడని ఆచార్యత్వము
నహించినట్లు వారిమధ్యప్రదేశమున గూర్చొని 'ఆడియూడి
ప్రతిఆషాఢమాసముననుఁ; ఆకంకరైందు వర్షాధిక్యముచే
ఇం[illegible] కరిగిపోయు; ఇశైప్పాడి శోకాలాపములతో నూటి
మాటికిఁ; కణ్ణీర్మల్కి కన్నులనీరుగార; ఎంగుంనాడినాడి
అంతటను వెదకి వెదకి; నరసింగా వెన్ను నరసింహాయనుచు;
వాడివాడుం ఆహారముదొరకక; ఇవ్వాణుదలే మోమును
గొట్టుకొనుచు శోషించెను;' అని అపార్థము జెప్పుచుండెను.
ఇదివినిన ఎమ్బెరుమానార్లు మిగులవగచి, అందరు స్వాములు
వినుచుండ, తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ అనెడు తమ యభి
మానపుత్రుని గటాక్షించి నారాయణుడు తన నాభిపద్మ
మున బ్రహ్మను సృజించి సంస్కృతవేదమును దెల్పినయట్లు
నమ్మాళ్వారుల నవతరింపజేసి యగ్గురునకు ద్రవిడోపనిష
దర్థతత్త్వము దెలుప, వారివలన నది నాథమునులకును. వారి
వలన పుండరీకాక్షులకును, వారివలన శ్రీరామమిశ్రుల
కు, వారివలన యామునులకు, వారివలన మాలాధరాదులకు
లభింప మాలాధరగురుడు దానిని మాకొసంగెను. ఇట్లు
రమ్యోపదేశపరంపరగా ప్రాప్తమైన నీయర్థము వ్యాఖ్యగా
నలరకున్న చోననేక అపార్థములకల్పించి బాల, మూ[illegible]లు
వర్ణింతురుగాన దీని కొకవ్యాఖ్యగల్పింపుమని [illegible]జ్ఞాపింప

పిళ్ళాన్ యతీంద్రునాజ్ఞానుగుణముగ విష్ణుపురాణసంఖ్యతో నారువేల వ్యాఖ్యనువ్రాసి యెమ్బెరుమానార్ల ముందుంచ, వారుజూచి మిగులసంతసించి, నాతాయిరప్పడియని పేరిడి, శ్రీభాష్యవ్యాఖ్యతోగూడ దీనిని ప్రవచింపుడని యాశ్రిత దేశికులకాజ్ఞయొసంగ, నేటికిని యది యాచార్యులద్వారా చెప్పబడుచున్నది.

## రంగని గుడి బీగముద్రల గొనుట

ఒకప్పుడు శ్రీరంగనాథ ఆలయఅధికారి గర్వితుడై, యతీంద్రుని శిష్యుడయ్యు నిర్లక్ష్యముచే రంగనిసేవలయం దశ్రద్ధతో నుండుటచే నిది యెఱిగిన ఉడైయవరు లాతని నుండి యధికారము తీసుకొనదలచెను. ఒకనాడాలయాధి కారి యింట శ్రాద్ధకర్మరాగా కూరేశుల నతడు నిమంత్రణ మొనర్చెను. అది తెలిసిన యతీంద్రులు కూరేశుల జూచి యెట్లైన నాతనినుండి గుడిబీగముద్రల గొని వానిని మన వశ మొనర్పుడనిరి.

కూరేశులాతని యింట నర్చితులై భోజనముముందు గూర్చుని పరిషేచన మొనర్చి ఆరగించక యున్నకుండిరి. అది జూచిన అధికారి మీకేమి కావలయునో దెల్పుడని ప్రార్థింప; కూరనాథులు శ్రీరంగనిఆలయబీగముల గోర నాతడు దెచ్చి యిచ్చెను. భోజనానంతరము కూరేశులుబీగముల దెచ్చి

ఉడైయవరులకు సమర్పింప; వారును తగువారిని నియమించి శ్రీరంగని సకలవిధకైంకర్యములు సక్రమముగ జరుగునట్లేర్పఱచిరి.

## కూరేశుని మార్దవము

ఒకప్పుడు శ్రీరంగమున యతిరాజుల మఠమున తదీయారాధన సమయమునకు పెరటిలోని అరటియాకుల కోసి తెచ్చుటకు వంటస్వామి కూరేశుల నియమింప, వారేగి యొకఆకును కోయగా దానివెంట నీరుకారుటను జూచి, అయ్యో! యిదియెంతగ బాధగల్గి దుఃఖించుచున్నదోయని తలచి చెట్టువద్దనే మూర్ఛిల్లిరి.

ఎంతసేపటికిని ఆకులగొని కూరేశులు రాకపోవుటచే ఉడైయవరు లది యెఱిగి, యట్టికార్యములకై ఆళ్వాన్లు నియమింపవలదని కట్టడి జేసిరి.

మఠమునందలి స్వాములెల్లరును ఆళ్వాన్ల హృదయ మార్దవమునకు మిక్కిలి యచ్చెరువొందిరి.

## కూరేశుని వానప్రస్థము

ఒకప్పుడు రామానుజుల సన్నిధికి యొకవైష్ణవుడు వచ్చి దుఃఖింప, వారాతని దుఃఖమునకు కారణమడుగ నాతడిట్లు జెప్పెను. స్వామీ! నాకుమాత్రై జాతకమున వైధవ్య

యోగమున్నదని యెవ్వరును వివాహమాడ నంగీకరింప కుండుటచే కన్నె చెరవీడకున్నది, అందుచే కులమెల్ల జెడుటకు భీతిల్లి దుఃఖించుచుంటినన, దగ్గర నేయున్న కూరేశు లాతని జూచి యామెను వివాహమాడుటకు తమ యంగీకారమును దెల్పిరి. ఆతడును తనకుమార్తెను కూరేశులకిచ్చి వివాహ మొనర్చెను. కూరేశులు వివాహవేదికపైననే వానప్రస్థ మును స్వీకరించిరి. దానిచే నాశ్రమముమారుట జన్మాంతర ముతో సమానమగుటచే నామెకు వైధవ్యదోషము తీరి పోయెను. (ఈమె రెండవభార్యగావలెను). ఇట్లు కూరేశులు దయతో కన్నియ తండ్రి దుఃఖమును తీర్చుటకు రామాను జులు సంతసించిరి.

## గొల్లదానికి మోక్షమిచ్చుట

యతిరాజుల మఠమునకు నిత్యము పెరుగుపోసెడి యొక తొండూరుకొండయను పేరుగల యామె వడుగనంబిచే తీర్థప్రసాదముల గొనుటచే గల్గిన జ్ఞానముచే నాగొల్లవనిత నెలవారిగ పెరుగుపోసినందులకు వంటస్వామి తగినపైకము నీయబోగా నొకమారామె తిరస్కరించెను. అది తెలిసిన రామానుజులు పైకమునేలతీసికొనలేదని యాగొల్లనడిగిరి. అందుల కాగొల్ల స్త్రీ, స్వామీ ఖర్చుగునీపైకమునకన్న తర గని సంపద నిండని కోరెను.

అందులకు ఎమ్బెరుమానార్లు తరగని సంపదయన్న నేమి? యనగా, నామెయు మోక్షమిమ్మని కోరెను. రామానుజులును, మోక్షమిచ్చువాడు జనార్దనుడుగదా? యన; నా గొల్లది భగవానుడైనను మీ యంగీకారమున్ననే మోక్షమిచ్చునట! మీ రంగీకరింపనివానికి మోక్షమీయడట! అందుచే దాసినగు నాకు మోక్షమిమ్మని వేంకటేశునకు చీటీవ్రాసియిండని నిర్బంధించి, వారి చేవ్రాలుగల పత్రికను దీసికొనిపోయి వేంకటేశ్వరునకు సమర్పించి యందరు జూచుచుండ శరీరమును వీడి పరమపదించెను.

## అనంతార్యాన్ల వైభవము

ఆచార్యులగు రామానుజుల ఆజ్ఞానుగుణముగ తిరుమలలో శ్రీవేంకటేశ్వరుని కైంకర్యమొనర్చుచున్న అనంతార్యులు తానునిర్మించిన పూదోట సమీపమున నొక చెరువు త్రవ్వుచు గర్భిణియగు తనభార్యకు మట్టితట్టను తలకెత్త నామె యొడ్డున పోసివచ్చెడిది. ఇది జూచిన వేంకటేశుడు బాలునిరూపమున నామెకు ఎదురుగవచ్చి యాతట్టను అందుకొని గట్టుపైపోసి వచ్చుటచే నామె త్వరత్వరగా వచ్చుటను జూచిన అనంతార్యులిదేమని యడుగ, నొకబాలు డెదురుగవచ్చి తట్టనందుకొనుచుండుటచే త్వరగా వచ్చుచుంటినని చెప్పెను. ఏనవో నాబాలుని జూపుమని అనంతార్యులు భార్యతోననగా; నామె గట్టుపైనున్న బాలుని

జూపెను. అంతట నా బాలుని జూచిన అనంతార్యు లాతనిని సమీపించి, ఓయీ! మాయబాలుడా! మేమొనర్చు కైంక ర్యమున కడ్డమువచ్చుటకన్నను, నీవును చేయదలచినచో వేఱొకతట్టను తీసికొనరాదా? యన; నా బాలుడదృశ్యుడా యెను.

మరియొకనాడు అనంతార్యుడు పూదోటలో తులశీ దళములను పుష్పములను గోయుచుండ నొకసర్పము గరి చెను. అది యెఱిగిన అనంతార్యుడు గురుపరంపరను దలచి పుష్కరిణిలో స్నానమొనర్చి పూదండలను గట్టుచుండ; వేంకటేశుడనంతుని అర్చకముఖముగ బిలిపించి, మీతలం పేమి?యని యడిగెను. అందుల కనంతుడు, కఱచిన పాము విషమే ఘనమగుచో విరజలో స్నానమాడి నిన్ను పరమ పదమున సేవింతును; లేక, నీయనుగ్రహమే యధికమగుచో పుష్కరిణిలో స్నానమాడి యిచ్చటనే నిన్ను సేవింతునని సమాధానమిచ్చెను.

ఒకప్పుడు అనంతార్యుడు సంశ్రితులతోగూడి ఆయోధ్యకేగుచు, పాథేయముగా (దారిబత్తెముగ) శ్రీవేంక టేశుని ప్రసాదమును మూటగట్టుకొని వెళ్ళుచు; కొంత దూరము ప్రయాణించి అలసి తోవలో నారగింప నాప్రసా దపు మూటను విప్ప, నందెన్నియో చీమలుండుటచే జూచి, ఆహో! తిరుమలపై వేంకటేశుని సన్నిధిన నిత్యసూరు

లెందరో చీమలుగ వేంచేసియుండగా వారినెడబాపు జేసితినే యని మిక్కిలి చింతించి, యా ప్రసాదమును తిరుమలగిరిపై వదలిరండని యాశ్రితులకిచ్చి పంప వారట్లొనర్చి వచ్చిరి.

మరియొకనాడు అనంతార్యుడు పూలమాలలు కట్టుచుండ వేంకటేశుడు వీరిని పిలువబంప, వెంటనేరాక పూమాలలు కట్టుట పూర్తియొనర్చి యాలస్యముగ రాగా; ఆలసించినందులకలిగి వేంకటేశుడు అనంతుని కొండపడిచి పొమ్మనెను. అందుల కనంతార్యుడు, స్వామీ నీవు వైకుంఠమునుండి స్వతంత్రుడవై వచ్చి తిరుమలగిరి నాశ్రయించితివి; నేనును ప్రత్యక్షవైకుంఠమనబడు శ్రీరంగమునుండి ఆచార్యుని ఆజ్ఞానుగుణముగ పరతంత్రుడనై నీకైంకర్యమొనర్ప నిటకు వచ్చితిని. నీవు స్వతంత్రుడవై వచ్చితివిగాన నీవు తిరిగి వెళ్ళవలె ననుకొన్నచో వెళ్ళిపోవచ్చునుగాని, నేను పరతంత్రుడనై యాచార్యాజ్ఞను పాటించి వచ్చియుండుటచే వెళ్ళిపోవుటకు సమర్థుడనుగాను, నీవును వెళ్ళిపొమ్మనుటకు సమర్థుడవుగావు, వెళ్ళదలచుచో నీవేపొమ్మనెను.

దీనిచే భగవదాజ్ఞకన్న ఆచార్యుని యాదేశమును పాటించుటయే శిష్యునకు ప్రధానమని యాశ్రితులెల్లరు నెఱిగిరి.

## వడుగనంబి వైభవము

రామానుజుల నాశ్రయించినవారలలో నొకరగు

వడుగనంబి యొకప్పుడు ఆచార్యులతోఁగూడి ప్రయాణ మొనర్చుచుండిరి. మార్గమధ్యమున నొక నది దాటవలసి వచ్చెను. రామానుజులు నదిలోదిగి ముందు నడచుచుండిరి. వారివెనుక నడచుచున్న వడుగనంబి ఆచార్యుల తిరువారాధనపు పెట్టెను నెత్తిననిడుకొని యొకచేతితోఁ పట్టుకొని రెండవ చేతితో ఆచార్యుని పాదుకలను ధరించి నడచుచుండిరి. కొంతదూరము పోగా నదిలోని నీరు పిక్కలిగింతలగుటచే వడుగనంబి తన తలపైనున్న తిరువారాధనపు పెట్టెపై ఆచార్యుని పాదుకలనుంచి ఒకచేతితో పట్టుకొని రెండవచేతితో నదినీదుకొని ఆవలగట్టునకు జేరిరి. ఒడ్డెక్కిన తర్వాత రామానుజులు వడుగనంబినిజూచి తిరువారాధన పెరుమాళ్ళనెత్తిన నా పాదుకల నుంచితివేమి? యని యడుగ; వడుగనంబియు మీ పెరుమాళ్ళు నా నెత్తిన యెక్కినచో నా పెరుమాళ్ళ నెచ్చట బెట్టుకొందును? కావున నా పెరుమాళ్ళను మీ పెరుమాళ్ళనెత్తిన నెక్కించితి నంతియే! యని సమాధానము జెప్ప రామానుజులు వాని యాచార్యనిష్ఠకు సంతసించిరి.

వడుగనంబి నిత్యము మఠమున తిరువారాధన మొనర్చుచున్నను భగవద్విగ్రహ సౌందర్యమును సేవించుట కన్నను, ఆచార్యుల తిరుమేనును సేవించుటయందే ప్రీతుఁడై యుండిరి. ఇట్లుండ నొకనాడు ఉడైయవరులు వడుగనంబిని ఆలయమునకు వెంటనిడుకొనిపోయి శ్రీరంగనాథుని తిరు

నేత్రములను దర్శింపజేయు, నంబియు రంగనినేత్రములను జూచియు రామానుజులనేత్రములను జూచియు, నాఅమృతమునుజూచిన కన్నులతో మరియొకనిని జూడనని, ఆచార్యుల నేత్రసౌందర్యమునందే సక్తులైరి.

ఒకనాడు రామానుజులు తళిహ ప్రసాదము నీయగా వడుగనంబి ఆరగించి చేతులను తలకు పూసుకొనిరి. అది జూచిన యతిపతి చేతులను కడుగుకొనుమన నంబియట్లే యొనర్చిరి. మరునాడు వడుకనంబి ప్రసాదము స్వీకరించి చేతులు కడుగుకొనగా నుడైయవరులు, చేతులు కడుగు కొందువేమి? యనగా నిన్న దేవరవారు జెప్పినట్లే జేసితిని, నేడు వద్దనిన మానుకొందునని యూరకుండిరి.

దీనిచే ఆచార్యులు జెప్పినట్లు జేయుటయే శిష్యుని స్వరూపము గాని, 'అవును కాదు' అని విమర్శించుట తగదని యభిప్రాయము.

ఒకనాడు వడుకనంబి మఠమున పాలుగాయుచుండ రామానుజులు వడుగా! శ్రీరంగడు ఊరేగింపుగా వచ్చుచున్నాడుగాన త్వరగా రమ్మని పిలిచిరి. అందులకు నంబి, స్వామీ మీ పెరుమాళ్ళ ఉత్సవమును జూడవచ్చినచో నా పెరుమాళ్ళకై కాచెడిపాలు పొంగిపోవా? యని లోననుండి రాకయే సమాధానము జెప్పెను.

ఒకనాడు వడుకనంబి శరీరబంధువులు వచ్చి భోజనములు జేసిపోగా, వారేగిన వెనుక నంబియు నిల్లంతయు శుద్ధి యొనర్చి వండిన కుండలనెల్ల పారవైచి, భాగవతసంబంధము గల పాత్రలకై ముదలియాండాన్ పెరటిలో పారవైచిన కుండలను దెచ్చి యింటిలో నుంచుకొనిరి.

వడుగనంబి ఉడైయవరుల శ్రీపాదతీర్థము దప్ప నితరుల శ్రీపాదతీర్థము నంగీకరింపకుండిరి. ఇట్టినియతి గలవారగు వీరు శ్రీమిథిలసాలగ్రామమున నొక నూయినేర్పఱచి ఉడైయవరుల శ్రీపాదతీర్థము నందు జేర్చి యా యెడ్డ ననే యతిరాజుల తిరువడిగళును ప్రతిష్ఠించి యారాధన మొనర్చుచునుండి తన యాశ్రితులకదియే రక్షకముగా జూపిరి.

## గద్యత్రయప్రబన్ధ అవతరణము

శ్రీరంగమున శ్రీరంగనాయకి అమ్మవారి బ్రహ్మోత్సవ సందర్భమున నొకనాడు ఆలయమునకు వెనుకప్రక్కగ గల మంటపమున శ్రీరంగనాథ దంపతులు వేంచేసియుండిరి. చుట్టును తెరలు గట్టియుండెను. అట్టితరి రామానుజులు తెర లోనికేగి శ్రీ శ్రీయఃపతుల నిరువురను ప్రపత్తియొనర్చి, శరణాగతిగద్య, శ్రీరంగగద్య, శ్రీవైకుంఠగద్య లనబడు గద్యత్రయమును విన్నపించిరి.

శ్రీరంగడంపులకు మిక్కిలి సంతసించి, శ్రీభాష్య

కారా! లోగడనే మీకు ఉభయవిభూతినాథత్వ మిచ్చితిని గదా! మరల యిప్పుడేమి గోరి యిట్లు శరణాగతి జేసితిరని యడిగెను. అందుకు ఉడైయవరులు స్వామీ! నాఆశ్రితుల కెల్ల నేనొనర్చిన ప్రపదనమునే హేతువుగ జేసికొని పరభక్తి పరజ్ఞాన పరమభక్తులు గల్గించి పరమపదమీయవలసినదని విజ్ఞాపింప, శ్రీ శ్రియఃపతు లిద్దరును నట్లేయనిరి.

కూరేశులు తెరకు వెలుపలనుండి రంధ్రముద్వారా తెరలోనకు తొంగిజూచి రామానుజుల యీ చేష్టకు ఔదార్యమునకు చకితులై నడుమునను న్న ఉత్తరీయమును దీసి గాలిలోని కెగురవేయుచు రామానుజసంబంధులెల్లరకును మోక్షమువచ్చుటకు సంతోషము పట్టలేక,

"నచేద్రామానుజేత్యేషా, చతురాచతురక్షరీ,
కామవస్థాంప్రపద్యన్తే, జన్తవోహంతమాదృశః॥

రామానుజ యనెడి ఆధిక్యముగల నాల్గక్షరముల నామమే లేకున్నచో మాబోటి జననమరణ స్వభావుల గతి యేమై యుండెడిదో యనుచు తన్మయతతో గంతులువేసిరి. ఇది జూచిన సమీపస్థులెల్లరును భక్తిశ్రద్ధలతో ఎమ్బెరుమానార్ల నాశ్రయించిరి.

ఇట్లు సమస్తమైనవారును రామానుజసంబంధులై యమలోకభయములేక నిశ్చింతగ నుండిరి.

# క్రిమికంఠుని జననము

ఉడైయవర్లు శ్రీవైష్ణవసిద్ధాన్తమును స్థాపన మొనర్చి యెల్ల యెడలను వ్యాప్తమొనర్చుటచే కలియుగమున కర్మజ్ఞాన భక్తులచే కడతేరవలెనని తలచిన జనులెల్లరును యతీంద్రుల సంబంధముచే ప్రపత్తిముఖ్యమని తెలిసి తమ స్వప్రయత్న ములవీడి ఆచార్యులే యుపాయోపేయములని విశ్వసించి యుండుటచే శరీరావసానమున తమతమ పుణ్యపాపరూప కర్మలతో నెట్టిసంబంధమునులేక అర్చిరాదిమార్గమున శ్రీవైకుంఠమును జేరుచుండిరి. ఈవిధముగ ఉడైయవరులు లోకము నెల్ల తనవలె దిద్దుబాటొనర్చుటచే నెల్లవారును శ్రీవైష్ణవులై నరకమునకు పోవువారులేరైరి. దానిచే స్వర్గనరక మార్గములు గడ్డిమొలిచిపోయెను. యమాది దిక్పాలకులకు పనులులేక యింద్రుని ముందుంచుకొనిపోయి బ్రహ్మతో జెప్పుకొన, బ్రహయు వీరినెల్లరను వెంటనిడుకొని భూలోకమునందలి ప్రత్యక్షవైకుంఠమనబడు శ్రీరంగము జేరి శ్రీరంగ నాథునితో నివిషయము మొరబెట్టిరి.

శ్రీరంగనాథుడు బ్రహ్మాదుల మొరలు విని యిట్లు తనలో చింతింప మొదలిడెను. చక్రవర్తియగువాడు తన రాజ్యభార మెల్ల యౌవరాజ్యపట్టాభిషిక్తునొనర్చిన తన కుమారునిపై నిడి; భార్యతో వినోదముగ ప్రొద్దుపుచ్చు

కొనినట్లు; నేనును ఉభయవిభూతుల యాధిపత్యమును రామానుజులయందిడి శ్రీరంగనాయకితో ప్రొద్దుపుచ్చుకొనుచుండ యతిరాజులు లీలావిభూతినెల్ల నిత్యవిభూతిగ మార్చివైచిరే! దీనిచే లీలావిభూతి చెడిపోయి లోకాధిపతులకు పనులులేకుండ పోయినది. ఇందుచే మరల లీలావిభూతిని నిలుపుకొనవలసిన ఆవస్యకత యేర్పడినదనితలచి బ్రహ్మాదుల నోదార్చి బంపివైచి చోళదేశమునందలి చిత్రకూటమున దక్షిణాధిపతియగు క్రిమికంఠుడను రాజును జన్మింపజేసెను. అతడును శైవధర్మము నభినందించుచు విష్ణుదూషణ మొనర్చుచు తనపురోహితుడును మంత్రియునగు నాలూరాన్ (చతుర్గ్రామనివాసి) అను వాని సాయముతో దేశమునందలి పండితులనెల్ల రావించి 'శివాత్పరతరంనాస్తి' యని వ్రాయించి దానిపై నెల్లరి చేవ్రాలుల బెట్టించుచు, పెట్టని వారిని దేశబహిష్కార మొనర్చెను. అదిజూచిన నాలూరాన్, రాజా! వీరి చేవ్రాలులవలన నేమిప్రయోజనము? సకల వైష్ణవలోకమునకును ప్రధానులగు రామానుజులు చేవ్రాలొనర్చినగాని దానికి విలువరాదన; రాజు రామానుజులను సభకుదోడ్కొనిరండని భటుల బంపెను. రాజభటులు శ్రీరంగమునకు వచ్చి యతిపతుల మఠమును జేరి యెంబెరుమానార్లను తీసికొనిరమ్మని రాజాజ్ఞయాయెనుగాన రమ్మని తెల్పి; నా విషయము నొక సన్నిధిస్వామి కూరేశులకు దెల్పెను. ఉష్ణోదకమువరులకు తిరువంజన మొనర్చుచున్న

కూరేశులు వెంటనే యీ నలకువచ్చి విషమపరిస్థితిని గుర్తించి, యతిపతుల త్రిదణ్డ కాషాయములధరించి భటుల వెనుక రాజసభకు పోగా, కూరేశు లొంటరిగ వెళ్ళుటసహింపని పెరియనంబిగారును నంబిగారికుమార్తె అత్తుళాయ మ్మయు వారి ననుసరించిరి.

యతిరాజులు స్నానమాడి కాషాయత్రిదణ్డములకై వెదకి, దాశరధివలన కూరేశులకృత్యము నెఱిగి వారిశ్వేత వస్త్రముల తాముధరించి శ్రీరంగనిజూడనేగిరి. రంగనాథు డును తీర్థశఠకోపముల నిప్పించి, కొలదికాలము పడమటి దేశమున కేగుడు, మీకు శుభమగునని దెల్ప; దాశరధ్యా దులు తొందరింప, యతిరాజు శ్రీరంగమువిడిచి మేల్నాడు నకు ప్రయాణమైరి.

కూరనాథులు పెరియనంబి అత్తుళాయమ్మలగూడి చోళనగరిజేరిరి. వచ్చినవారు రామానుజులు కాదని తెలిసిన చోళభూపతి వెంటనే తనభటులను యతిరాజును దెమ్మని మరల బంపెను. వారును మఠమున నుడైయవరులు లేకపోవు టచే వారేగిన మార్గమునెరిగి వెంబడించిరి. కొంతదూరము పోవుసరికి రాజభటులు దమను వెంబడించుచుండిరని ఆశ్రి తులు దెలుప; భాష్యకారులు చేరెడు యిసుకను దీసి, పెరి యాళ్వార్ తిరుమొళ్ళిలోని 5వ పత్తు 4తిమొ. శెన్నియోఙ్గు లోని 4వ పాశురమున రెండవభాగమగు 'కొడుమైశెయ్యుమ్

కూాత్తముం ఎన్ కొాల్ ఆడికుఱుకప్పెఱా। తడవరైత్తోళ్ శక్కర పాణీ శార్ంగవిల్ శేవకనే' (క్రూరముగ దండించు మృత్యువును నా యాజ్ఞజెల్లెడి-చోటునకు జేరలేదు. పెద్దకొండవంటి భుజములుగల చక్రపాణీ, శార్ంగమనువిల్లు గలవాడా) యనెడి పాశురము ననుసంధించి యా యిసుకను భటులు వచ్చు మార్గమున జల్లుడని శిష్యులకీయ వారద్దానిని మార్గమునజల్ల నది పెద్దకొండయైదోచ భటులు వెనుకకు మరలి పోయి రాజునకు దెల్ప నాతడును జేయగలునదిలేక మిన్నకుండెను. రామానుజులిట్లు పాశురములోని సగభాగమును పఠించి పిడికెడుమన్ను జల్లినమాత్రముననే నది పర్వతమై యతిరాజులను వారిభక్తజనులను రక్షించెనుగదా! కావుననే ఆళ్వారుల దివ్యప్రబన్ధములన్నియు మహామంత్రములుగా నెంచి మనపూర్వాచార్యులెల్లరును వానికి వాఖ్యానము లొనర్చి యాశ్రితులకు దెల్పుచువచ్చిరి. అగుటచే నాళ్వార్ల దివ్యప్రబన్ధములు సకలఫలప్రదములు.

యతిరాజు లాశ్రితులతోగూడి దుర్గమారణ్యమార్గమున పయనించుచు దారితప్పి యొంటరివారైరి. అట్లే మరియొక స్వామియు విడివడి దారి తెలియక ఎమ్బెరుమానారే యని బిగ్గరగ కేకలువేయుచు నడచుచుండ నొక కొండ సమీపమున కొందరు బోయవారు తమపొలముల పనులు జేసికొనుచు గానవచ్చిరి. స్వామియు వారివద్దకేగ వారాతని

జూచి వైష్ణవునిగా నెఱిగి, స్వామీ మీరెచ్చటినుండి వచ్చు చుండిరన నాతడు శ్రీరంగమునుంచి యనిబదులు జెప్పెను. అంతటవారు ఎమ్బెరుమానార్లు కుశలియేనా? శ్రీరంగ సంపదకు క్షేమమేనా? యన; స్వామియు, నేమికుశలము? ఎచ్చటిక్షేమము?, చోళుని బాధలకోర్వక శ్వేతవస్త్రముల ధరించి త్రిదండములేక యతివరుడు అడవులబడి యలమటింప వెదకుచు నేనిట్లువచ్చుచుంటినని దెల్ప; నిషాదు లదివిని, అయ్యో! యెంతకష్టమువచ్చినదని నాటినుండియు యతి వరుల జూచువరకు నాహారముల ముట్టమని శపథించి యారుదినములు నిరాహారులై యుండిరి.

ఆరవనాటిరాత్రి పెద్దదగు వర్షమున తడిసి వడవడ వడకుచు ఒంటరియై ఆహారములేక నలిసిపోయి యొకపర్వత సమీపముననున్న ఉడైయవరులను వెదకుచు వచ్చుచున్న దాశరథి మొదలగువారెల్లరును సేవించి పెన్నిధిగన్న పేదల వలె సంతోషాతిశయము నొందిరి. అంతటవారెల్లరును దూర మున గన్పించుచున్న సన్నని వెలుగుదిక్కుగ వెడలి చలి గాచుకొనుచున్న నిషాదులను జేరిరి. నిషాదులును వీరిని జూచి మంటపెద్దదిగ జేసి వీరి తడిబట్టలను పిండి మంటవద్ద నారబెట్టి శ్రీరంగవాసులనుగనెఱిగి; ఎమ్బెరుమానార్లు కుశల మేనా? యనియడుగ; వారును ఎమ్బెరుమానార్లను మీరెట్లె రుగుదురనిరి. అంతవారు, మేమెల్లరమును తిరుమలనల్లాను

నాశ్రయించి యీ యాత్మలకు హితమునడుగ ఎమ్బెరుమా నారు శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుడనెను; నాటి నుండియు వారినే దలచుచుంటి మనిరి.

అట్లగుచో వీరే యెమ్బెరుమానార్లని దాశరథి మొద లగువారు జూప, వ్యాధులధికానందమునొంది, ఉడైయవరుల పాదములపైబడి వారికష్టమునకెంతగనో దుఃఖించి వారినెల్లరను దోడ్కొని తమపల్లెకేగి యారాత్రి ఆకలిబాధదీర్ప, గంటె కంకులు జంటితేనియలు దెచ్చి యీాయ వారెల్లరు వానిని కాల్చి తేనెలోముంచి గురుపరంపర కర్పించి, యారగించిరి. ఉడైయవరులును వారలనుజూచి యింతవరకును మేఘము వర్షించి బాధింపగా, నిప్పుడు నల్లాననెడు మేఘము అమృ తము వర్షించినదని సంతసించిరి. ఆరాత్రి వారెల్లరును సుఖ నిద్రజెందిరి.

మరునాటి యుదయముననే రామానుజులు తమ సన్నిధి వైష్ణవుడొకనికి, నిషాదులలో సమర్థుడగు నొకనిని సాయమిచ్చి శ్రీరంగమునకేగి కూరేశులు మొదలగువారి క్షేమముల దెలిసిరమ్మని పంపి తమతోనున్న నలుబది యేవురు (45మంది) ఆశ్రితులతో గూడి యతిరాజు ప్రయా ణముకాగా నా నిషాదులెల్లరును దండప్రణామములాచరించి భోజనవసతి యేర్పరుపదలచియుటకు రెండుక్రోసుల(4 మైళ్ళు) దూరమునగల తమ యేలిక వద్దకు దోడ్కొనిపోగా నాతడు

వేటకై యడవికేగియుండుట నెఱిగి, యజమాని భార్యతో వీరికివలయు సంభారముల నేర్పఱుప జెప్పి వెడలిరి. నిషాద పతియు నా సాయంత్రమునకు వేటనుంచి తిరిగివచ్చి స్వాము లెల్లరు వస్తుండుట భార్యవలన తెలిసి తానును నిరాహారియై యిరువురు సేవకులను బిలిచి దగ్గరలోనున్న పల్లెలోగల కట్టళవారియనెడి బ్రాహ్మణగృహమున వారికి వసతియేర్పఱచి, వంటసంభారములనెల్ల సమకూర్చెను.

## కొంగుపిరాట్టి ఆదరణ

ఆయింటి విప్రునిభార్య వీరలనుజూచి యెందుండి వచ్చితిరి? ఎవ్వరిసంబంధులనియడుగ; శ్రీరంగమునుంచి వచ్చుచుంటిమి, ఎంబెరుమానార్ల సంబంధులమని వారుసమాధానము జెప్పిరి. అంతటనామె నేనును ఉడైయవరుల సంబంధినేగాన మీకు చెల్లెలు నగుదును గాన మీరు మాయింట నారగింపవచ్చుననగా; నందులకువారు యతిరాజుల నెచ్చట నాశ్రయించితివనిరి. అంతనామె యిట్లు జెప్పదొడగెను.

ఈప్రాంతమంతయు దైవమాతృక (వర్షాధారపు) దేశమగుటచే వెనుక నొకప్పుడు అనావృష్టియేర్పడ సకుటుంబముగ శ్రీరంగమునకు వచ్చి యొక మిద్దెపై నివసించితిమి. ఒకనాడు భిక్షాటనమొనర్చు యతిరాజుల వెంట ననేకులగు అకలంకయాళ్వాన్ మొదలగు బ్రహ్మవేత్తలు ఒదిగి సేవించుట జూచిన నేను మిద్దెదిగివచ్చి దారికడ్డుగ నిలిచితిని.

ఉడైయవరులంత దారినిమ్మనిరి, మీరుజూడ సన్యాసులు, భిక్షాటనముచే జీవించుచుండిరి, ఐనను ననేకులగు పండితులు రాజులు మిమ్మనుసరించుటకు కారణమేమి? యని యడుగ; యతివరులు మావద్ద దొడ్డదగు మంత్రరత్నముగలదు, దానికై మా వెంట నెల్లరును దిరుగుచుందు రనెను. ఈయ దగుచో నా మంత్రమును నాకనుగ్రహింపుడని ప్రార్థింప యతిపతులు గురుపరంపరాదిగ నా మంత్రమునొసంగి ఆరా ధనకై ప్రార్థింప తమపాదుకలనీయ వానిని నా పమిడి కొంగుపై నద్దించుకొంటిని. అట్లు నన్ననుగ్రహించిన స్వామి క్షేమమేనా యని యడుగ, వారలతోనున్న ఉడైయవరులు పాదుకలను జూపుమన నామె దెచ్చి చూపించెను. అంతట వారిందులో నుడైయవరులను గుర్తింపగలవా?యన; నామెయు దీపపుకాంతిలో పాదుకల నచ్చటనున్నవారలపాద ములకొలతలకు సరిజూచుచు యతిరాజుల పాదములతో సరి పోవుటచే వీరే యతీంద్రులని నిశ్చయముగ జెప్పెను. ఉడై యవరులందులకు సంతసించి తనను దెల్సుకొని మంత్రము మరచెనేమోయని పరీక్షించిజూచి యామెను తళిహాకై నియమించి, శిష్యునిద్వారా పరిశుద్ధముగ జేసిన విధము నెఱిగి నివేదనము నర్చి యెల్లరును నారగించిరి. కొంగు పిరాట్టియు తీర్థప్రసాదముల గొనిపోయి మిద్దెపైనున్న భర్తనులేపి యాతనికిచ్చెను. ఆతడును వానినిగొనుటచే సత్వగుణసంపన్నుడై భార్యనుజూచి నీవుగోరినయట్లే యతీం

ద్రుని శ్రీపాదముల నాశ్రయించెదనని చెప్పెను. మరు నాటి ఉదయముననే కొంగుపిరాట్టి భర్తను వెంటనిడుకొని యతీంద్రుల సేవించి తనవలెనే భర్తకును హితముగూర్చు మని ప్రార్థింప; యతిరాజు లాయింటియజమానుని పంచ సంస్కార సంస్కృతు నొనర్చి సకలహితముల నుపదేశించి గోవిందదాసుడను పేరిడిరి.

## మిథిలసాలగ్రామము

ఎమ్బెరుమానార్లు అచ్చటనే మరల త్రిదణ్డకాషా యాదుల నేర్పఱచుకొని అచ్చటినుండి బయల్దేరి, యాశ్రితు లతో పడమటిదిక్కుగా పయనించి వహ్నిపుష్కరిణియను పేరుగల గ్రామమున 3 దినములుండి యటనుండి మిథిలకు జేరిరి. అచ్చటి జనులెల్లరును పాషండులగుటచే నొక్కరును యతీంద్రుల నాశ్రయింపరైరి. అందులకు యతీంద్రులు అచ్చటివారినెల్ల ననుగ్రహింపదలచి యచ్చటి యూరివారె ల్లరు మంచినీరు దెచ్చుకొనెడి చెరువున రేవులో నొక ప్రక్కగా మోకాటిలోతు నీటిలో దాశరథిని నిలువుమని యాజ్ఞాపింప, నాతడట్లే యొనర్చెను. ఊరివారెల్ల దాశరథి పాదసంబంధ తీర్థమును ద్రావుటచే జ్ఞానభక్తులుగలిగి ఉడై యవరుల నాశ్రయించిరి. యతీంద్రులును వారినెల్ల పంచ సంస్కారపరుల నొనర్చి యాగ్రామమునకు మిథిలసాలగ్రా

మమని పేరిడిరి. అచ్చటనే లభించిన వడుగనంబి యతీంద్రుల యందత్యంత ప్రీతులై యుండిరి.

## విఠ్ఠలరాయని ఆశ్రయణము

ఎమ్బెరుమానారు లచ్చటనుండి సపరివారముగ బయల్దేరి తొండనూరు జేరి వెలుపలి యుద్యానమున నుండిరి. ఆగ్రామమును విఠ్ఠలదేవరాయుడను రాజు పాలించుచుండెను. ఆతని పుత్రికకు బ్రహ్మరాక్షసి పట్టియుండుటచే వివస్త్రయై తిరుగుచుండెను. అదిజూచిన తల్లిదండ్రులు భూతవైద్యులగు మంత్రవేత్త లనేకులచే యత్నించినను ప్రయోజనము లేక పోయెను. ఇట్లుండ నొకనాడు తొండనూర్నంబియను యతీంద్రుల శిష్యులొకరు రాజగృహమునకు భిక్షకై పోగా, రాజమహిషివలన బ్రహ్మరాక్షసివిషయము విని, మా యాచార్యులీగ్రామమునకు వచ్చిరి, వారిని ప్రార్థించిన మీకు ఫలముగలుగునని చెప్ప రాజదంపతులట్లే యొనర్ప; ఆశ్రితుల ప్రార్థనలచే యతిపతి రాజప్రసాదమున కేగి రాజపుత్రి శిరమున తమశ్రీపాదతీర్థమును జల్లింప బ్రహ్మరాక్షసి వెడలి పోగా రాజపుత్రియు వస్త్రమును ధరించి సుఖముగనుండెను. విఠ్ఠలదేవరాయలు యతీంద్రుల మహిమ నెఱిగి తనపరివారముతో నాశ్రయింప నుద్యుక్తుడైయవరులాతనికి విష్ణువర్ధనుడను నామమేర్పఱచిరి.

## బౌద్ధ నిరాసనము

విఠ్ఠలదేవరాయలను తమకనుకూలముగ నుంచుకొనిన పూర్వపు బౌద్ధమతగురువులు పండ్రెండువేలమంది యిది దెలిసి యొక్కపెట్టున యతీంద్రులతో వాదింపవచ్చిరి. వారలనెల్ల నచ్చటి విష్ణాలయమున నొకపెద్దదగు మంటపము నకు రమ్మని, దానిచుట్టును తెరనేర్పఱచి, తామొక్కరును లోనకేగి శేషరూపముధరించి వేయినోళ్ళతో నొకేమారు వారలనెల్ల వాదమున నోడించ, వారెల్లరును దాసులై లక్ష్మణుల నాశ్రయించి పంచసంస్కారాది బహువిధ హిత ములనంది ధన్యులైరి. ఉడైయవర్లు ఆలయమునందలి హరికి 'నంబితంబిరాన'నెడి నామమునిడి; యచ్చటినుండి బయల్దేరి 'అళహసింగరికోయిల'జేరి యాశ్రితులకు వేదాన్తవ్యాఖ్యా నముల గృపజేయుచు కొన్ని నాళ్ళుండిరి. ఉడైయవరు లచ్చటనే సాధుజన విరోధియగు చోళరాజువలన నేర్పడిన సంకటమును బాపుమని నృహరిని శరణొందిరి.

## యదుశైల సముద్ధరణ

ఒకనాటిరాత్రి యతీంద్రుల స్వప్నమున తిరునారా యణపుర స్వామి గన్పించి, ఎమ్బెరుమానారే! మీకై యెదురుజూచుచు మీరున్నచోటునకు సమీపగ్రామమగు యదుగిరిన వేదపుష్కరిణి యొడ్డున నుంటిని, నన్నుద్ధరించి

ప్రతిష్ఠింపుడు; మీకువలయు తిరుమణియు నట లభించునని దెల్పె; ఉడైయవరులు మేల్కాంచి విష్ణువర్ధనరాజును వెంట నిడుకొని యాదవాద్రిని జేరి స్వామికై వెదుక కన్పింపడా యెను.

ఉడైయవరులును, స్వామిని దలచుచు నిద్రింప నాటి రాత్రి మరల స్వప్నమున గనిపించి, ఎమ్బెరుమానారే! యీ పర్వతముక్రింద దక్షిణదిక్కున కల్యాణతీర్థముగట్టున చాలసంపంగివృక్షములు గలవు. అచ్చటి యుత్తరపుదిక్కున తులశివృక్షముగలదు, దానిక్రింద నొకపుట్టయున్నది. ఆ పెద్ద పుట్టలో నేనుంటిని, సందేహములేక నన్నుద్ధరింపుడు, ఒక ప్పుడు గరుత్మంతునిచే శ్వేతద్వీపమునుంచి శ్వేతమృత్తిక దీసుకురాబడి యాదవాద్రి యందుంచబడినది, దానిని గైకొ నుడని దెల్పె; ఉడైయవర్లు మేల్కాంచి విష్ణువర్ధనుని సాయ ముచే నాయడవియంతయు నరికించి యాపుట్టకు నమస్క రించి, త్రవ్వించి, బహుధాన్య సంవత్సర పుష్యశుద్ధచతుర్దశి గురువారము పునర్వసు నక్షత్రమున యదుగిరీశుని బయల్ప అచి, తమ త్రిదణ్డముచే త్రవ్వి శ్వేతమృత్తికను గొని యూర్ధ్వపుండ్రములధరించి, నచ్చటనొకగొప్ప పట్టణమును గట్టించి, తిరునారాయణపురమని పేరిడి, మధ్యభాగమున ఉన్న తమగు ప్రాకారగోపుర మంటపములతో నాలయమును నిర్మింపజేసి యందు పాంచరాత్ర సంహితానుగుణముగ

సంప్రోక్షణాది ప్రతిష్ఠాంతము నిర్వర్తింపజేసి, యుత్సవము లొనర్పఁజూడ, నుత్సవవిగ్రహము లేకపోవుటచే దానినే ధ్యానించుచు నిద్రించిరి.

నాటిరాత్రి స్వప్నమున ఉత్సవవిగ్రహమగు రామప్రియులు సాక్షాత్కరించి తాను ఢిల్లీశుని గృహమున నుండుటచే నచ్చటకువచ్చి తమ్ముద్ధరింపుడని చెప్ప; రామానుజులు మేల్కాంచి, స్వప్నవృత్తాంతమెల్ల విష్ణువర్ధనునకు చెప్పి, నాతడును ప్రోత్సహింప, నుడైయవరులు రాజుతోను పరివారముతోను ప్రయాణముకాగా పల్లె పట్టణ వాసులగు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాదులెల్లరును వెంబడించిరి.

## ఢిల్లీ విజయము

ఇట్లుడైయవరులు, వేలాదిప్రజలతోను వేలకొలది సైన్యముతోను రాజు వెంబడింప, పంన్రెండువేలమంది యేకాంతులును ఏడువందలుయతులతోను డెబ్బదినల్గురు సింహాసనాధిపతులతోను ఢిల్లీనగర పరిసర ప్రదేశమున విడిదియొనర్చిరి. వేగులవలన నెఱిగిన ఢిల్లీశుడగు సుల్తాను అత్యవసరపు సమాలోచనమొనర్చి విషయము నెఱిగిరమ్మని చారులనుబంప వారు వచ్చి రామానుజులు సుల్తానును జూడవలెననెడి యభిప్రాయము నెఱిగి, సుల్తానునకు చెప్పిరి.

అంతట సుల్తాను తన మంత్రులగు పండితరాయలు

భగవంతరాయలులతో ననేకులగు వజీరులతోను రామాను జులను సేవించి వారిననేక మంగళవాద్యములతో రాజధానికి దోడ్తెచ్చి, యుచితాసనమున గూర్చుండబెట్టి వారియాజ్ఞతో తానును గూర్చుండి వచ్చినపని యడుగ, నుడైయవరులును, సుల్తానుతో మాకిష్టమగు హరివిగ్రహమొకటి వెనుకటి మీవారి దండయాత్రలతో తేబడి మీమందిరమున నున్నది; దానిని గొనిపోవుటకు వచ్చితి మనిరి. అయినచో తప్పక వెదకితీసికొనిపొండని సుల్తాను యతిపతులను విగ్రహశాలకు దోడ్కొనిపోవ, ఉడైయవరులు తమసన్నిహితులతో నా శాలయంతయు వెదకి రామప్రియుల విగ్రహమునుగానక చింతించి, బసకుతిరిగివచ్చి ముసుగిడి స్వామిని దలచుచు పరుండిరి. రామప్రియులు నాటి రాత్రి స్వప్నమున నుడైయ వరులకు సాక్షాత్కరించి, తాను సుల్తాను కుమార్తె మందిర మున నామె పడకపై నుంటిననియు నచ్చటకు వచ్చి తనను గొనిపొమ్మని దెల్ప; వేకువనే రామానుజులు మేల్కొని కాలోచిత సకల కృత్యములదీర్చుకొని సుల్తానున కీవార్త దెలుప, నాతడేతెంచి వీరిని తనకుమార్తె పడకగదివద్దకు తీసికొనిపోయి, మీ దైవమగుచో పిలుచుకొనిపొండన, యెంబెరుమానారులు రామప్రియా! రమ్మని పిలువగనే, పట్టె మంచముపైనుండి విగ్రహరూపియగు రామప్రియులు ఆశ్రిత వ్యామోహము దోప, పీతాంబరధారియై కస్తూరితిలకోజ్జ్వ లుడై కాలియందియలు గల్లుగల్లున మ్రోగ, క్రిందకుదుమికి

గంతులువైచుచు వచ్చి రామానుజుల తొడపైనెక్కెను. ఇది జూచిన సుల్తానును పరివారమును నచ్చెరువందిరి. ఉడైయవరు లావిగ్రహమూర్తి నాలింగనమొనర్చి, సంపత్కుమారులని పేరిడ నాటినుండియు నాతనికి యతిరాజసంపత్కుమారులనెడి తిరునామమేర్పడెను. ఎమ్పెరుమానారులంత నా విగ్రహమూర్తిని గొని తమ బసకే తెంచి సుఖించిరి.

## సంపత్పుత్రులకు సుల్తానుపుత్రిక నర్పించుట

సుల్తాను పుత్రిక, తన ప్రియుడగు రామప్రియుని యెడబాసి నిద్రాహారముల వీడి దుఃఖించుట నెరిగిన సుల్తాను దంపతులు కూతురునెంతగ నోదార్చినను ప్రయోజనము లేకపోవుటచే చేయదగినదేమియో తోచక చింతించుచు నిద్రింప, సంపత్కుమారులు సుల్తాను స్వప్నమున గన్పించి, సుల్తాను పాలసముద్రుడనియు, నాతనికుమార్తె లక్ష్మి యనియు, నగుటచే నామెను తనకిచ్చి వివాహమొనర్ప మనిదెల్పి యదృశ్యుడై యతిరాజుల స్వప్నమున తనను గన్పించి, సుల్తాను కుమార్తెయగు తన యిల్లాలిని తెల్లవారగనే దోడ్కొనిరమ్మనియు నట్లు గాకున్నచో తననేని యామెవద్దకు బంపుమనియు దెల్పి, యదృశ్యుడాయెను. అంత యతిపతియు వేకువనే లేచి కాలోచిత కృత్యములెల్ల దీర్చుకొని సుల్తానువద్దకేగ, నాతడును తన స్వప్నవృత్తాంతమును యతిపతికి దెల్పియు, మదినిట్లు చింతింపదొడంగెను.

అల్లుడు బ్రాహ్మణుడట! బాపనసన్యాసి వియ్యంకుడట! యీ పెండ్లి జరుగుటెట్లులో? యనుకొనెడి సుల్తాను తలంపు నెఱిగిన యతిపతి తన స్వస్వరూపమును జూపింప; వేయి ఫణములతో వెలుగొందు శేషుని తొడపై సంపత్కుమారులు గూర్చొనియుండ, నట్లున్న సంపత్కుమారునికి శ్రీమహాలక్ష్మివలె దోచుచున్న తనకుమార్తెనిచ్చి వివాహమొనర్చి సుల్తానుదంపతు లానందించుచుండ; యతిపతి తనను యెప్పటియట్లుగనిపింప, సుల్తానుదంపతు లది కలయని తెలిసి తన కుమార్తె సంపత్కుమారుని భార్యగను యతిపతికి కోడలుగను జెప్పి, యప్పగించి యనేకవిధములగు సంపదలతో నామెను బంగరుపల్లకిలో సంపత్కుమారులతో గూర్చి యెక్కించి యతిపతితో యాదవాద్రికి సాగనంపి సుల్తాను తన పెద్దకుమారుని వారివెంబడి యదుశైలమువరకు ననుసరింప బంపెను.

## సుల్తానుపుత్రిక అర్చామూర్తిగ వెలయుట

ఎంబెరుమానారులిట్లు సకలమగు పరివారముతోను సంపత్కుమారులను సుల్తానుపుత్రికయగు బీబీనాంచారును నొక బంగరుపల్లకిలో వేంచేపుజేసికొని యదుగిరికి ప్రయాణమై వెడలుచు మార్గమధ్యమున పంచములు గొందరు వచ్చి తమ్ము సేవించి ప్రయాణమున సహాకరింప వారలకు సంపత్కుమారుల జన్మదినోత్సవకాలమున మూడుదొజులు

కల్యాణపుష్కరిణిలో స్నానమాడి ఆలయమున మూర్తుల సేవింప ననుజ్ఞయేర్పఱచి; పయనించుచుండ మార్గమధ్యమున నందరుజూచుచుండ సుల్తానుపుత్రిక పల్లకిలో తన ప్రాకృతరూపమును విడిచి విగ్రహరూపమును ధరించెను, ఇదిజూచిన యతిపతియు పరివారమును సుల్తాను పుత్రుడును నత్యాశ్చర్య చకితులైరి.

## యతిరాజులు సంపత్కుమారుల ప్రతిష్ఠించుట

ఉడైయవరులు యదుగిరిజేరి సశాస్త్రీయముగ సంపత్కుమారులను ప్రతిష్ఠింపజేసి బీబీనాంచారు విగ్రహమూర్తిని స్వామిపాదములయందు ప్రతిష్ఠింపజేసి సకలోత్సవముల నేర్పఱచి యేబదియిరువురు కైంకర్యపరుల నియమించి యటనొక మఠమేర్పఱచి యందు కైంకర్యమును సక్రమముగ జరిపించునట్లు తమయాశ్రితులలో నొక జీయరును నియమించి యచ్చట పండ్రెండుసంవత్సరములు వేంచేసియుండి యాశ్రితులకు వేదాన్తోపదేశముల నొనర్చుచు నుండిరి.

## పంచముల ఆలయ ప్రవేశాధికారము

యతిపతి నియమనానుసారము నేటికిని సంపత్కుమారుల బ్రహ్మోత్సవ దినములలో మూడునాళ్ళు పంచములు కల్యాణపుష్కరిణిలో స్నానమాడి ఆలయమున

సేవించి తైలామ్లఫలశాలితండులములు సమర్పించి జనెడి యాచారమేర్పడియున్నది. ఆ పదార్థములతో పుళోగిరి మొనర్చి యర్చకస్వాములు స్వామికి నివేదన సమర్పింతురు. అట్లుగాదేని కళ్యాణపుష్కరిణిలో క్రిములు గన్పించునని పెద్దలు జెప్పుదురు. వారు సేవించి వెళ్ళిన నాల్గవనాడు సంప్రోక్షణాదులొనర్చి కడమ యుత్సవము నర్చకులు సడుపు యాచారమేర్పడియున్నది.

సుల్తాను పుత్రుడు యదుగిరిని వీడి ఢిల్లీకి జని యదుగిరిలో జరిగిన వైభవమెల్ల తల్లిదండ్రులకు దెల్ప వారాశ్చర్య పడి యదుగిరికేగి యర్చామూర్తులసేవించి ప్రార్థింప; మోహనాంగి, యదుగిరిలక్ష్మి, బీబీనాంచారనెడి శుభనామములుగల సుల్తానుపుత్రిక తల్లిదండ్రులతో వారు తలచిన పుడెల్ల తాను భర్తతోగూడి దర్శనమిచ్చునట్లు వరమీయ సంతుష్టులై సుల్తానుదంపతులు అనేకవిధములగు బహుమతులను సమర్పించి ఢిలీకి తిరిగిపోయిరి.

## కబీరు చరితము

సుల్తాను రెండవపుత్రుడగు కబీరు యదుగిరి వైభవ మునెల్ల విని, తన సోదరివలెనే తానును సంపత్పుత్రుని యనుగ్రహమును బడసి తరింపగోరి యదుగిరికేగి ఉడైయవరుల నాశ్రయింప వారాతనికి పంచసంస్కారాదుల నొనర్చి

దివ్యదేశముల సేవింపుమని యాజ్ఞనీయ, నాతడు శ్రీరంగము జేరి శ్రీరంగనాథుని ముక్తినిమ్మని ప్రార్థింప; శ్రీపురుషోత్తమక్షేత్రమున నిత్తునని స్వామి దెలుప, కబీరు పురుషోత్తమము జేరి సుభద్రాబలసహితుడగు బ్రహ్మదారుస్వరూపుడగు శ్రీజగన్నాథుని సేవించి, యటనొక పెద్దపుష్పవనమేర్పఱచి దానిని రక్షింప నొకతోటమాలినేర్పఱచి త్రికాలములందును పుష్పమాలాకైంకర్యమొనర్చుచు నుండెను.

ఒకనాడు శ్రీజగన్నాథుడు కబీరు స్వప్నమున సాక్షాత్కరించి నీకు మోక్షమిచ్చెద నని దెల్ప; కబీరు, స్వామీ; నీ వనపాలకునకును ముక్తినొసంగుమని ప్రార్థింప; వాడతి చపలుడుగాన వానికి మఱియొకజన్మలో మోక్షమిత్తును, వాని చిత్తచాంచల్యము నీకు రేపటియుదయమున దెలియగలదని జెప్పి స్వామియంతర్హితుడై చని, యొకలులాయ (దున్నపోతు) రూపము ధరించి కొమ్ములతో పుష్పవనమెల్ల భగ్నమొనర్ప, నా వనపాలకుడదిజూచి మిక్కిలికోపముతో నొక యినుపగుదియతో నిర్దయుడై దాని యొడలెల్ల నెత్తురుగారమోదెను. మరునాటి యుదయముననే కబీరు స్వామిని సేవింప నాలయమునకేగ నద్దేవుడు శరీరమెల్ల నెత్తురుగారుచు గన్పింప, కబీరు మిక్కిలిదుఃఖితుడై స్వామీ యిదేమని యడుగ; పురుషోత్తముడును నిది వనపాలుని కృత్యము; నీకోర్కి మేర నాతనికి మరుజన్మలో మోక్షమిత్తునని దెల్పెను.

మరియొకనాడు కబీరు రొట్టెదినుటకు గూర్చుండ, నొక శునకమువచ్చి యారొట్టెను లాగుకొని పరుగిడ, కబీరు దానిని వెన్నంటి, అయ్యో స్వామీ! కేవలము రొట్టెయే తిన్నచో కడుపునొప్పిగల్గునుగాన నీ నెయ్యియూ దానితో గలుపుకొమ్మని కేకలిడుచు నా శునకమును వెంబడింప, నది పరుగిడుచుపోయి సముద్రపుటొడ్డున శంఖచక్రాది యాయుధములతో, చతుర్భుజములతో పీతాంబర కిరీటాది నూపురాంత దివ్యభూషణ భూషిత శ్యామసుందర సుకుమార దివ్యమంగళ విగ్రహముతో లక్ష్మీసమేతముగ నిజరూప దర్శనంబిచ్చి యమ్మహాత్మునకు మోక్షమునిచ్చె; పౌరుల కావృత్తాంతము దెలిపి నిజ మందిరమున జొచ్చి సుఖముగ నుండ; నా పౌరజనులు గుంపులుగూడి సముద్రతీరము జేరి శిల్లిశుపుత్రు చరమశరీరమును సంస్కరించి యచ్చటనే స్వర్గ ద్వారముకడ నతని యాశ్రమమేర్పఱుప, శిల్లిశునకది తెలిసి సపరివారముగ శ్రీపురుషోత్తమము జేరి స్వామిని సేవించి బహుధనముల సమర్పించి, పుత్రుని యాశ్రమము గని పెద్ద యుంబ్రొద్దు పరితపించి విద్వజ్జనులచే బోధితుడై మనసు కుదుటపఱచుకొని తిరిగి రాజధాని కేగెను.

## యదుగిరి నామాంతరములు

పూర్వము కృతయుగమున బ్రహ్మమానసపుత్రుడగు సంపత్కుమారుడు, సత్యలోకమునుండి ఆనందమయదివ్య

విమానమునుదెచ్చి తిరునారాయణుని ప్రతిష్ఠించుటచేత నారాయణాద్రి యని పేరుగల్గెను.

త్రేతాయుగమున దత్తాత్రేయులు, నాల్గు వేదములను శిష్యులుగ జేసికొని వేదపుష్కరిణియొద్దన నిరత వేదాధ్యయనుడగుటచే వేదాద్రియని పేరుగల్గెను.

ద్వాపరయుగమున బలరామకృష్ణులచే నారాధింపబడుటచే యాదవాద్రి, యదుశైలమని పేర్లుగల్గెను.

కలియుగమున నెమ్బెరుమానార్లు వేంచేసి జీర్ణోద్ధారణ మొనర్చి యభిమానించుటచే యతిశైలమని పేరుగల్గెను.

## కూరేశాదుల సమాచారము

ఎమ్బెరుమానార్లు యదుగిరిన దర్శనస్థాపనమొనర్చుచునున్న కాలమున నొకనాడు శ్రీరంగమునుండి యొక వైష్ణవోత్తముడు వచ్చి గురుని గన్గొని మ్రొక్కి యతీంద్రులాతని నెచ్చటనుంచి వచ్చితిరన, నాతడును శ్రీరంగమునుండి యన రంగేశుని సంపద రంజిల్లుచున్నదాయని గురుడడుగ; మీరులేనికొఱతతప్ప వేరేమియు లేదని యాతడన గురుడును, కూరేశాదుల వృత్తాంతమడుగ, నా వైష్ణవుడిట్లు జెప్పదొడంగెను.

క్రిమికంఠుని భటుల వెనుక సభకేగిన కూరేశ, పూర్ణాచార్యులను, చోళుడు 'శివాత్పరతరంనాస్తి' యనివ్రాయుమని

నిర్బంధింప నందులకు కూరనాథు లనేక ప్రమాణముల జూపి యఖిల దైవములకన్న నారాయణుడధికుడని సకలశాస్త్రములు జెప్పుచున్నవి; ఒకడు పాదముజాచ మరియొకడు గడిగెను. ఆ పాదతీర్థము వేరొకడు తన శిరస్సున ధరించెను; ఇందెవ్వ డధికు డెవ్వడో నీవే జెప్పుము; అంతియెగాదు, బ్రహ్మరుద్రాదు లెల్లరకును జన్మనాశములుగలవని వేదములు జెప్పుచుండుటచే, నుత్పత్తివినాశములు లేని నారాయణుడే పరతత్త్వమని బహువిధముల దెల్పినను; చోళుడు సమ్మతింపక, పండితుడవుగాన నెన్నేని కొంటెయుక్తులు జెప్పెదవు; మారుమాటలేక నీ తాటియాకుపై గంటముతో శివాత్పరతరంనాస్తి యని వ్రాసి కదులుమని నిర్బంధింప కూరేశులది గొని పైవాక్యమువ్రాసి క్రిందనే "ద్రోణమస్తితతః పరమ్" అనివ్రాయ; దానియర్థము నెఱిగి చోళుడు క్రుద్ధుడై వీరికనులు పెరికివేయుడని భటులనాజ్ఞాపింప; కూరేశులాతనితో నిన్నుజూచినకనులు నాకక్కఱలేదని గోళ్ళతో తనకన్నులను తానే పీకిపారవేయగా; భటులు పెరియనంబిగారి కనులనూడబెరికి. వీరిని పురము దాటించి వదలిరి.

అంతట వారిద్దరు నత్తుళాయమ్మతో కొంతదూరమేగుసరికి, వార్ధక్యముచే నాబాధను సహింపలేని పెరియనంబిగారు కూరేశుల యొడిలో తలనిడుకొని కుమార్తె యొడిలో పాదములనుంచి తమ చరమదశను వారికి జెల్ప; వారును త్వరగా శ్రీరంగమునకు దీసికొనిపొమ్మందురా? యన,

నంబియు వైష్ణవునకు శ్రీరంగాది దివ్యదేశముల మరణించి ననే పరమపదము సిద్ధించునుగాని లేకున్న కలుగదని లోకులు తలతురేగాని, వైష్ణవుడున్నదియే శరీరమువిడిచినదియే దివ్య దేశమని లోకులు తెలియబోరు, గురుకృపచే న్యస్తభరులగు వారికి కాలము దేశము చూడనక్కఱలేకయే మోక్షము జెందుట సిద్ధమని జెల్పి, ఆచార్యులగు యామునుల శ్రీపాద ముల దలచుచు శరీరమును వీడిరి.

కూరేశులతో మరికొందఱు వైష్ణవులచ్చటగూడి నంబిగారికి బ్రహ్మమేధసంస్కారముచేసి, వారు కూరేశు లను అత్తుళాయమ్మగార్లను శ్రీరంగమునకు జేర్చిరి, అంతట కూరనాథులు అక్కటా నంబిగారివలె నాకును నీదేహమేల పోకున్నదని వగచి యొకనాడు శ్రీరంగని సేవింప కోవెలకు పోగా, ఆలయద్వారపాలకు లడ్డగించి యెమ్బెరుమానారు సంబంధమును వీడినచో లోనకేగవచ్చును ఐనను నీవు పండి తుడవుగాన లోనకేగు మని బల్క, నెంబెరుమానారులు సంబంధములేని నంబెరుమాళ్ళతో మాకేమి పని? యని వెనుదిరిగిపోయి శ్రీరంగమును వీడి వనాచలము జేరి సుందరబాహుస్వామిని సేవించుచు నచ్చట నుండిరి. అచ్చటనున్న కాలముననే కూరేశులు స్తవచతుష్టయమగు శ్రీస్తవము, సుందరబాహుస్తవము, అతిమానుషస్తవము వైకుంఠస్తవముల ననుగ్రహించిరి.

ఇట్లా వైష్ణవుడు జెప్పిన సమాచారమెల్ల నెఱిగి ఉడయ

వరులు పెరియనంబిగారి యెడబాపునకు మిక్కిలి దుఃఖించి వారికి శ్రీ స్వార్ణ్నపరిపాలనము మొదలు తిరునధ్యయనోత్సవము వరకు జరిపి, కూరేశుల కన్నులు లేనందులకు వగచుచు వారి నూరడించి వృత్తాంతమెల్ల విశదముగ దెలిసికొనిరమ్మని యాతనినే తిరిగి శ్రీరంగమునకు బంప నాతడేగి శ్రీరంగమున కూరేశులు లేకపోవుటచే వనాద్రికేగి యటవారి దర్శించి రామానుజుల సమాచారము దెల్ప, వానినే రామానుజులుగ భావించి సేవించి కూరేశులటనే యుండిరి.

## గోష్ఠీపూర్ణుల (తిరుక్కోట్టియూరినంబిగారి) చరమదశ

తిరుక్కోట్టియూరనబడు గోష్ఠీపురముననున్న గోష్ఠీపూర్ణులనెడి నామాంతరముగల తిరుక్కోట్టియూరినంబిగారికి నూటఅయిదు సంవత్సరములు నిండినవి. ఒకనాడు వారిని వారిశిష్యులు కొందరు స్వామీ! మీ మనసున నిప్పుడేమి తలచుచుండిరో తెల్పుడని ప్రార్థించిరి. అందులకు వారు వారితో, పూర్వమొకప్పుడు పక్షి (కపోతము) శ్రీరామచంద్రుని హృదయమున వ్రణము గల్గించెను. అట్టి ప్రవృత్తియు కూడదని నిత్యము మనసున దలచుచు నిర్భరుడై యుండుటయే ప్రపన్నలక్షణమని దెల్పి; తమ ఆచార్యులగు యామునుల పాదపద్మములను ధ్యానించుచు పరమపదించిరి. అంతట వారి పుత్రులగు నారాయణార్యులు తండ్రిగారికి బ్రహ్మమేధసంస్కార మొనర్చిరి.

## క్రిమికంఠుని దుర్మరణము

చోళభూపాలుడు తన దేశమునందలి విష్ణ్వాలయముల నెల్ల నాశమొనర్చుచు శ్రీరంగమునున్న నష్టేచేయదలచి పరివారముతో బయల్దేరి మార్గమధ్యమున నుదరబాధతో పాటు కంఠమున వ్రణమేర్పడి యది పెరిగిపెరిగి పురుగులతో బాధింప నాబాధలు భరింపలేక నాతడు చనిపోయెను. ఈ సమాచారమును, స్వాములు కొందరు యాదవాద్రికి జని, కల్యాణపుష్కరిణివద్దనున్న రామానుజులకు దెల్ప వారు మిక్కిలి యానందించి కల్యాణపుష్కరిణి యను పేరు దీనికి నేడు సార్థకమైనదని దెల్పి, వారలతోగూడి నృసింహదేవుని సేవించి, యాపై సంపత్పుత్రుని యాజ్ఞనుగొని శ్రీరంగమేగ నుత్సహించిరి.

## యదుగిరిన యతిరాజుల విగ్రహప్రతిష్ఠ

ఎమ్బెరుమానారులు యదుగిరిననున్న స్వాములనెల్ల రావించి తమ శ్రీరంగప్రయాణము దెల్పి, సంపత్కుమారుల కెట్టి లోపము రాకుండ కైంకర్యముల నిర్వహింపుడని నియమింప, వారలెల్లరును యతీంద్రుల యెడబాటునకు దుఃఖితులుకాగా వారెల్లరి ప్రార్థనపై తమ విగ్రహమొకటి జేయించి దాని నాలింగనమొనర్చి సశాస్త్రీయముగ నద్దాని నట ప్రతిష్ఠించి తమ మారుగ దాని నర్చించుకొనుచుండుడని

యాజ్ఞాపించి సంపత్కుమారుల మనసార సేవించి శ్రీరంగమునకు ప్రయాణమైరి.

## శ్రీరంగ ప్రవేశము

దండకారణ్యమున పదునాలుగు సంవత్సరములుండి మరల నయోధ్యలో ప్రవేశించిన శ్రీరామచంద్రుని జూచిన అయోధ్యావాసులెల్లరు సంతసించినట్లు, పండ్రెండుసంవత్సరములు పడమటిదేశమున పర్యటించి తిరిగి శ్రీరంగము జేరిన ఉడైయవరులకు శ్రీరంగని యాజ్ఞానుగుణముగ ఆలయాధికారులు, అర్చకులు శ్రీరంగవాసులెల్లరును నెదుర్కొని ఛత్ర చామర శంఖ కాహళ భేరీ నృత్త గీతాది సకల మర్యాదలతోను స్వాగతమొసగ, యతిపతి మిక్కిలి యుత్సాహముతో పురప్రవేశమొనర్చి వీధులన్నియు ప్రదక్షిణించి ఆలయముననున్న శ్రీరంగనాథుని సేవించి యాతనిచే నాదరింపబడి తీర్థశఠకోపమాలాప్రసాదాది సకల మర్యాదలనంది తమ మఠమున తిరిగి ప్రవేశించి సుఖముగ నుండిరి. వనాద్రి (తిరుమాలిరుంశోలై) యందున్న కూరేశు లీవృత్తాంతమెరిగి శ్రీరంగము జేరి యతీంద్రులకు సాష్టాంగమొనర్ప; యతిరాజులు వారి లేవనెత్తి తమ యశ్రుధారలతో తడుపుచు మాటిమాటికి నాలింగనమొనర్చి గద్గదస్వరముతో కూరేశా! మీకీ గొప్పదుఃఖమెట్లు గల్గినదని యడుగ తొనాడో యూర్ధ్వపుండ్రము నిందించియుండును, దానిచే

నిట్లంధత్వ మేర్పడియుండునని చెల్పి; నిది మా పాపఫలమే యైయుండునని యతీంద్రులు వారినోదార్చి తమ సన్నిధి యందే యుంచుకొనిరి.

## కూరేశులకు నేత్రప్రదానము

ఇట్లుండ నొకనాడు భాష్యకారులు కూరేశులతో వరదుడు సకలఫలప్రదుడుగాన నాతని సేవించి కన్నులబొందుటకై వానిపై నొకస్తోత్రమును రచింపుడని వారిని వెంటనిడుకొని కాంజీవరమేగి ప్రదక్షిణించి వరదుని సేవించి తీర్థ శఠకోప మాలాది సత్కారముల నందియుండ, కూరనాథులును ఆచార్యుని యాజ్ఞానుగుణముగ వరదరాజస్తవము నొనర్చి స్వామికి విన్నవింప, వరదుడు మిక్కిలి సంతసించి మీకేమికావలెనో కోరుకొనుడన, కూరేశులును మనమునసే వరదులను యతీంద్రులను (భగవానుని, ఆచార్యులను) సేవించుభాగ్యమిమ్మనికోర, రామానుజులది యెరిగి వరదుని జూచి స్వామీ! నీవు సర్వజ్ఞుడవే నాయభిప్రాయ మెరుగవా? యని; కూరేశులజూచి నాయభిప్రాయమునకు విరుద్ధముగ మీరు స్వతంత్రించి యిట్లేల జేసితిరని కోపగింప; వరదుడు ప్రసన్నుడై ఉడైయవరే! విచారింపకుడు మీకోర్కెమేరకు కూరేశులకు నేత్రముల నిచ్చుచుంటిననః; కూరేశులును వరదరాజులను ఆచార్యులగు యెమ్బెరుమానార్లను సేవించి ఆలయ గోపుర మంటపప్రాకారాదులనెల్ల సేవించి, నీ

యాశ్చర్యము జూడవచ్చిన యాశ్రితులను పురజనుల నెల్లరను ప్రత్యక్షముగ దర్శింప, నది గనిన రామానుజులు మిక్కిలి సంతసించినవారై వరదునియాజ్ఞగొని సపరివారముగ శ్రీరంగమును జేరి సుఖముగ నుండిరి.

## కూరేశుల అంతిమయాత్ర

ఇట్లు ఉడైయవరులు సుఖించుచున్న కాలమున, కూరేశులు ఉడైయవరులకు జెప్పక శ్రీరంగని సేవించి నిల్చొనగా, శ్రీరంగనాథుడు ఆళ్వాన్‌లనుజూచి మీరేదో అడుగబోవుచుంటిరే? యనియడుగ, ఆళ్వాన్ లు అడిగిన నిత్తువా? యన, మీరు సంశయింప నక్కఱలేదు, నాభార్యపైనొట్టు రామానుజులపై ఒట్టు, తప్పకయిత్తు నడుగుడన, ఆళ్వాన్లు స్వామీ! నిన్ననుభవించుటకు నడ్డముగానున్న యీ శరీరసంబంధమును విడిపించుమని ప్రార్థింప; శ్రీరంగ డదిగాక వేరేదైన కోరుడనగా, ఆళ్వాన్లదియే కావలయునని నిర్బంధింప శ్రీరంగనాథు డంగీకరించి, మీకును మీ సంబంధుల కెల్లరకును పరమపద మిచ్చితినని తిరుపగి యట్టము (తలపాగా) తళిహ ప్రసాదము శేషమాల మొదలగునవి యనుగ్రహింప వానిని స్వీకరించి, అర్చిరాదికి ప్రథమాలంకారము లనదగినట్లు బయల్పడి తమయింటి కేగక, నమ్మాళ్వార్ సన్నిధికేగి యటనుండిరి.

ఉడైయవరు లిది తెలిసి నడుమునన్న వస్త్రమును

దీసి గాలిలోన కెగురవైచుచు ఆనందింప సన్నిధిస్వాము లదేమన కూరత్తాళ్వాన్ల సంబంధముగల మాకును పరమ పదము నిశ్చయమాయె ననిరి. దీనిచే సదాచార్య సంబంధ ముతోను సచ్ఛిష్యసంబంధముతోను తారతమ్యములేక నొకరివలన మరొకరికి పరమపదప్రాప్తి సిద్ధమని తెలియ నగును.

ఎమ్బెరుమానార్లు కూరేశుల యెడబాపునకు దుఃఖితులై వారిసన్నిధికేగి, ఆళ్వానే! యిట్లు చేయనగునా? యన, వారును స్వామీ! పరమపద మర్యాదానుగుణముగ, ముందే గినవారు తర్వాత వచ్చువారలకు స్వాగత మిత్తురని యున్నది గదా! అందులకై ముందుగ నేగవలదా? యన, నుడై యవరులు సంతసించి చెవులోనాళ్వాన్లకు ద్వయము నుపదేశింప, సన్నిధిస్వాములిదేమని యడుగ, రాజకుమారునకు కర్పూ రతాంబూలము లేకున్ననో రెండునట్లు వీరికి ద్వయమంత్రము లేకున్న నాల్కయెండునుగాన ద్వయమంత్రోపదేశ మొన ర్చితినని దెల్పి, యెమ్బెరుమానార్లు ఆళ్వాన్లనుజూచి మమ్ములనున్ను వెంటబెట్టుకొనిపోక, మమ్ములను శ్రీరంగ నాథుని విడిచి వెళ్ళుటకు మీకు కోర్కెగల్గినదే! యిచ్చట గల మేమెల్లరము నేమి పాపము జేసితిమో! పరమపద వాసులు మీసన్నిధి లభింప నేమి సుకృతము జేసిరోగదా! యిక మీమనసు కలతపెట్టుట వలన నేమి ప్రయోజనము

గలదు? కావున మీరు సుఖముగ నిత్యవిభూతి నలంకరించు డన, కూరేశులు మొదలు నరికిన చెట్టువలె నుడైయవరుల శ్రీపాదములపైబడి లేవకయున్న నెమ్బెరుమానార్లు వారిని లేవనెత్తి మాటిమాటికి నాలింగనమొనర్ప కూరేశులు ఆచార్యశ్రీపాదముల తమ శిరస్సునకు హృదయమునకు నేత్రములకు నద్దుకొని, శ్రీపాదతీర్థము నపేక్షింప, భాష్యకారులు స్వహస్తముతో వారికి శ్రీపాదతీర్థము కటాక్షింప, స్వీకరించి ఆళ్వాన్లు రామానుజులను వారిమఠమునకు వేంచేయుడని ప్రార్థించి సాగనంపి, కూరేశులు తమయింటి కేగి భార్యయగు నాండాళ్ళమ్మనుజూచి నీయభిప్రాయమేమని యడుగ దేవరవారి యభిప్రాయమునకన్న దాసికి వేరేమికలదని యామె విన్నపింప, కూరేశులు భట్టరును శ్రీరామపిళ్ళను పిలిచి రంగనాథుని నన్నుగా జూచుకొనుడు, శ్రీరంగడుండగ మాకేమి? యనుకొనక ఉడైయవరుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుడు, మీతల్లి జెప్పినట్లు వినుచుండుడు, భాగవతోత్తముల విషయమున ప్రమాదముచేనైన త్రికరణముల చేతను అపచారపడకుడని దెల్ప; వారును ఆళ్వాన్ల పాదములపైబడి దుఃఖింప వారల లేవనెత్తి యోదార్చి, మీరు ప్రాకృతసంబంధమును బట్టి విచారించినచో రామానుజుల శ్రీపాదములకు తప్పినవారగుదురు; లేక ఆత్మసంబంధమునుబట్టి విచారించినచో విడువరాని సంబంధము నెఱుగనివారగుదురుగాన మీకేమియు కొఱత

లేదని దెల్పి, ఆలయమున కెదురుగ పిళ్ళైపిళ్ళైయాళ్వాన్ల యొడిలో తలనుంచి ఆండాళ్ళమ్మ (భార్య) ఒడిలో పాదము లిడి ఉడైయవరుల శ్రీపాదముల ధ్యానించుచు పరమపదము నకు వేంచేసిరి.

కూరేశుల చరమకైంకర్యము నెంబెరుమానార్ల భట్టరుద్వారా నిర్వహింపజేసి, శ్రీరంగనాథుని సన్నిధికి దీసి కొనిపోయి శ్రీరంగనాథా నీ పుత్రునకు దీర్ఘాయువు నిమ్మని కోర, రంగడును భట్టరునుజూచి తండ్రిపోయెనని దుఃఖింపక నన్నే తండ్రిగ దలచియుండుమని దెల్పి, ఆయువువిషయమున పూనిరైయి తీర్థ శఠకోప మాలికల నిప్పించి వారిని సాగసంపెను.

## ఉడైయవరుల ఆశ్రితుల వివరణము

ఉడైయవరుల నాశ్రయించిన వారల పవిత్ర నామములు. ముల్లోకములను పవిత్రమొనర్పగల సమర్థులగుటచే వారల తిరునామముల ననుసంధింపవలసియున్నది. అందు ప్రధానులు,

కూరత్తాళ్వాన్ మాడభూషియాళ్వాన్ గోమఠత్తాళ్వాన్ శట్టలూరిశిరియాళ్వాన్ అనంతాళ్వాన్ నడాధూరాళ్వాన్ అరణప్పురత్తాళ్వాన్ నెయ్యుండాళ్వాన్ ఉక్కలాళ్వాన్ వేదాన్తియాళ్వాన్ నడువిలాళ్వాన్ పిళ్ళపిళ్ళైయా

ళ్వాన్ మిళహాళ్వాన్ కారంజియాళ్వాన్ ఈణ్ణియాళ్వాన్ కోయిలాళ్వాన్ తిరుకోవలూరాళ్వాన్ తిరుమోగూరాళ్వాన్ అకలంకనాట్టాళ్వాన్ ముతలియాణ్డాన్ పెరియాణ్డాన్ సిరియాండాన్ అమ్మంగియాండాన్ మారుధిప్పెరియాండాన్ మాఱొన్నిల్లామారుధిసిరియాండాన్ సోమాసియాండాన్ కందాళైయాండాన్ ఈశ్వరాండాన్ ఈణ్ణియాండాన్ కురంజిపూరిసిరియాండాన్ ఆళవందారాండాన్ అయ్యారాండాన్ కిండాబియాచ్చాన్ సిరియాచ్చాన్ కణ్ణియనూరిసిరియాచ్చాన్ కొంగిలాచ్చాన్ ఈచ్చంబాడియాచ్చాన్ ఎన్నాచ్చాన్ అయిప్పిళ్ళైయాచ్చాన్ తూప్పిర్‌పిళ్ళైయాచ్చాన్ అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్ తొండనూర్నంబి మరుధూర్నంబి మళపూర్నంబి శొట్టనంబి కురువినంబి తిరుకురుంగుడినంబి వంగిపురత్తునంబి ముడుంబనంబి శ్రీపరాంకుశనంబి శ్రీపరాంకుశభట్టర్ వరుందరుంపెరుమాళ్‌భట్టరు అమ్మంకియమణవాళభట్టర్ శ్రీపరాశరభట్టర్ శ్రీవేదవ్యాసభట్టర్ శిఱుప్పుళిదేవరాజభట్టర్ తిరువరంగభట్టర్ గోవిందభట్టర్ నంబియూరిల్ శ్రీరంగరాజభట్టర్ ఉళ్యూరిల్ పెరియభట్టర్ వరుందరుంపెరియపెరుమాళ్‌భట్టర్ శట్టంబల్లిజియ్యర్ ఈచ్చంబాడిజియ్యర్ తిరువేఙ్గడజియ్యర్ కులశేఖరజియ్యర్ ఆళ్‌కొండుపల్లిజియ్యర్ తిరుమఙ్గైజియ్యర్ సాలగ్రామజియ్యరు తిరుప్పుళింగుడిజియ్యరు శ్రీగోవిందజియ్యరు తిరుమాలిరుంశోలైజియ్యరు తిరుముట్టంజియ్యరు తిరునెన్నూరు

జియ్యరు తిరువడందై జియ్యరు తిరునారాయణపుర త్తరయర్ పెరుమాళ్ కోయిల్ వరుందరుం పెరుమాళరయర్ రాజనారాయణ ప్పెరుమాళరయర్ తిరువరంగ ప్పెరుమాళరయరు తిరువేంగళ త్తరయర్ తిరువాయ్ మొళియరయరు ప్పిళ్ళై త్తిరునరయూరరయర్ తిరుక్కురుంగుడియరయరు తిరునగరియరయరు రాజమహేంద్ర ప్పెరుమాళరయర్ విల్లిపుత్తూరరయర్ ఆళుల్ కొండుఅమ్మంగియమ్మాళ్ ముడుంబయమ్మాళ్ పరి త్తిక్కొళ్లైయమ్మాళ్ ఉక్కలమ్మాళ్ శొట్టయమ్మాళ్ హారీతకులతిలకులగు ఆసూరి ప్పెరుమాళ్ కిడాంబి ప్పెరుమాళ్ అమ్మంగి ప్పెరుమాళ్ ముని ప్పెరుమాళ్ పట్టిని పెరుమాళ్ వడముని పెరుమాళ్ తిరుమలై నల్లాన్ ఎంబార్ కరాంజి సోమయాజియార్ పెరియకోయిల్ వళ్ళలార్ అలంకార వేఙ్గడవర్ తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ ఆరుకాట్టిపిళ్ళాన్ రామానుజ ప్పిళ్ళాన్ తిరునగరిప్పిళ్ళాన్ గోమఠత్తియ్యార్ వైత్తమానిధి శిరియయ్యార్ పెరియయ్యార్ అణియరంగత్తముతనార్ కుమాండూరిళయవల్లి కుమాండూరిప్పిళ్ళై నంబికురుందేవర్ అంబత్తిరువురీ యెంబెరుమాన్ శెల్వపిళ్ళై చ్చాత్తాదులలో కులశేఖర ప్పెరుమాళ్ దాసర్ పట్టర్ పిరాన్ దాసర్ పహావెళ్లి దాసర్ శ్రీవిల్లిపుత్తూర్ దాసర్ శ్రీనారాయణదాసర్ శ్రీ శ్రీగోవర్ధనదాసర్ తిరువళుదివళనాడుదాసర్ శ్రీరామానుజ దాసర్ పిళ్లైయురంగావిల్లిదాసరు వండర్ శొండర్ రామానుజవెళ్లైక్కారల్; తిరువరంగదాసరు తిరుమాలిరుంశోలై

దాసర్ వానమామలైదాసరు అప్పిళ్ళైయుయణవాళదాసరు తిరువేంగడదాసరు పేరరుళాళదాసరు; తిరువేంగడదాసరు యతివరచూడామణిదాసరు యతిరాజదాసరు ఇళైయాళ్వారు దాసరు; మహిళలంగాలదాసరు శ్రీశఠకోపదాసరు పిళ్ళైతిరువాయ్మొళిదాసరు; సేననాథబ్రహ్మరాయరు వీరసుందరబ్రహ్మరాయరు జగన్నాథబ్రహ్మరాయరు వీరరాఘవబ్రహ్మరాయరు పిళ్ళైయుడైందయుడయారు; తిరువరంగమాళిగైయరయరు ఆండవరు అరియవరు అముతుపడియూరిప్పరు; అమ్మంగార్లలో తిరువనంతపురత్తమ్మై తిరువాట్టాత్తమ్మై తిరువణ్బరిశారత్తమ్మై మున్నినాల్కోయల్ప్పారుత్తమ్మై తిరుసరయూరమ్మై తిరుక్కణ్ణపురత్తమ్మై తిరుప్పతిశ్రీకార్యం శెయ్యుమమ్మై ఆండాడమ్మై నాయకత్తేవియూరు ఉయ్యప్పరుందేవియూరు పెరియపెరుందేవియూరు శిరియపెరుందేవియూరు; పెరియపిరాట్టియూరు అత్తుళాయమ్మై అమ్మంగి కూరత్తాండాళ్ దేవకీపిరాట్టియూరు యతిరాజవల్లియూరు పంగయచ్చెల్లియూరు పొన్నాచ్చియూరు యన్నికైవంచియూరు చూడిక్కొడుత్తాళ్ తిరుప్పావైపాడినాళ్ మొదలగువారు.

## సింహాసనాధిపతులు

భగవద్రామానుజులచే డెబ్బదినల్గురు సింహాసనాధిపతులుగా నేర్పాటుపబడిన ఆచార్యపురుషుల తిరునామములు

కూరత్తాళ్వాన్ ముతలియాండాన్ అరుళాళప్పెరుమాళె మ్బెరుమానార్ కిడాంబియాచ్చాన్ తిరుమలనల్లాన్ అనంతాళ్వాన్ ఎంబారు ఆళవన్దారుల కుమారులు శొట్టనంబి, పెరియనంబి కుమారులు పుండరీకులు, తిరుక్కోట్టియూరినంబి కుమారులు తెక్కాళ్వాన్, తిరుమాలైయాండాన్ కుమారులు సుందరత్తోళుడయాన్, పెరియతిరుమలనంబి కుమారులు రామానుజంపిళ్ళై, తొండనూర్నంబి మళువూర్నంబి తిరుక్కురుంగుడినంబి కురువనంబి ముడుంబనంబి శ్రీపరాంకుశనంబి వడుకనంబి వంగిపురత్తునంబి పిళ్ళైతిరుమలనంబిపిళ్ళైపిళ్ళైయాళ్వాన్ శట్టలూరిశిఱియాళ్వాన్ ఈణ్ణిప్పిళ్ళయాళ్వాన్ నెయ్యుండాళ్వాన్ మిళహాళ్వాన్ మారుధిప్పెరియాండాన్ ఈశ్వరాండాన్ జియ్యరాండాన్ శిరుప్పుళ్ళిదేవరాజభట్టరు ఉళ్ళూరిపెరియపెరుమాళ్భట్టరు శ్రీరంగరాజభట్టరు ఉక్కలాళ్వాన్ పరిత్తిక్కొల్లైయమ్మాళ్ అమ్మంగియమ్మాళ్ నడివిలాళ్వాన్ గోమఠత్తాళ్వాన్ తిరుక్కోవలూరాళ్వాన్ తిరుమోహూరాళ్వాన్ వేదాన్తియాళ్వాను కోయిలాళ్వాను అరణపురత్తాళ్వాను ఈచ్చంపాడి ఊచ్చాను కణ్ణియనూరిసిరియాచ్చాను శట్టంపల్లిజియ్యరు ఈచ్చంపాడి తిరువెళ్ళరై ఆళ్కొండపల్లిజియ్యరులు తిరునగరప్పిళ్లై కరాంజిసోమయాజియాన్ అలంకారవేంగడవర్ నంబికురుందేవరు పిళ్ళైయుడందుడయారు తిరుక్కురుహాప్పిరాన్పిళ్ళాను పెరియకోయిల్వళ్ళలారు తిరుక్కణ్ణపురత్తా

చ్చాను ఆసూరి పెరుమాళ్ ముని పెరుమాళ్ అమ్మంగి పెరుమాళ్ కుమాండూరియిళయవిల్లి రామానుశప్పిళ్ళై మారొన్నిల్లామారుధిచ్చిరియాండాను సోమాసియాండాను ఈణ్ణిప్పిళ్ళయాండాను పెరియాండాను కురుంజిపూరంజియ్యరాండాన్ అమ్మంగియాండాను ఆళవందారాండాను కిళాంబి పెరుమాళ్ ఆరుకాట్టిపిళ్లానుమళుభూర్నంబిపిళ్ళయ్ తిరునారాయణపుర త్తరయరునడాథూరియాళ్వాను యంగళాళ్వానులు.

## ఆచార్య పురుషుల నియమనము

ఉడైయవర్లు వీరినందరను దేశపర్యటన మొనర్చి సిద్ధాన్తప్రచార మొనర్చుచు నాశ్రితులకు పంచసంస్కారముల నొనర్చి శిష్యులనుగా జేర్చుకొని వంశపరంపరగా నాచార్య పురుషులై (గురువులై) వారల నుజ్జీవింపజేయుడని యాజ్ఞాపించిరి.

ఈ ఆచార్యపురుషులే నేటికిని 'శ్రీరామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతామభివర్ధతాం' అని దేశవ్యాప్తముగవంశగురువులుగ నధికారముతో పర్యటించుచు నాశ్రితులగు శిష్యులెల్లరను పంచసంస్కారపరులనొనర్చి యాత్మహితోపదేశములతో నుజ్జీవింపజేయుచుండిరి.

## కైంకర్యపరుల వివరణము

ఉడైయవరులిట్లసంఖ్యాకులగు శిష్యసంపదతో శ్రీ

రంగమున వేంచేసియున్న కాలమున, యతిసార్వభౌములకు నిరంతరము కైంకర్యము లొనర్చుటలో కూరత్తాళ్వాను ముతలియాండాను నేళాధూరాళ్వాన్లు చేతికఱ్ఱవలె నాధార భూతులై యుందురు. అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లు ఆచార్య నియోగమున భగవదారాధనము సల్పుదురు. కిళామ్బిప్పెరుమాళును కిళామ్బియాచ్చానులు వంటయింటి కైంకర్యనిర్వాహకులై యుందురు. వడుగనమ్బి యజ్ఞ్యం జన (తలంటు) కైంకర్యము సేయుచుండును. గోమఠచ్చిరియాళ్వాను పాదుకల సమర్పించు కైంకర్యమున నుందురు. ధనుర్దాసుడు కైదండ యొసంగును. అమ్మంగియమ్మాళ్ పాలు కాచి సమర్పింతురు. ఉక్కళమ్మాళ్ చామర కైంకర్యమొనర్తురు. ఉక్కలాళ్వాను భుజించిన పాత్రను శుద్ధియొనర్తురు. మారుధియాండాను కావేరితీర్థకైంకర్యమొనర్తురు. మారొన్నిల్లామారుధిచ్చిరియాండాను మఠమునకు బియ్యము పప్పులు నేయి పాలు పెరుగులు మొదలగునవి సమర్పణరూప కైంకర్యమొనర్తురు. తుయ్యముని తిరుమంజన కైంకర్యమొనర్తురు. తిరువరంగమాళికైయారు శ్రీభాండార కైంకర్యమొనర్తురు. వండరు శుండరులు రాజసేవాలబ్ధమగు ధనమును దెచ్చి శ్రీమఠకైంకర్యమొనర్తురు. రామానుజవిళక్కారల్ తిరుమేని సంరక్షణ తత్పరులైయుందురు. అకలంకనాట్టాళ్వారు ప్రతిపక్షుల నోడించుటయం దాసక్తులైయుందురు.

## యతిరాజు వైభవ ప్రకాశకులు

ఇట్లున్న ఉడైయవరుల వైభవమును ప్రకాశింప జేసిన వారలలో ప్రధానులు, శ్రీరంగనాథుడు వేంకటేశ్వరుడు వరదరాజులు తిరునారాయణస్వామి సుందరబాహుస్వామి తిరుక్కురుంగుడినంబి నమ్మాళ్వార్లు శ్రీమన్నాథమునులు ఆళవన్దార్లు పెరియనంబి తిరుక్కోట్టియూరినంబి తిరుమలనంబి తిరుమాలై ఆణ్డాను తిరువరంగప్పెరుమాళరైయర్ యితరులగు నాచార్యపురుషులు బ్రహ్మరక్షస్సు మూగవాడు మొదలగువా రనేకులు.

అందు శ్రీరంగనాథుడు, నోరుతెఱచి ఉభయవిభూతి యైశ్వర్యమును మీకును మీవారికిని యిచ్చితిమనుటచేతను,

వేంకటేశుడు, రామానుజాజ్ఞానుగుణముగ గొల్లవనితకు మోక్షమిచ్చుటచేతను,

వరదరాజులు, యజ్ఞేశు జయించు సందర్భమున సలహా నిచ్చుటచేతను, యాదవప్రకాశుని కలలోగన్పించి రామానుజుల కొకమారు ప్రదక్షిణ మొనర్చి త్రిదణ్డసన్యాసివిగమ్మని దెల్పుటచేతను,

తిరునారాయణస్వామి, తొండనూరులో స్వప్నమున గన్పించి తిరునారాయణపురమున (మేల్కోటన) నన్నుద్ధరింపుమనుటచేతను, ఢిల్లీలో యతిరాజసంపత్కుమారులుగా

ప్రసిద్ధినొందుట చేతను,

సుందరబాహుస్వామి, యొకనాటి సభలో ఉడైయవరుల సంబంధులను రమ్మనుడన ఆచార్యపురుషులెల్లరురాగా, పెరియనంబిగారి బంధువులు రాకుండుటచే అఖ్ళకరు మీరేల రారైరి? యన వారును రామానుజ సంబంధుల మీరు పిలిచిరిగదా! మేము యతీంద్రుల ఆచార్యులగు పెరియనంబిగారి వంశస్థులముగాన రాకుంటిమని తెల్ప అఖ్ళకరందులకు 'దశరథ వసుదేవాదులు మమ్ముల్లను పుత్రులుగా దలచుకొన్నట్లున్నది! మీరు యతీంద్రులను శిష్యభావన జేయుటయనుటచేతను; మరియొకనాడు కిడాంబియాచ్చానుల పిలిపించి, యొకనూటయేదైన తెల్పుమన నాతడును "అపరాధసహస్రభాజనం పతితంభీమభవార్ణవోదరే। అగతింశరణాగతంహరే కృపయా కేవలమాత్మసాత్కురు" (భగవద్భాగవతాచార్యవిషయములందు జేసిన యపరాధములు వేలకొలదియుండుటకు స్థానమైనవాడనై ఘోరసంసారసాగరమధ్యమున నోడ్డగానక పడియుండుటచేతను, రక్షకులులేక దేవరవారే రక్షకులని శరణాగతి యొనర్చితినిగాన నన్ను నిర్హేతుకదయతో దాసునిగా స్వీకరింపుము) అని విన్నపింప, అఖ్ళకరును ఉడైయవర్ల సంబంధముండగా గతిలేనివాడనంను టేమని తెల్పుట చేతను,

తిరుక్కుఱుంగుడినంబి, ఉడైయవరులవలన ద్వయమునుపదేశముంది శిష్యకృత్యమొనర్చుట చేతను,

న మూర్తిళ్వార్లు భవిష్యదాచార్యవిగ్రహమును (ఉడైయవరులను) నాథమునుల కిచ్చుటచేతను,

నాథమునులు, భవిష్యదాచార్యవిగ్రహమును తామర్చించి తమవారికెల్ల పరంపరాగతముగ నర్చించునట్లనుగ్రహించియుండుటచే నది యిప్పటికిని శ్రీరంగమున భగవద్రామానుజ చరమవిగ్రహసన్నిధిన నున్నదగుటచేతను,

యామునులు, కాంజీవరమున యాదవప్రకాశునివద్ద జదువుచున్న లక్ష్మణార్యులనుజూచి 'ఆముదల్వనివన్' (ఆదిశేషుడేవీరు) అని తెల్పియుండుటచేతను, చరమ శరీరమున ముడిచియున్న చేతివ్రేళ్ళను తెఱచుటచేతను,

పెరియనమ్బి, తమయింటికి వచ్చిన యతిరాజులకు సాష్టాంగదండప్రణామ మాచరింప, నమ్బిగారికుమార్తె యగు అత్తుళాయమ్మ యిదేమని తండ్రినడుగ, నమ్బియు కృష్ణునకు సాందీప ఉద్ధవ అక్రూరుల పగిది ఆచార్యులనైతి నంతియే యనుటచేతను, తమ పుత్రులగు పుండరీకాక్షుల నుడైయవరుల నాశ్రయింపజేయుటచేతను,

తిరుక్కోట్టియూరినమ్బి, తాముపదేశించిన తిరుమంత్రమును (తమకుమారులగు) తెఱ్కాళ్వాన్ యింటిలో జరుగుచున్నగోష్ఠిలో బయల్పఱచి యనేకుల నాశ్రితులనొనర్చిన వైభవమునుజూచి ఎమ్బెరుమానారే యని బిరుమనిచ్చి యాలింగన మొనర్చుటచేతను,

తిరుమలనమ్బి ఎమ్బార్లను యతిపతులకు ఉదకధారా పూర్వకముగ నిచ్చుటచేతను, తమయిరువురు కుమారులగు రామానుజులను పిళ్ళయ్‌తిరుమలై నమ్బినిన్ను ఉడైయవరుల శ్రీపాదముల నాశ్రయింపజేయుటచేతను,

తిరుమాలై ఆణ్డాన్, తమ తిరువాయ్‌మొழி కాలక్షేపమున నుడైయవరులు దెల్పెడి విశేషార్థములను తమ ఆచార్యులగు యామునుల శ్రీసూక్తులుగభావించి దండము సమర్పించుటచేతను, తమకుమారులగు సున్దరత్తోళుడైయార్లనుడైయవరుల నాశ్రయింపజేయుటచేతను,

తిరువరఙ్గపెరుమాళరయర్, పంచమోపాయనిష్ఠనను గ్రహించి తమకుమారులగు తిరువాయ్‌మొழிయరైయర్‌ను యతీంద్రుల శ్రీపాదముల నాశ్రయింపజేయుటచేతను,

వడుకనమ్బి, ఆచార్యపదము రామానుజులయందే చెల్లునుగాన నెల్లరకును ఎమ్బెరుమానార్ల శ్రీపాదములే ఉపాయోపేయములని దెల్పుటచేతను,

కణ్ణియునూరిశిఱియాచ్చాన్, కట్టుబట్టలతో స్నానమాడి ఎమ్బెరుమానారు శ్రీపాదములకన్న వేరు రక్షకము లేదని దెల్పి, శ్రీరంగనాథుని సన్నిధిలో శఠకోపమును శిరస్సునధరించి 'సత్యంసత్యంపునస్సత్యం యతిరాజోజగద్గురుః సఏవసర్వలోకానాముద్ధర్తానాత్రసంశయః' (ముమ్మా

టికెని యతిరాజులే జగత్తునకెల్ల నాచార్యులు, వారేసకల లోకముల నుద్ధరించువారు, ఇందు సందేహములేదు) అని దెల్పుటచేతను,

అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్లు, తమ ఆశ్రితులగు ఎచ్చాన్ అనన్తాళ్వాన్ తొణ్డనూర్నంబి మరుతూర్నంబులకు హితోపదేశమొనర్చి ఎమ్బెరుమానారు శ్రీపాదములే రక్షకమని నమ్మియుండు డనుటచేతను.

పిళ్ళైపిళ్ళైయాళ్వాన్, కూరేశుల నాశ్రయించిన కాలమున కూరేశులు, ఆచార్యదక్షిణగ త్రికరణములచేతను భాగవతాపచారము జేయనని దానజలముగొన, నాతడును నొకభాగవతునియెడ మరల నపచారపడి ఆచార్యద్రోహ మొనర్చితినేయని పశ్చాత్తప్తుడై ముసుగిడి యింటిలో పండుకొనగా, కూరేశులాతని పిలిపించి, రాజదండన భయముచే కాయికముగ నపచారపడ వీలులేదు, లోకాపవాద భీతిచే నోటినిదగ్గరుంచుకొనుము, మానసికముగ నపచారపడకుండ ఎమ్బెరుమానారుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుమని దెల్పుటచేతను,

మిలకాళ్వాన్, ముతలియాండానుతో నాతో వాదింపుమని కోర, ముదలియాండాన్లు మీరోడిన నేమి జేతురన [illegible] భుజములపై నిడుకొని మోతుననిదెల్పి, ఓడిపోయి [illegible] ని మోయలేక పాదములపైబడి కనిక

రింపుడని ప్రార్థింప ఆండాన్లు వానికి: ఎమ్బెరుమానారు శ్రీపాదములే రక్షకముగ నమ్మియుండుమని చెప్పుటచేతను,

ఎమ్బారు, భట్టరునుజూచి, శ్రీరంగడు పుత్రునిగ స్వీకరించెనుగదా! కూరేశుల పుత్రుడనుగదా! అఖిలశాస్త్రములను బాగుగ జదివితినిగదా! యని గొప్పతనమునకుపోక ఎమ్బెరుమానారుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుమని యానతిచ్చుటచేతను,

భట్టరు నంజీయరునుజూచి, వేదాన్తియను పేరుగలవాడను భట్టరునాశ్రయించితిని, బహుద్రవ్యమును ఆచార్యదక్షిణగ సమర్పించితినని గర్వింపక, ఎమ్బెరుమానారుల శ్రీపాదములే రక్షకమని, నమ్మియుండుమని జెప్పుటచేతను,

నంజీయరు నంబిళ్ళనుజూచి లోకాచార్యులని బిరుదు గలదనియు, తిరువాయ్మొళికి వ్యాఖ్యయొనర్చితిననియు, గర్వింపక ఉడైయవరుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుమని చెప్పుటచేతను,

నంబిళ్ళయే యొకనాడు శివకర్పూరప్పిళ్ళ చేయిబట్టుకొని వచ్చుచుండగా, నంబిళ్ళగారి వాకిలిన నొక వైష్ణవుడు కాలుజాచుకొని పరుండ శివకర్పూరప్పిళ్ళ, ఓయీ కాలు ముడుచుకొనుమన; అందులకు నంబిళ్ళగారు శివకర్పూరప్పిళ్ళను జూచి శ్రీమన్నమ్మాళ్వార్ల వైష్ణవుల పాదమును శ్రీపాదములనగా; నీవు కాలు అంటు వేమని కోపించి చేయివిడువగా,

నాతడు క్షమాపణకోరుకొన నంబిళ్ళగారు శివక్కరప్పిళ్ళను జూచి ఉడైయవరుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండు మనుటచేతను

తిరుక్కురుకైప్పిరాన్‌పిళ్ళాన్ తమవద్ద శ్రీభాష్యమధి కరించిన సోమాశియాణ్డానునకు ఉడైయవరుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుమని చెప్పుటచేతను

గోమఠత్తుపిళ్ళాన్ తమవద్ద శ్రీభాష్యము నధ్యయన మొనర్చిన కాక్కైప్పాడియాచ్చాన్‌పిళ్ళనుజూచి ఎమ్బెరు మానార్ల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుమనుటచేతను

ఎఙ్గళాళ్వాన్, కాక్కైప్పాడియాచ్చాన్పిళ్ళను జూచి మిమ్ము శ్రీరంగనాథుడు కోపగించినప్పుడేమని తలతురని యడుగ, యెమ్బెరుమానారుల శ్రీపాదములే రక్షకమని తల తుననుటచేతను

నడాదూరమ్మాళ్ పన్నిద్దరు శిష్యులకు శ్రీభాష్యము ననుగ్రహింప, భక్తికంటెను ప్రపత్తి దుర్లభముగానున్నదే? యనివారలనగా, ఐనచో ఎమ్బెరుమానారుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండుడనుటచేతను

నడువిలాళ్వాన్, తిరునారాయణపురమున శ్రీభా ష్యము ననుగ్రహించుచున్నకాలమున వంగిపురత్తాయ్చ్చి శొట్టియ్యమ్మాళ్ మొదలగువారు వినుచుండి ఇది చాల

కష్టముగ నున్నదన, నైనచో దీనిననుగ్రహించిన ఉడైయవరుల శ్రీపాదములే రక్షకమని నమ్మియుండు డనుటచేతను

శ్రీవేదవ్యాసభట్టరు, తిరునారాయణపురమున ఏబదియిరువురు శిష్యులకు శ్రీభాష్యమును గృపజేయుచుండ వారలు మాకిది అవగాహింపసాధ్యపడదన, నైనచో మన కులదైవమగు నుడైయవరుల శ్రీపాదములే నమ్మియుండుడనుటచేతను

నడువిల్ తిరువీధిపిళ్ళైభట్టరు తన యాశ్రితుల కట్లే దెలిపియుండుటచేతను

వడుగనంబి, ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణమనియు నంబెరుమాళ్ తిరువడిగళే శరణమనియు ననుసంధించెడి కూరేశులు ముదలియాండానులను రెండుగట్లపై కాలుపెట్టినవారని పరిహాసించుటచేతను

ఉడైయవరులు, ముదలియాణ్డాన్ మొదలగువారలకు యాదవాద్రి మాహాత్మ్యగ్రన్థము కాలక్షేప మొనర్చుచు 'అనన్తఃప్రథమంరూపం, లక్ష్మణస్తదనంతరం, తృతీయో బలభద్రస్తు, కలౌకశ్చిద్భవిష్యతి' అనెడి నాల్గవపాదమునకు 'నేనే విషయమ'ని దెల్పుటచేతను

బ్రహ్మరక్షస్సు, యాదవప్రకాశులకు లక్ష్మణార్యులను జూపివీరు నిత్యసూరిశ్రేష్ఠులని దెల్పుటచేతను

మూగవైష్ణవబాలు డొకడు కంచియందు ఐదారుసంవ

త్సరముల వయసువాడు, రెండుసంవత్సరముల పర్యంతము గన్పించకయుండి, ఆపైన నొకనాడందరకు గన్పింప వారాశ్చర్యముతో నెచ్చట కేగితివని యడుగ; నాబాలుడు శ్రీరాచికి పోతినన, అచ్చటి విశేషములేమి?యని వారడుగ నాబాలుడు ఆదిశేషుడే లక్ష్మణార్యులుగ నవతరించెనని యచ్చటి వారు జెప్పుకొనుట వింటినని దెల్పి యదృశ్యుడాయెనని శ్రీభగవత్సేనాపతిజీయరు లనుగ్రహించుట చేతను

వీరెల్లరును భగవద్రామానుజుల వైభవమును బ్రకాశింప జేసిన వారలని పెద్దలు దెల్పుదురు.

భగవదవతారము లెన్నియోయున్నను, రామకృష్ణాద్యవతారములకు ప్రాధాన్యమున్నట్లును; దివ్య దేశము లెన్నియో యున్నను, శ్రీరంగము తిరుమల విష్ణుకంచి తిరునారాయణపురములకు ప్రాధాన్యమున్నట్లును; ఋషులెందరో యుండగా, వ్యాస పరాశర శుక శౌనక నారదాదులకు ప్రాధాన్యమున్నట్లును; ఆళ్వారులెల్లరునుండగా, నమ్మాళ్వారులకు ప్రాధాన్యమున్నట్లును; నాథయామునాది ఆచార్యులందరియందును ఉడైయవరులకు ప్రాధాన్యముండుటలో నభ్యంతరము లేదు. వీరు ఆళ్వారాచార్యరత్నహారమున మధ్యస్థానమున నాయకమణిగ ప్రకాశించిరి.

## ఆచార్య వైభవము

ఆచార్యులను లభించినవాడు, అర్థపంచకజ్ఞానము

నెఱుగతగు ననియు; పాపాత్ముడగు క్షత్రబంధువను రాజును పుణ్యాత్ముడగు పుండరీకుడను రాజును, ఆచార్యునివలననే ముక్తిని బొందిరనియు; ఆచార్యులే నడచుచున్న శ్రీమహావిష్ణువనుటలో సందియములేదనియు; సకలశాస్త్రములయందును దెల్పబడిన సారతమములగు విషయములను బాగుగ పరిశోధించి, తానాచరించి, తరువాత శిష్యులచేతనున్నాచరింపజేయువారే ఆచార్యులనియు, 'గు' శబ్దము చేత చెప్పబడు అజ్ఞానాంధకారమును 'రు' శబ్దము చేత చెప్పబడు జ్ఞానదీపముచే పోగొట్టువారగు గురువే అన్నిటికంటెను అధికులనియు; ఆచార్యులే పరమాత్మ, ఆచార్యులే గొప్పసంపద, ఆచార్యులే భోగ్యవస్తువు, ఆచార్యులే పరమప్రాప్యము, ఆచార్యులే బ్రహ్మవిద్యయు, ఆచార్యులే మేలగునుపాయము, ఇట్టి ఆచార్యులే, యేకారణముచే తిరుమంత్రము నుపదేశించిరో, ఆకారణము చేతనే ఆచార్యులు అత్యధికులు అనియు; 'పీతాంబరధారియగు సర్వేశ్వరుడే పరమగురువై వచ్చి' యనియు; శరణాగతి విద్యనుపదేశించిన ఆచార్యులే, శిష్యునకు శ్రీవైకుంఠము క్షీరాబ్ధి ద్వారక మొదలగు సకలపుణ్యక్షేత్రములును ననియు; తండ్రియు తల్లియు భర్తయు సకలవిధ బంధువునైయున్న ఆచార్యులనే బుద్ధిమంతులగువారు, ఎల్లరకును తెలియునట్లు ప్రకాశింపజేయవలెననియు; సకలశాస్త్రములయందును ప్రసిద్ధమైయుండుటచేత ఆచార్యులకన్న నధికులు ముమ్మాటికిని లేరు.

ఉడైయవరు లోకనాడు అభయప్రదాన సందర్భమును కాలక్షేపమొనర్చుచుండగా, ధనుర్దాసుడు లేచిపోవుటను జూచి 'నీవేల వెళ్ళిపోవుచుంటివ'ని ఉడైయవరులడుగ ధనుర్దాసుడును, సకలమును విడిచి రాముడే రక్షకమని ఆశ్రయించిన విభీషణుని రక్షించుటయా మానుటయా యని సందేహించెడి రామగోష్ఠితో నాకేమిపని? యని లేచిపోవుచుంటినని దెల్ప, నమ్మాళ్వార్లు మోక్షమునందిరని ప్రసిద్ధముకలదుగదా! వారికి లభించిన మోక్షము నాకును లభించునుగదా! నాకు లభించిన మోక్షము నీకును కలదుగాన కూర్చొనుమని ఎమ్బెరుమానార్లనుగ్రహించిరి. దీనిచే ఆచార్యులే సర్వవిధబంధువని యాశ్రయించిన శిష్యునకై సర్వేశ్వరుడే వెదకుచు వచ్చి మోక్షమొసంగునని తెలియదగును. విభీషణుని ఆశ్రయించివచ్చిన నలుగురు మంత్రులనున్ను రామచంద్రుడంగీకరింపలేదా? యనిరి.

## శ్రీపెరుంబూదూరున రామానుజ విగ్రహప్రతిష్ఠ

ఇట్టి వైభవముగల ఎమ్బెరుమానారులను వారి మేనల్లుడగు దాశరథి పుత్రులగు కందాడైయాండాన్ మిక్కిలి అనువర్తించి, దేవరవారి అర్చావిగ్రహమును శ్రీపెరుంబూదూరులో సర్వకాలమును సర్వులకును సేవింపదగినట్లు ప్రతిష్ఠింపజేయవలయునని ప్రార్థింప; స్వామియు నట్లేయని

యంగీకరింప; ఆజ్ఞానను కూలురగు శిల్పుల పిలిపించి నిర్మింపజేసి భాష్యకారులకు దెల్ప, వారును దానినాలింగన మొనర్చి తమ సకలశక్తులను దానియందు జేర్చి; పుష్యమాసమున గురుపుష్యయోగమున ప్రతిష్ఠించి సకలోత్సవముల నేర్పఱచిరి.

ఈ విధమగు వైభవముగల ఉడైయవరుల అవతార విశేషములనెల్ల దెలుప నాదిశేషునకును సాధ్యముగాదుగదా. ఇట్లుండ వీరికి నూటయిరువదియైదు సంవత్సరములు నిండినవి.

## ఉడైయవరుల అంతిమయాత్ర

ఒకనాడుడైయవరులు శ్రీరంగని సేవించి పిరాట్టి పురుషకారముతో పరమార్తితో గద్యత్రయమును విన్నప మొనర్చి నిలువ, శ్రీరంగనాథుడు వీరియభిప్రాయము నెఱిగి మీకేమికావలయునని యడుగ, నెంబెరుమానార్, సంసారము నందు విరక్తిగల్గినది, కాలముగూడ నతిక్రమించినదన, పెరుమాళ్ళందులకు కాలమునకు నేనే నిర్వాహకుడనుకదా! ఇంకను కొంతకాలము మీవలన నీ లోకమును దిద్దుబాటొనర్తును వేంచేసియుండుడన; ఉడైయవరులందులకు సమ్మతింపక నాయాశ్రితులకెల్ల రక్షను నేనులభించెడి లోకమునిమ్మని ప్రార్థింప శ్రీరంగడట్లేయని సమ్మతించి నేటికి యేడవనాడు మిమ్ముల శ్రీవైకుంఠమునకు గొనిపోదునని దెల్ప;

ఉద్దైయవరులు సంతసముతో మఠమును జేరి ఆశ్రితులెల్లరను రావించి మూడురోజులు వారలకు సకలవిధ యర్థవిశేషములనెల్ల దెల్పి వీనిని మీమీ యాశ్రితులకెల్లరకును పరంపరగా నుపదేశింపుడని, నేటికి నాల్గవనాడు పరమపదనాథుని సేవింపబోవుచుంటిమని దెల్ప; వారెల్లరును మిక్కిలి కలత జెంద, వారలజూచి మీరలిట్లు మా వియోగముచే దుఃఖితులైనను ఆత్మత్యాగమొనర్చినను, పెరియనంబి ఆళవన్దార్ల శ్రీపాదసంబంధము మాకు లేనట్లొనర్చినవారగుదురు, శఠకోపుల హృదయమును కష్టపెట్టినవారగుదురుసుమా! యని యోదార్చి; చేయవలసిన కృత్యమెల్ల జేసి నాల్గవనాడు కోవెలనుంచి శ్రీరంగనియాజ్ఞచే సకలమర్యాదలతో వచ్చిన శేషవస్త్ర మాలాదుల లభించి పాథేయముగ ద్వయము నుచ్చరించుచు ఆశ్రితుల నెల్లరను గటాక్షించి చరమోపదేశముగ నిట్లనుగ్రహించిరి.

## చరమోపదేశము

సకల వేదములయందును సకలశాస్త్రములయందును సకలమగు నాళ్వార్ల దివ్యప్రబన్ధములందును సకలాచార్య వచనములందును నెచ్చటజూచినను ప్రపన్నాధికారికి ద్వయమును మించిన మంత్రములేదు; శ్రీశ్రియఃపతులకన్న నాశ్రయింపదగినది లేదు, కైంకర్యమునకన్న నుత్తమపురుషార్థము లేదు, ఆచార్యాభిమానమునకన్న మోక్షోపాయము లేదు,

చారమునకన్న మోక్షవిరోధి లేదని దెల్పి; భట్ట
రకు బిలిచి శ్రీరంగనాథుని సన్నిధికి దీసికొని
ందుగ తీర్థ ప్రసాదముల నిప్పించి తరువాత తాము
చి, తమకు మారుగ భట్టరును జూచుకొనవలసి
శితులెల్లరకు దెల్పి; భట్టరును జూచి మేల్నాడున
యను నొక దొడ్డ పండితుడు గలడని వింటిమి.
పోయి వానిని మన దర్శనప్రవర్తకునిగా జేయు
జ్ఞాపించి, శ్రీరంగనాథుని యాజ్ఞగొని మఠమున
యవరు లీలోకమున వేంచేసియున్న 120 సంవత్స
నరువది సంవత్సరములు శ్రీరంగమునను, తక్కిన
మేండ్లను యదుగిరి కంచి శ్రీభూతపురులయందును

## దేహత్యాగము—పరమపదప్రాప్తి

నంతరము సకల మంగళవాద్యములును మ్రోగు
ాశ్రితులెల్లరును సకల దివ్యప్రబన్ధానుసంధానమున
క స్నానమాడి శేషవస్త్రముల ధరించి ద్వాదశోర్ధ్వ
ులధరించి శుద్ధాచమన పూర్వకముగ నిత్యానుష్ఠాన
'నర్చి తీర్థస్వీకార మొనర్చి గురుపరంపరాపూర్వక
రహస్యత్రయము నర్థయుక్తముగ ననుసంధించి,
ాథుని దిక్కుగ నమస్కరించి ఆళవన్దారుల దివ్య

మంగళ విగ్రహమును ధ్యానించుచు పద్మాసనస్థులై పర వాసుదేవునియందు పరమభక్తిగల్గి కోవెలదిక్కుగ నెమ్బా రుల యొడిలో తలయు వడుకనంబి యొడిలో పాదములను నిడి, మాఘశుద్ధదశమీ మంద(శని)వారమున మధ్యాహ్న కాలమున శిరఃకపాలము భేదించి బ్రహ్మరంధ్రముగుండా ఉడైయవరులు తిరునాడు నలంకరించిరి.

## చరమ కైంకర్యము

అంతట కన్దాడై యాణ్డాన్ అరుళాళప్పెరుమాళెమ్బెరు మానార్ ఎమ్బార్ వడుకనంబి మొదలగువారెల్లరును మొదలునరికిన చెట్లవలె నేలపైబడి దుఃఖింప; శ్రీరంగనాథు డును మా ఉడైయవరులను యెడబాసితిమే యని విచారించి ఆరగించక దేవేరులతోగూడి ఆళ్వారులెల్లరును వెంటరాగా ఆలయము వెడలి వేయిస్తంభముల మంటపమున నాస్థానస్థులై తమ యర్చకులగు ఉత్తమనంబిని సకల లాంఛనములతో మఠమునకు బంప, నచ్చటి ప్రధానులెల్లరును తేఱి, 'యిక చేయవలసినది చేయుతగున'ని ఉడైయవరుల చరమవిగ్రహము నకు స్నానమొనర్పజేసి శేషవస్త్రమలంకరించి ద్వాదశోర్ధ్వ పుండ్రముల ధరింపజేసి శేషమాలను సమర్పించి తిరుకురుకై ప్పిరాన్‌పిళ్ళాన్ శ్రీహస్తముతో బ్రహ్మమేధవిధి సంస్క రింపజేసి దివ్యవిమానమున సకలమంగళవాద్యములు

ఘోషింప ఛత్రచామరాది సకల మర్యాదలతోను ఏడు వందల జీయరులు బ్రహ్మవల్లి భృగువల్లి నారాయణాను వాకము మొదలగు ఉపనిషత్తులు జదువ, భట్టరు మొదలగు వారు తగు పరికరములు గొని నడువ, ఉపవీతాధికారులగు శ్రీవైష్ణవులు తొమ్మిదివేలమందియు ఉపవీతాధికారులుకాని వైష్ణవులు పన్నెండువేలమందియుగూడి ఆళ్వార్ల దివ్యప్రబన్ధములగు మూవాయిరములను మున్నడిపిన్నడిగ సేవింప, తిరువరంగప్పెరుమాళరయర్ మొదలగువారు ఏడువందలమంది తిరువాయ్మొళ్ళి విన్నవింప, తమ్బిరాన్మాళ్ రాగతాళయుక్తముగ తిరువాయ్మొళ్ళి పాడ, అముతనారు మొదలగు వారు నూత్తన్దాది సేవింప, ఎమ్బార్ మొదలగువారు సకల స్తోత్రముల జదువ, వీధులనెల్ల పూలుజల్లుచు వస్త్రములపై నడచుచు, చెలికుగడలు పూర్ణకుంభములు ధరింప, సుమంగళులు దీపములు ధరించి ముందునడువ, రెండుప్రక్కల చామరములతో, చిరుచిన్నములు మ్రోగ, ప్రదక్షిణించి, ఆళ్వార్ల తిరుమేనువలె ఆవరణము లోననే యతిసంస్కారవిధిన త్రవ్వి తిరుప్పళ్ళియొనర్చిరి.

శ్రీరంగనాథుడును దేవేరులతోగూడి ఉడైయవరులకు అవభృదోత్సవము జరిపించి పదమూడవనాడు తిరువధ్యయనోత్సవానంతరము అర్చామూర్తిని ప్రతిష్ఠింపజేసెను.

దీనిచే శ్రీరామకృష్ణాది చరితముపగనే శ్రీరామానుజాచార్య చరిత్రమును శ్రీవైష్ణవులకు సదానుసంధేయము.

ఉడైయవరుల తిరునక్షత్రము చైత్రమాసమున ఆర్ద్రా నక్షత్రము.

## ధనుర్దాసు దంపతుల అన్తిమదశ

పిళ్ళైయుఱఙ్గావిల్లిదాసర్ అను పేరుగల ధనుర్దాసుడు తన అంతిమదశయందు ఆచార్యులెల్లరను రావించి శ్రీపాద తీర్థముగొని భార్యయగు హేమాంబనుజూచి 'నాయెడ బాపునకు నీవు మరణింప యత్నింపకుమ'ని చెప్పి, ఉడైయవరుల తిరువడిగళును తన శిరస్సుపై ధరియించి పరమపదించెను. పొన్నాయ్చ్చియు దుఃఖింపక వాకిలియూడ్చి నీళ్ళు జల్లి ముగ్గులుబెట్ట, స్వాములును ఉడైయవరులు స్నానమొనర్చెడి కావేరి రేవునందలి తీర్థము గొనివచ్చి ధనుర్దాసుని చరమశరీరమునకు స్నానమొనర్పజేసి శ్రీచూర్ణపరిపాలనాది శ్రీవైష్ణవాలంకారములనెల్ల నొనర్చి శ్రీరంగనాథుని శేషవస్త్రమును మాలను ధరింపజేసి దివ్యవిమానమున జేర్చి మరుభూమికి గొనిపోవుచుండ ధనుర్దాసునిభార్య (పొన్నాయ్చ్చి) హేమాంబయు కనుజూపుమేర పోవువరకు జూచుచునుండి, దేహమునువీడి తిరునాడలంకరింప; స్వాములు తెలిసి తిరిగివచ్చి యామెకును శ్రీచూర్ణపరిపాలన మొనర్చి తీసికొనిపోయి ధనుర్దాసు దంపతులిరువురను నొకేచోట తిరుప్పళ్ళిమొనర్చిరి.

# ఎమ్బార్ల చరమయాత్ర

శ్రీరామానుజ పదచ్ఛాయా భూతుండగు గోవింద మిశ్రులు ఆచార్యవిశ్లేషమును సహింపలేక శ్రీరంగని యాజ్ఞ గొని తమ చరమావధిన ఆచార్యశ్రీపాదముల శిరసున ధరించి తమ మఠమున భగవదారాధన మొనర్చి భగవద్భాగవత శేషప్రసాదమును కొద్దిగ స్వీకరించి భట్టార్యుని దర్శన స్థాపనమున శేర్పఱచి పద్మాసనస్థులై ఆచార్య దివ్యమంగళ విగ్రహమును ధ్యానించుచు పరమపదమలంకరింప, భట్టార్యులు ఆచార్యవిశ్లేషమునకు మిక్కిలి దుఃఖించి స్వాములచే నూరడింపబడి ధైర్యముగొని ఆచార్యపుత్రులగు శిఱియ గోవిందునిచే చరమకైంకర్య మొనర్పజేసి తిరువధ్యయనోత్సవము జరిపించిరి.

శ్రీశఠకోప నాథ యామున యతీంద్ర ప్రముఖ పూర్వాచార్యులెల్లరును కాలతత్త్వమున్నంతవరకును ఆశ్రిత చేతన సంరక్షణార్థము లీలావిభూతి నలంకరించియుందురు గాన, పెద్దలు వారికి తీర్థదినము నాచరింపరు. ఇది సంప్రదాయపరమ రహస్యము.

## ఉడైయవరుల తిరునక్షత్ర తనియన్

శ్లో॥ మేషార్ద్రాసమ్భవం విష్ణో ర్దర్శన స్థాపనోత్సుకమ్।
తుణ్డీరమణ్డలే శేషమూర్తిం రామానుజమ్భజే॥

,, కల్యబ్దే దివ్యకుమ్భే బుధజనవిదితే వత్సరే పిఙ్గళాఖ్యే
చైత్రేమాసే గతేచత్రియుత దశదినేదీప్యమానేహిమాంశౌ।
పఞ్చమ్యార్ద్రాసమేతే సురగురుదివసేకర్కటాఖ్యేచ లగ్నే
శ్రీమాన్రామానుజార్యస్సమజని నిగమాన్తార్థసంరక్షణార్థం॥

నిత్య॥ యోనిత్యమచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ।
వ్యామోహత స్తదితరాణి తృణాయమేనే।
అస్మద్గురోర్భగవతోస్య దయైకసిన్ధో।
రామానుజస్య చరణౌ శరణంప్రపద్యే॥

## వాళ్తితిరునామములు

అత్తిగిరియరుళాళరడి పణిన్దోన్ వాళ్తియే।
అరుట్కచ్చినమ్బి యురైయాఱు పెత్తోన్ వాళ్తియే।
పత్తియుడన్ బాషియత్తై ప్పగర్న్దిట్టాన్ వాళ్తియే।
పదిన్మర్కలై యుట్పొరుళై ప్పరిన్దుకత్తోన్ వాళ్తియే।
శుత్తమగిళ్ మారనడి తొళుతుయ్న్దోన్ వాళ్తియే।
తొల్ పెరియనమ్బి శరణ్ తోన్డినాన్ వాళ్తియే।
శిత్తిరై యిలాదిరైనాళ్ శిఱక్కవన్దోన్ వాళ్తియే।
శీర్ పెరుమ్బూదూర్ మునివన్ తిరుపడిగళ్ వాళ్తియే॥

ఎణ్డిశై యెణ్ణిళై యాళ్వారెతిరాశన్ వాళియే।
ఎళుపత్తునాల్వర్ కుల్ మెణ్ణాళు త్తాన్ వాళియే।
పణ్డై మఱైయై త్తెరిన్ద బాషియత్తోన్ వాళియే।
పరకాలనడియిణై యై పరవుమవన్ వాళియే।
తణ్డమిళ్ నూల్ నమ్మాళ్వార్ శరణాన్ వాళియే।
తారణియుం విణ్ణులగుం తానుడైయోన్ వాళియే।
తెణ్డిరై శూళ్ బూదూరెమ్బెరుమానార్ వాళియే।
శిత్తిరైయిల్ శెయ్యతిరువాదిరైయోన్ వాళియే॥
శీరారుమెతిరాశర్ తిరువడిగళ్ వాళియే।
తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వాళియే।
ఏరారుం శెయ్యవడి ఎప్పొళుదుం వాళియే।
ఇలఙ్గియ మున్నూల్ వాళి యిణైత్తోళ్ గళ్ వాళియే।
శోరాద తుయ్య శెయ్య ముగచ్చోతి వాళియే।
తూమునువల్ వాళి తుణైమలర్కణ్గళ్ వాళియే।
ఈరాఱు తిరునామమణిన్ద వెళిల్ వాళియే।
యిని తిరుప్పొళ్లిల్ ఞానముద్దిరై వాళియే॥
అఱుశమయచ్చెడియదనై యడియఱుత్తాన్ వాళియే।
అడర్న్దువరుం కుదిట్టిగళై యఱత్తుఱన్దాన్ వాళియే।
శెఱుకలియై చ్చెఱిదుమఱ త్తీర్తవిట్టాన్ వాళియే।
తెన్నరఙ్గర్ శెల్వముత్తుం తిరుత్తివైత్తాన్ వాళియే।
మఱైయదనిల్ పొరుళనైత్తుం వాయ్మొళిన్దాన్ వాళియే।
మాఱనురై శెయ్ద తమిళ్ మఱై వళర్త్తోన్ వాళియే।

అఱుమిగు నల్పెరుమ్బూదూ రవతరిత్తాన్ వాఴ్తియే।
అఴగారుం ఎతిరాశర్ అడియిణైగళ్ వాఴ్తియే॥
శఙ్కర పాస్కర యాదవ బాట్ట పిరపాకరర్ తఙ్గళ్
శాయ్వుఱ వాదియర్ మాయ్వుఱుమెన్ఱు శదుమఱైవాఴ్న్దిడు;
వెఙ్గలియిఙ్గినివీఱు నమక్కిలై యెన్ఱు మిగత్తళర్ నాళ్।
మేదిని నఙ్జుమై యాఱుమెనత్తుయర్ విట్టు పిళఙ్గియ నాళ్।
మఙ్గైయరాళి పరాఙ్కుశమున్నవర్ వాఴ్వుముళైత్తిడునా
మన్నియ తెన్నరఙ్గాపురి మామలైముత్తుమువన్దిడునాళ్।
శెఙ్గయల్ వావిగళ్ శూఴ్ వయల్ నాళుంశిఱన్దపెరుమ్బూదూర్।
శ్రీమానిళైయాఴ్వార్ వన్దరుళియ నాళ్ తిరువాదిరై నాళ్

## నాళ్ పాట్టు

ఇన్ఱులగీర్ శిత్తిరైయిల్ ఏయ్న్ద తిరువాదిరై నాళ్।
ఎన్ఱైయినుం ఇన్ఱిదనుక్కేత్తమెన్దాన్। ఎన్ఱవర్కు
చ్చాత్తుగిన్ఱేన్ కేణ్మిన్ ఎతిరాశర్దం పిఱప్పాల్।
నాల్దిశైయుం కొణ్డాడుం నాళ్॥

ఆఴ్వార్గళ్ తాఙ్గళ్ అవదరిత్త నాళ్గళిలుమ్।
వాఴ్వాన నాళ్ నమక్కు మణ్ణులగీర్?। ఏఴ్ పారుమ్
ఉయ్య ఎతిరాశరుదిత్తరుళుమ్। శిత్తిరైయిల్
శెయ్య తిరువాదిరై॥

శ్రీమతే రామానుజాయ నమః

## మా

## ఇతర గ్రన్థములు

| | | |
|---|---|---|
| ముదలాయిరమ్ (అర్థము-తాత్పర్యముగ) | | రూ. 100/- |
| పెరియతిరుమొఴి | ,, | 125/- |
| ఇయఱ్పా | ,, | 75/- |
| తిరువాయ్మొఴి | ,, | 100/- |
| సంగ్రహ నిత్యానుసంధానము ,, | | 15/- |
| (తిరుప్పల్లాణ్డు, తిరుప్పళ్ళియెఴుచ్చి, తిరుప్పావై, ఉపదేశరత్నమాల) | | |
| నాచ్చియార్ తిరుమొఴి (అర్థతాత్పర్యముతో) | | 12/- |
| ఇరామానుశనూత్తన్దాది | ,, | 8/- |
| కణ్ణినుణ్ శిఱుత్తామ్బు | ,, | 1-25 |
| తిరుమంత్రార్థము (సూత్ర త్రార్థములు) | | 8/- |
| శ్రీవచనభూషణము ( ,, లఘువ్యాఖ్యతో) | | 12/- |
| శ్రీమద్భగవద్గీత (సవ్యాఖ్య) | | 100/- |